# చతుర

మార్చి 1986

రూ. 2/-



విపుల కథల పోటీ

రూ. 1,00,000 బహుమతులు

చతుర నవలల పోటీ

# చతుర

సంపుటి : 9 మార్చి 1986 సంచిక : 2

## ఈనెల సమగ్ర నవల

ఆమె తనకు జైలునుంచి విడుదల లభిస్తున్నదని తెలియగానే "లోకుల దృష్టిలో నేనో హంతకిని. అవహేళనలతో ప్రాణాలు తీసే ఆ మనుషుల మధ్యకు నేను వెళ్ళలేను. నన్నిక్కడే వుండ నివ్వండి. నా జీవితాన్ని ఈ నాలుగ్గోడల మధ్యనే సమాధి కాని వ్వండి" అని కన్నీటితో వేడుకుంది.

సంతోషించవలసిన ఆ తరుణంలో ఆమె అలా ఎందుకు విలపించింది? ఆమె నిజంగా హంతకురాలేనా? అయితే ఏ పరిస్థితుల్లో ఆమె ఆ హత్య చేసింది?

ఎంతటి దురదృష్ట సంఘటనలు జరిగినప్పటికీ ఆమె జీవితంలో ఆ తర్వాత కూడా...

# చెదరని స్వప్నం

గానే నిలిచినదేమిటి?

దాన్ని ఆమె ఎలా శాశ్వతం చేసుకోగలిగింది?
తన వారిని కోల్పోయి బంధువుల పంచనచేరిన ఓ ఆడపిల్ల జీవితం నిరాదరణకు గురై కఠిన వాస్తవాల్ని ఎదుర్కోక తప్పదా?

## రెడ్డి స్వరాజ్యలక్ష్మి

హృద్యమైన చిత్రణతో ఆసక్తిదాయకంగా మలచిన "చెదరని స్వప్నం" ఈ నెల 'చతుర సమగ్ర నవల!'

---

కవర్ పేజీ ఫొటోగ్రాఫర్ : దిలీప్ బెనర్జీ

1986 మే నెల 100వ సంచికగా వెలువడుతున్న సందర్భంగా

విశ్వకథా విపంచి

# విపుల

రు. 50,000/-
బహుమతులు

## కథల పోటీ

| | | |
|---|---|---|
| | | రు. |
| ఒక అత్యుత్తమ తెలుగు కథకు | ... | 3,000 |
| ఒక అత్యుత్తమ ఆంధ్రేతర భారతీయ భాషాకథకు– ఏ భాషవయినా | ... | 3,000 |
| మూడు ఉత్తమ కథలకు రు. 1,000 చొప్పున | ... | 3,000 |
| పది మంచి కథలకు రు. 500 చొప్పున | ... | 5,000 |
| 120 కథలకు కన్సొలేషన్ బహుమతులు రు. 300 చొప్పున | ... | 36,000 |

నిబంధనలు :

* ఇతివృత్తం తెలుగు వారి జీవితానికి సంబంధించినదే అయి ఉండాలి. ఆసక్తికరంగా చదివించి, ఆలోచింపజేయగల నూతన ప్రయోగాలకు ప్రత్యేక ప్రాధాన్యత. అనువాదాలు, అనుసరణలు పనికిరావు.
* కథ నిడివి 10నుండి 15 అరఠావుల వరకూ ఉండవచ్చును. కథ వ్రాతప్రతిలో ఎక్కడా రచయిత/త్రి పేరుగాని, చిరునామాగాని ఉండరాదు. మొదటి పేజీలోనే ప్రత్యేకించి రచన, రచయిత/త్రి వివరాలు, చిరునామా ఉండాలి. తగినన్ని స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు ప్రతి రచనతోనూ తప్పనిసరిగా జత పరచాలి.
* కలంపేరు వాడినా, రచయిత/త్రులు తమ పూర్తిపేరు, చిరునామా మొదటిపేజీలోనే తెలపాలి. కథ తమస్వంత రచనేగాని అనుకరణ కాదనీ, మరేపత్రికకూ పంపలేదనే హామీపత్రం జతపరచాలి.
* రచనల ఎన్నిక, బహుమతుల నిర్ణయం ఇత్యాది విషయాలన్నింటా సంపాదకునిదే తుదినిర్ణయం. ఈ విషయంలో ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.
* తెలుగేతర భాషా కథలకు ఇచ్చే బహుమతులు ఆయా భాషా రచయితలకి ఉద్దేశించిన ప్రత్యేక పోటీకి మాత్రమే. కనుక అనువాద కథలను ఈ పోటీకి పంపవద్దని మనవి.
* కవరుమీద తప్పనిసరిగా తెలుగు కథలపోటీకి అని పేర్కొనాలి.

రచనలు మాకు చేరవలసిన ఆఖరుతేదీ **30-4-1986**

ఎడిటర్,

విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాద్-500482

1986 మే నెల 100వ సంచికగా వెలువడుతున్న సందర్భంగా

నవ నవలా వేదిక

# చతుర

# నవలల పోటీ

**రు. 50,000/-**

**బహుమతులు**

| | రు. |
|---|---|
| ఒక అత్యుత్తమ నవలకు | ... 10,000 |
| ఒక ఉత్తమ నవలకు | ... 6,000 |
| ఒక మంచి నవలకు | ... 4,000 |
| పది నవలలకు కన్సొలేషన్ బహుమతులు (నవలకు రు. 3000/- చొప్పున) | ... 30,000 |

నిబంధనలు :

* కథావస్తువు తెలుగువారి జీవితానికి సంబంధించినదై వుండాలి. 'చతుర'లో నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా, అంటే 26 వేల పదాలకు తక్కువకాకుండావుండాలి! 'చతుర' కొరకై ప్రత్యేకంగా ఈ దృష్టితో రాసిపంపిన నవలలు మాత్రమే పరిశీలనార్హమవుతాయి.
* బహుమతి పొందని నవలల్లో సాధారణ ప్రచురణార్హమైనవి స్వీకరించి మామూలుగా ప్రచురించే అవకాశంవుంటుంది. అలా ఎన్నికచేసిన నవలలకు మామూలుగా పారితోషికం రు. 2,000 వుంటుంది.
* నవలల్ని ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే పోటీలో పాల్గొనాలి.
* నవల స్వంత రచనేనని, అనుకరణకాదని, మరే ఇతర పత్రికల పరిశీలనలోలేదని ధృవపరిచే హామీపత్రాన్ని విధిగా జత పరచాలి.
* ప్రచురణకై ఎన్నికకాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యతవుండదు. తర్వాత ఉత్తరాలు రాయడంవల్ల ప్రయోజనంవుండదు.
* బహుమతుల నిర్ణయం, ఇత్యాదివిషయాలన్నింటిలోనూ సంపాదకునిదే తుది నిర్ణయం. ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు, వాద వివాదాలకు అవకాశంలేదు. గడువు తేదీ ముగిశాక వచ్చిన నవలలు పోటీకి పరిశీలించబడవు.

నవలలు మాకు చేరవలసిన ఆఖరు తేదీ **30-4-1986**

ఎడిటర్,

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాద్-500 482

# నేతూరి ప్రపంచం

## 'రుచిక'

వీపు పై బండెడు పుస్తకాల సంచి బరువును మోయలేక మోస్తూ, కాళ్ళీడ్చుకుంటూ స్కూళ్ళకువెళ్లే పసిపిల్లలను రోజూ మనం చూస్తూనే వుంటాం. చాలామంది అనుభవజ్ఞులు మన విద్యావిధానాన్ని వ్యతిరేకిస్తున్నారు. మనదేశంలో విద్య పిల్లలపై పసి వయసు నుంచే అధిక భారాన్ని మోపుతూ, బాల్యంలో వారి ఆనందాన్ని భగ్నం చేస్తూ, వారిలో నేర్చుకోవాలనే జిజ్ఞాసను సైతం హరిస్తోందని వారి భావన.

పిల్లల స్వభావాల కనుగుణంగా 1978లో భువనేశ్వర్‌లో ఇంద్రజిత్ ఖురానా అనే పంజాబీ మహిళ 'రుచిక' అనే పాఠశాలను స్థాపించి నడుపుతోంది. 1 సంవత్సరం 10 మాసాల వయసు నిండిన పిల్లలకు అందులో ప్రవేశార్హత లభిస్తుంది. స్కూలులోని బేబీ క్లాసు, 1వ నర్సరీ, 2వ నర్సరీ, జూనియర్ కిండర్‌గార్టన్, సీనియర్ కిండర్‌గార్టన్ అనే అయిదు సెక్షన్లకీ ఏడుగురు ఉపాధ్యాయినులున్నారు. వీరు కాక పిల్లలకి బేబీ క్లాసు నుంచే సంగీతం, నృత్యం నేర్పేందుకు వేరే టీచర్లున్నారు. స్కూలు ప్రతిరోజూ ఉదయం 9 నుంచి మధ్యాహ్నం 12 గంటల మధ్య, వేసవిలో 8 నుంచి 11 గంటల మధ్యా నడుస్తుంది.

పిల్లలను బైటప్రపంచంలోకి తీసుకువెళ్లి తిప్పడం 'రుచిక' పాఠశాలలో అతి ముఖ్యమైన అంశం. ప్రతి క్లాసులోని పిల్లలను వారానికి రెండుసార్లు షికారుకు బైటకు తీసుకెళ్తారు. కింది తరగతి పిల్లలను పార్కులు, తోటలకు; పైతరగతి వారిని విమానాశ్రయం, రైల్వేస్టేషన్, పోస్టాఫీసులాంటి ప్రదేశాలకు తీసుకెళ్లి వాటిని తెలుసుకునేట్టు చేస్తారు. ట్రాఫిక్ నిబంధనల గురించి పిల్లలకు గదిలో నాలుగ్గోడల మధ్య కూర్చోబెట్టి బోధించడానికి బదులుగా వారిని జట్లుగా రోడ్డు మీదకే తీసుకెళ్ళి ఎరుపు, ఆకుపచ్చ, ఇతర ట్రాఫిక్ సిగ్నల్స్ గురించి అర్థమయ్యేట్టు చేస్తారు. వేసవి కాలంలో పాఠశాలలో వున్న చిన్న నీళ్ళ టాంకులో పిల్లల్ని మునకలువేసి ఆడుకోనిస్తారు.

పండుగలన్నింటినీ స్కూలులో సంబరంగా జరుపుకుంటారు. పిల్లల చేత రక్షాబంధనం నాటికి రాఖీలు, దీపావళికి ప్రమిదలు, ఆగస్టు 15, జనవరి 26 లాంటి జాతీయ దినోత్సవాలకు మువ్వన్నె జెండాలను తయారుచేయిస్తారు. తాము చేసినవాటిని పిల్లలు ఇళ్లకు తీసుకెళ్ళచ్చు. కొన్నిటిని స్కూలు సంపదగా భద్రపరుస్తారు. దీపావళికి టపాసులు కొని పిల్లలతో వాటిని స్కూలులో నే కాల్పిస్తారు.

ప్రతి విద్యార్థికీ బేబీక్లాసునుంచే బొమ్మలు గీయటంపట్ల అభిలాష కల్పిస్తారు. పిల్లలు స్కూలు వదిలి వెళ్లేటప్పుడు అంతవరకూ బొమ్మలు గీసిన డ్రాయింగు పుస్తకాన్ని వారికే బహూకరిస్తారు. 'రుచిక'లో







పిల్లల్ని చేర్పించే తల్లిదండ్రులకి వారి ఫీజు తప్ప మరో ఖర్చువుండదు. పిల్లలకి రంగులు, కుంచెలు, నోటు పుస్తకాలు, పెన్సిళ్లు, తదితరాలు స్కూలు వారే ఇస్తారు. 'రుచిక' పిల్లల ఆటపాటలు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకేగాక మంచి చదువు, క్రమశిక్షణలకి కూడా నిలయమని చెప్పవచ్చు!

## ఓ ముద్దు చాలు!

**హాలీవుడ్‌లోని** అమెరికన్ ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లో ఛాయాగ్రాహ, దర్శకత్వ శాఖల్లో రెండేళ్ళ డిప్లొమాకోర్సు పూర్తిచేసి మనదేశానికి తిరిగొచ్చిన భారతీయుడు ముక్తసుందర్ అక్కడి విశేషాల గురించి ఈవిధంగా తెలిపాడు.

"ఆ ఇన్‌స్టిట్యూట్‌లో ప్రవేశానికై ప్రతియేటా 500మంది విద్యార్థులకిమించి దరఖాస్తు చేస్తారు. కాని, అందులో 60 మందినిమటుకే చేర్చుకుంటారు. 'సౌండ్ ఆఫ్ మ్యూజిక్' చిత్ర దర్శకుడు రాబర్ట్ వైస్ దాని నిర్వాహకుడు. 85 ఏళ్ళ వయసులో కూడా నవయువకుడిలా వుత్సాహంగా తిరిగే ఆయన సినిమాల విషయంలో విజ్ఞాన సర్వస్వంలాంటివాడు!

"నేను కోర్సులోచేరిన కొత్తలో అర గంటపాటుసాగే 'స్మాల్ డిటెయిల్స్' అనే వీడియో సినిమా తీశాను. రాబర్ట్ వైస్ ఆ సినిమా చూసి, ఫిల్ముని ముక్కలు ముక్కలుగా చింపేసి, 'నీ చిత్రీకరణలో అనేక లోపాలున్నాయి. ఇక్కడ క్లోజప్ తీయడం అనవసరం. ఇక్కడ లాంగ్ షాట్ ఎందుకు వుపయోగించావు? భార్యాభర్తల అన్యోన్యాన్ని తెలపడానికి అంత పొడుగాటి సంభాషణలెందుకు? దానికి బదులుగా వారిమధ్య ఓ చుంబనదృశ్యాన్ని చిత్రీకరిస్తే సరిపోయేది కాదూ ...?' అన్నాడు.

"హాలీవుడ్‌లోని యూనివర్సల్ స్టూడియోస్‌లో 'న్యూయార్క్ స్ట్రీట్' అనే సెట్టింగు వుంది. అది అచ్చం న్యూయార్క్‌లోని బ్రాడ్‌వే స్ట్రీట్‌కు మల్లేనే వుంటుంది. సాధారణంగా న్యూయార్క్ బ్రాడ్‌వే స్ట్రీట్‌లో తీయవల్సిన దృశ్యాలన్నింటినీ, మార్చకుండా శాశ్వతంగా వుండే ఆ సెట్‌లోనే చిత్రీకరిస్తారు.

"ప్రస్తుతం హాలీవుడ్‌లో రెండు అత్యంతాధునిక కెమేరాలు వాడుకలో వున్నాయి. అవి పానావిజన్ కెమేరా, బి-2ర కెమేరాలు. వాటికి వీడియో కూడా అమర్చివుంటుంది. ఆ కెమేరాలతో సినిమా చిత్రీకరణ జరుపుతున్నపుడే, దానితో పాటు వీడియో రికార్డింగ్ కూడా జరిగిపోతుంది. అందువల్ల ఎప్పటికప్పుడు షూటింగ్ పూర్తికాగానే దర్శకుడు వీడియోలో దాన్ని చూడగలడు. దాని వల్ల బాగావచ్చిన షాట్‌ను వుంచుకుని మిగిలినవాటిని రద్దుచేయవచ్చు.

"అక్కడ కారు ఛేజింగ్ దృశ్యాలు చిన్న మోడలుకార్లపై తీస్తారు. దాదాపు డజనుమంది ఆ బొమ్మకార్లను రిమోట్ కంట్రోల్‌ద్వారా నడిపించి ఒకదాన్ని ఒకటి ఢీకొనేట్టు చేస్తారు. రోడ్లపై మాత్రం నిజమైన కార్లు వేగంగా పోతున్నట్టు చిత్రీకరించి ఎడిటింగ్‌లో ఆ తేడా తెలియకుండా జాగ్రత్తపడటంతో సినిమా చూస్తున్న వారికి నిజంగా, నిజమైన కార్లే ఢీకొంటున్న భ్రమ కలుగుతుంది.

"ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లో 10మంది విద్యార్థులకి ఒక గదిచొప్పున కేటాయిస్తారు. ప్రతి గదిలోనూ విసిఆర్‌లు కూడా వుంటాయి. నేను విద్యార్థిగావున్న రెండేళ్ళలో వీడియోలో 1,200 ఉత్తమ శ్రేణి చిత్రాలు చూసి, వాటిద్వారా చిత్రీకరణకు సంబంధించి ఎన్నో పాఠాలు, మెలకువలు నేర్చుకున్నాను.

"అక్కడ వుండగా రాబర్ట్ వైస్ మా కోసం 'గాంధీ' చిత్రాన్ని ప్రదర్శించి, అది ముగిశాక ఇలా చెప్పాడు: "మీ విద్యార్థులు ఈ సినిమా బాగోగులగురించి మాట్లాడుకుంటే గనక ఇది మంచిసినిమా అని చెప్పవచ్చు.కాని . కేవలం దర్శకత్వం, కెమేరా టెక్నిక్‌ల గురించి మాట్లాడుకున్నారంటే ఇది మంచి సినిమా కాదని అర్థం!"




## ఫ్లోటింగ్ హోటల్స్

కాశ్మీర్, కేరళలలో సరస్సులలో వుండే బోట్ హౌస్‌లకి మల్లే హాంగ్‌కాంగ్‌లో సిటీలో తేలియాడే హోటళ్ళున్నాయి. అవి మనదేశంలోని ఫైవ్‌స్టార్ హోటళ్ళంత వైభవంగా వుంటాయి!

హాంగ్‌కాంగ్ వెళ్ళిన పర్యాటకులను






అమితంగా ఆకర్షించే ఆ హోటళ్ళలో నోరూరించే వంటకాలెన్నింటినో వండి వడ్డిస్తారు. తేలియాడే హోటళ్ళలో రెండు రకాలవి ఉన్నాయి. కొన్నింటిలో ఆహార, ఫలహారాలు మాత్రమే లభిస్తాయి. మరి కొన్నింటిలో తిండి దొరకడమేకాక, నృత్య ప్రదర్శనలు జరపడం, చిన్న చిన్న టూర్లు నిర్వహించడం సైతం ఉంటుంది. ఎవరి స్తోమతను బట్టి వాళ్లు ఆ హోటళ్ళలో బస చేస్తారు.

హాంగ్‌కాంగ్‌లో వీలైనన్ని రకాల చైనీస్ వంటకాలు ఆ హోటళ్ళలో తినవచ్చు. వాటిలో చేపలతో తయారుచేసేవే ఎక్కువ. సముద్రంలోంచి చేపల్ని పట్టి తెచ్చి, వండి నిముషాలలో కస్టమర్లకు వడ్డించడం వారి ప్రత్యేకత!

ఆహారం మాత్రమే దొరికే తేలియాడే హోటళ్ళలో జంబో అతి పెద్దది. రెండంతస్తుల ఆ హోటల్ విలువ 47 కోట్లు. ఆ హోటల్‌ని కొత్త దంపతులు అధికంగా ఇష్టపడతారు. అందుచేత దాన్ని 'హనీ మూనర్స్ హోటల్' అని కూడా అంటారు. ఆ హోటల్‌లో ప్రవేశానికి ఓ వింత షరతు వుంది. కొత్తగా పెళ్ళయిన యువతి ఆ హోటల్లో అడుగు పెట్టేటప్పుడు ఎరుపు దుస్తులే ధరించివుండాలి. ఆమెకు ఎరుపు దుస్తులు లేకపోతే జంబో హోటల్ వారే వాటిని అద్దెకిస్తారు.

ఆహార, మద్యపానీయాలతో పాటు నృత్యాలు కూడా జరిగే హోటళ్ళలో జేడ్ ప్రిన్సెస్ అతి పెద్దది. 120 కోట్ల ఖర్చుతో నిర్మించిన ఆ హోటల్‌లో 1,200 రకాల వంటకాలు దొరుకుతాయి. అందులో ఏకకాలంలో 3వేల మంది భోంచేయవచ్చు. రెండంతస్తుల ఆ హోటల్‌లో 2 వేలకు పైగా జంటలు నృత్యం చేయవచ్చు.

ఆ హోటల్‌లో ప్రవేశించగానే అందమైన యువతులు కస్టమర్లను ఫొటో తీస్తారు. అరగంటలో ఆ ఫొటోలను కస్టమర్లకు అందజేస్తారు. వాటిని 50 రూపాయలు చెల్లించి తీసుకోవాలి. అది నిర్బంధం కాదు. అయినా చాలామంది నిరాకరించకుండా డబ్బులుకట్టి ఫొటోలు తీసుకుంటారు.

ఆ హోటల్‌లో డిన్నర్ తర్వాత

'జాస్మిన్ టీ' ఇస్తారు. అతి రుచికరమైన, ఖరీదైన ఆ టీ తాగితే తిన్నదంతా జీర్ణమవుతుంది.

## 'మన' వినోబాభావే

కుట్టిజీని దక్షిణాది వినోబాభావేగా పేర్కొంటారు. వినోబా ఆదర్శ సిద్ధాంతాలతో ప్రభావితుడై, ఇప్పటికీ ఆయన అడుగుజాడల్ని అనుసరిస్తున్నందువల్ల అతనికా పేరు వచ్చింది. కుట్టిజీ చేతులు చచ్చుపడినా, కొన్ని వ్యాధులతో బాధ పడుతున్నా తన దీక్షను మాత్రం వదిలి పెట్టలేదు.

కర్నాటకలోని మెల్కోటే పట్టణానికి చెందిన కుట్టిజీ అసలు పేరు శేషక్కర్. 1951లో బుద్ధగయలో జరిగిన సర్వోదయోద్యమ వార్షిక సమావేశంలో జయప్రకాశ్ నారాయణ, వినోబాభావేలు భూదానోద్యమ సూత్రాల గురించి ప్రసంగించారు. అది విని కదిలిపోయిన కుట్టిజీ తనను తాను భూదానోద్యమానికి అంకితం చేసుకునేందుకు సిద్ధపడ్డాడు. అతనితో పాటు ఎందరో యువతీయువకులు కూడా ఆ ఉద్యమంలో చేరేందుకు ముందుకొచ్చారు. కుట్టిజీ అందులో చేరకముందు స్వాతంత్రోద్యమంలో ప్రముఖంగా పాల్గొని అనేకసార్లు జైలుకి వెళ్ళొచ్చాడు.

వినోబాభావే మెల్కోటే వెళ్ళినపుడు చేతులు చచ్చుపడిన కుట్టిజీ దురవస్థ గమనించాడు. అతన్ని ఓదారుస్తూ, "చేతులు పనికిరాకపోతేనేం, కాళ్లున్నాయిగనుక నువు పాదయాత్రచేసి భూదానసర్వోదయ సిద్ధాంతాల గురించి ప్రచారంచేయవచ్చు కదా! ఈ వ్యాపకం నీ మనోవేదనను కొంత తగ్గిస్తుంది కూడా" అని చెప్పాడు.

ఆ మాటలతో ఎంతో స్ఫూర్తి పొందాడు కుట్టిజీ. తనలోకి నూతన రక్తం ప్రవహించినట్టు ఉత్సాహంగా గత 21 ఏళ్ళనుంచీ అతను సర్వోదయ సందేశాన్ని వ్యాప్తిచేసేందుకు దక్షిణభారత దేశంలోని గ్రామాలలో తిరుగుతున్నాడు. భూదానయజ్ఞం కోసం కుట్టిజీ అంత ఎక్కువగా పాదయాత్రలు చేసినవారు మరొకరు లేరు.

కుట్టిజీకి కన్నడ, ఆంగ్ల, తమిళ, సంస్కృత, మరాఠీ, గుజరాతీ, తెలుగు, హిందీ మొదలగు అనేక భాషల్లో మంచి పాండిత్యం వుంది. అతను ఉద్యమ వ్యాప్తికై గ్రామాల్లోతిరుగుతూ ఒక్కొక్కప్పుడు భగవద్గీతపై కూడా చిన్న చిన్న ప్రసంగాలు చేస్తుంటాడు. అవి వినేందుకు అనేకమంది ప్రజలు వస్తారు.

సర్వోదయోద్యమంలో వినోబాభావే తరువాతి స్థానం కుట్టిజీదే! కర్నాటకలో సర్వోదయోద్యమ నాయకుడు దొరైస్వామి, "నేను 14 ఏళ్లు మాత్రమే పాదయాత్రలు చేస్తే, కుట్టిజీ 21 సంవత్సరాలు చేశారు. ఆయన ఉత్సాహం, ఈ ఉద్యమానికి అంకితమైన విధం చూస్తే నాకు ఆశ్చర్యంగా వుంటుంది" అంటాడు.

ఎడతెగకుండా పాదయాత్రలు చేయడంవల్ల అనారోగ్యం పాలవడంతో, కుట్టిజీ చికిత్సకోసం పౌనార్ ఆశ్రమంలో చేరి ఓ సంవత్సరకాలం అక్కడే గడిపాడు. విశ్రాంతిలేని పర్యటనలు అతని మానసికారోగ్యాన్ని సైతం దెబ్బతీశాయి. అతని అనారోగ్యాన్ని గమనించిన వినోబాభావే బెంగుళూరుకి దగ్గిరలో విశ్వనీడ్ ఆశ్రమాన్ని నిర్మించి, దాని నిర్వహణ బాధ్యతలు కుట్టిజీకి అప్పగించి, ఎక్కడికీ తిరిగే అవసరం లేకుండా చేశాడు! ★




# గెలుపొందే పిల్లల తల్లులు మాల్టోవా తల్లులు!



తెలివైన తల్లులు మాల్టోవా తల్లులు. ఒక్కొక్క చెంచా మాల్టోవాలోనూ బంగారమంటి గోధుమలు. ముత్యాలవంటి
బార్లీ,
శుద్ధమైన పాలు,
కమ్మని కోకో,
శక్తినిచ్చే
చక్కెరల మంచితనం నిండుగా ఉన్నదని తెలిసిన తల్లులు. ఒక కప్పు పాలల్లో కలిపితే సరి, మనసులు గెలిచే గొప్ప పానీయమై పోతుంది మాల్టోవా. ఏ మాల్టోవా తల్లినైనా అడగండి చెబుతుంది.




కొత్త

**మాల్టోవా®**

**"ఆరోగ్యం, బలం మరియు శక్తి యొక్క విజయప్రద సంగమం"**

FSA/JIL/3/85 TEL







రెడ్డి స్వరాజ్యలక్ష్మి

# చెదరని స్వప్నం

టిక్ టిక్ మనే సుపరిచితమైన బూట్ల శబ్దం విన్పించగానే చేస్తున్న పని ఆపి లేచి నిలబడింది విద్య.

"నమస్తే సర్!" అంటున్న విద్యను వాత్సల్యంగా చూస్తూ-

"ఒక్క క్షణమైనా విశ్రాంతిగావుండవు కదా" అన్నారు జైలు సూపరింటెండెంటు రంగనాథ్.

విద్య సమాధానంగా చిరునవ్వు నవ్వింది.

"విద్యా! ఇప్పుడో ముఖ్య విషయం నీతో చెప్పాలని వచ్చాను" అన్నారు రంగనాథ్.

"చెప్పండి"

"నీ సత్ప్రవర్తన మెచ్చుకుని నీ శిక్షా కాలాన్ని తగ్గించారు. త్వరలోనే నీకు విడుదల లభిస్తుంది" అని ఓ క్షణం ఆగి, ఆమెలో తనూహించినట్టు సంతోషఛాయలు కన్పించకపోవడంతో ఆయన నిరాశపడ్డారు.

"ఈ వార్త నీకు సంతోషం కల్గిస్తుందనుకున్నాను" అన్నారు చివరికి.

"ఎలా సంతోషిస్తాననుకున్నారుసర్! ఈ నాలుగ్గోడల మధ్య ఉన్నదే నా ప్రపంచం. బయటి ప్రపంచంతో నాకు సంబంధంలేదు. నా ఈ చిన్న ప్రపంచంలో చూపుల్తో కత్తులుదూసేవారు, మాటల ఈటెలతో ప్రాణాలు తోడేవారు, తిరస్కారాలతో హృదయంలో ముళ్లు గుచ్చేవారు లేరు. ఇక్కడ హెచ్చు తగ్గులు లేవు. దయచేసి నన్నిక్కడే ఉండనివ్వండి" అంది దీనంగా.

"నీ బాధ నాకర్థమైందమ్మా! కాని వయసులో నీవింకా చిన్నదానివే. నీముందు సుందరమైన భవిష్యత్తెంతో ఉంది. అన్నీ వదులుకుని నీ బతుకును ఈ నాలుగ్గోడలమధ్యే సమాధిచేసుకుంటాననడం మంచిదికాదు" అన్నారు అనునయంగా.

"సర్! నా భవితవ్యమన్నది ఎప్పుడో సమాధయిపోయింది. గతించిన కాలం ఓ భయానక దుస్వప్నం. అది నేను మర్చిపోవాలన్నా ఈ లోకం నన్ను మరువనివ్వదు" అంది విద్య.

"నీలోని మానసిక దుర్బలత వలన అలా అన్పిస్తుంది. లోకం నువ్వ ఊహిస్తున్నంత భయంకరమైంది కాదు" అన్న ఆయన మాటలకు నవ్వింది విద్య. అది లోక జ్ఞానం తెలిసిన మనిషి పసి పిల్లాడిని చూసి నవ్వినట్టుగా అన్పించింది ఆయనకు.

"సర్! కొన్ని రకాల జంతువులు తమ మందనుండి విడిపోయిన జంతువు మళ్ళీ మందవద్దకొస్తే అది తమ జాతిదే అయినా దాన్ని తమలో కలవనివ్వవు. పైగా శత్రువుగా భావించి చీల్చి చెండాడతాయి! ఆ నోరులేని జంతువులకెందులోనూ తీసిపోరీ మానవులు. పరిస్థితుల ప్రాబల్యానికి తట్టుకోలేక తప్పుచేసిన మనిషిని, తర్వాత పశ్చాత్తాపంతో రగిలిపోయి మారినాసరే చచ్చేదాకా ఆ తప్పును ఎత్తి చూపుతూనే ఉంటారు. దోషిగానే పరిగణిస్తారు. అంతేగానీ సానుభూతితో ఆ మనిషిని అర్థం చేసుకునే ప్రయత్నం ఎవరూ చెయ్యరు. లోకుల దృష్టిలో నేనో హంతకిని. అవహేళనతో ప్రాణాలు తీసే ఆ మనుషులమధ్యకు నేను వెళ్ళలేను. నన్నిక్కడే ఉండనివ్వండి. నా జీవితమంతా ఈ నాలుగ్గోడల మధ్యే సమాధి కానివ్వండి" అంటూ వెక్కి వెక్కి ఏడ్చేసింది విద్య.

ఆమె భయమేమిటో అర్థమయింది





రంగనాథ్‌గారికి. సానుభూతిగా ఆమె వైపు చూశారు. "విద్యా! లోకం సంగతి వదిలెయ్యి! నీ ఆత్మీయుల దగ్గరికైనా వెళ్లి, వారి మధ్య హాయిగా గడపాలని పించడంలేదా?" అనడిగారు.

"ఆత్మీయులా? అటువంటివారెవ్వరూ లేరు సర్! నేనో అనాథను"

"పొరబడుతున్నావమ్మా! నీకోసం ఎదురుచూసే నీ భర్త ఉన్నాడు. అతడి సహృదయతలో ఈ లోకం సంగతే మర్చిపోతావు. సమాజం కత్తులు దూస్తే దూయనీ..ఆమాటలునువ్వుపట్టించుకోవద్దు. ఈ సమాజాన్ని నువ్వే వెలివేసెయ్యి"

"సర్! ఆయన నన్ను స్వీకరించరు! ఇక్కడికొచ్చేక మొదటి నెల్లో ఓసారి చూడ్డానికొచ్చారంతే! నాతో ఒక్క మాటన్నా మాట్లాడక కేవలం చూపుల్తో పలుకరించి నిర్లిప్తంగా వెళ్ళిపోయారు. ఆ తరువాత ఈ అయిదేళ్ళలో ఆయన మళ్ళీ రాలేదు, సరికదా కనీసం ఓ ఉత్తరమైనా రాయలేదు. ఎంతో ఆశతో రాసిన నా ఉత్తరాలకు ఏ ఒక్కదానికీ సమాధానమివ్వలేదు. ఏదో ఆశ మినుకు మినుకుమంటుండగా రెండేళ్ళపాటుఎన్నో ఉత్తరాలు రాశాను. కాని ఆయననుండి సమాధానం రాకపోడంతో విరక్తిచెంది నేనూ ఉత్తరాలు రాయడం మానేశాను. ఇప్పుడు చెప్పండి ...ఆయనింకా నన్ను స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నారనే నమ్మాలా?"

రంగనాథ్ సమాధానం చెప్పలేనట్టు నిలబడిపోయారు.

"అందుకే మీకు చెయ్యెత్తి నమస్కరిస్తా! మీకేమాత్రం సానుభూతివున్నా నన్ను బయటకు పంపించొద్దు. ఇక్కడే ఉంటాను. నాకీ విషయంలో మీరేమైనా సాయంచెయ్యగల్గితే చెయ్యండి"

"విద్యా! ఇక్కణ్నుండి విడుదలయి వెళ్ళడమంటే ప్రతిమనిషీ ఇనపపంజరం నుండి స్వేచ్ఛా ప్రపంచంలోకి వెళ్తున్నట్టే సంబరపడతాడు. నా సర్వీసులో జైలు జీవితమే బాగుందన్న మొట్టమొదటి వ్యక్తిని నిన్నే చూస్తున్నాను" విచిత్రంగా విద్య వేపుచూసి రంగనాథ్ వెళ్ళిపోయారు.

* * *

మరో పదిరోజులిట్టే గడిచిపోయాయి. ఓరోజు రంగనాథ్ మళ్ళీ విద్యకు ఆమె విడుదల విషయం గుర్తుచేశారు.

"సర్! నేనిక్కణ్నుండి వెళ్ళనని చెప్పానుగా" వివర్ణమైన ముఖంతో అంది.

"చదువుకున్నదానివి. రూల్స్‌కు విరుద్ధంగా మేమేం చెయ్యలేమని నీకూ తెలుసుగా. అన్నట్టు విద్యా! మీవారి అడ్రసు సంపాదించాను. మీవా రిప్పుడు హైదరాబాదులో ఉంటున్నారట. అక్కడకు వెళ్ళి మూడు సంవత్సరాలయిందట. ఏలూరులో జాబ్‌కు రిజైన్‌చేసి హైదరాబాద్‌లో ఏదో బిజినెస్ చేస్తున్నారని తెలిసింది. అక్కడ సొంతంగా ఇల్లుకూడా కట్టించేరట. నీ విషయం మీవారికి ఉత్తరం రాశాను. వెంటనే సమాధానం రాయమన్నా ఆయన్నుండి ఇంతవరకూ జవాబురాలేదు"

విద్య ముఖం రక్తంలేనట్టు పాలిపోయింది. పెదవులుచిన్నగాకంపించాయి- "సర్! ఆయన్నుండి సమాధానం వస్తుందని ఎలా ఆశించారు? ఆయన రాముడు పుట్టిన దేశంలో జన్మించిన మగాడు. ఓ హంతకిని, నేరస్థురాలిని తిరిగి భార్యగా స్వీకరించే విశాలహృదయం ఆయన కుండదు" అంది విద్య.

"ఏమైనా రేపు తెల్లవారుఝామున

నాలుగ్గంటలకే నేనొచ్చి నిన్ను స్వయంగా తీసుకెళ్ళి ట్రైనెక్కిస్తాను. ముందు అతడి దగ్గరకే వెళ్లు. అక్కడి పరిస్థితులు నీకు ప్రతికూలంగా ఉంటే నువ్వు బెదిరిపోవద్దు. నీ కోసం మా ఇంటి తలుపులెప్పుడూ తెరిచే ఉంటాయని మర్చిపోకు"

ఆయన అభిమానానికి విద్య హృదయం ఆర్ద్రమయింది. "సర్! నేనంటే మీకెందు కింత అభిమానం?" చలించిన కంఠంతో అంది.

"నీ ప్రశ్నకు నేను సమాధానం చెప్పలేను విద్యా! అయినా నీకటువంటి పరిస్థితి ఎదురవకూడదనే కోరుకుంటున్నాను"

* * *

విడుదలై వెడుతుంటే విద్యకే కాదు అక్కడున్న తోటి ఖైదీలకు కూడా కళ్ళల్లో నీళ్లు నిలిచాయి.

అందరి దగ్గరా సెలవు తీసుకుని భారమైన గుండెతో రంగనాథ్ వెంట నడిచింది.

స్టేషన్‌కు వెళ్లేక, "విద్యా! ఇదిగో టికెట్టు. ఇది మీవారి ఇంటి అడ్రసు. ఆ కాగితం వెనుకే ప్లానువేసి ఇచ్చాను. దాని ప్రకారం వెళ్లేవంటే ఇల్లు చాలాసులువుగా కనుక్కోవచ్చు. ఎందుకైనా మంచిది.. ఈ డబ్బుకూడా నీ దగ్గరుంచు. సరేగానీ విద్యా! నాకో మాటివ్వగలవా?"

"ఏమిటి సర్?"

"ఒకవేళ అతడు నిన్ను స్వీకరించక పోతే ఏ అఘాయిత్యానికీ పూనుకోవద్దు"

"విద్య అంత పిరికిది కాదు సర్" దృఢంగా అంది.

"థాంక్స్" రంగనాథ్ తేలిగ్గా ఊపిరి వదిలారు.

ట్రైనెక్కాక రెండు చేతులు జోడించి "వస్తానుసర్" అంటూ నమస్కరించింది.

"విష్‌యూ ఆల్ ది బెస్ట్ విద్యా! క్లిష్ట సమయంలో నిన్నాదుకునే అన్న ఉన్నాడని మాత్రం మర్చిపోకు" రంగనాథ్‌గారు హెచ్చరించారు.

కృతజ్ఞతగా నీరునిండిన కళ్లతో ఆయన వైపు చూసింది. ఆయన చెయ్యూపి వీడ్కోలిస్తుండగానే ట్రైన్ వేగాన్ని పుంజుకుంది.

* * *

ఠీవిగా నిలబడినట్టున్న ఆ భవనం ముందు నిలబడి మరోసారి రంగనాథ్ ఇచ్చిన కాగితం వైపు చూసింది. 'అదే ఇల్లు'ని నిర్థారణ కొచ్చేక వీధిగేటు దగ్గర నిలబడి లోపలకు చూసింది విద్య.

చుట్టూ కాంపౌండ్ వాల్‌తో ఉన్న భవనం ముందు చక్కగా తీర్చిదిద్దిన పూలతోటను తదేకంగా చూస్తూ బొమ్మలా అలాగే నిలబడి ఉండగా భవనం లోపల్నుండి ఐదేళ్ల పాప పరుగు పరుగున తోటలో కొచ్చింది.

ఆ పాప తెల్లని శరీర ఛాయతో, నల్లని చక్రాల్లాంటి కళ్లతో, బాబ్ చేసిన ఒత్తయిన జుట్టుతో, బ్లూకలర్ డ్రస్సులో చూడముచ్చటగా ఉంది. మొక్కలకు నీరు పెడుతున్న మాలితో బడబడ ఏదో మాట్లాడుతూ గేటు దగ్గర నిలబడ్డ విద్యను చూడగానే హఠాత్తుగా మాటలాపి గేటు వరకూ వచ్చి- "ఎవరు కావాలి?" అని అడిగింది.

విద్య ఉలిక్కిపడింది.

"ఎవరంటే... ఎవరంటే... ఊహు.... ఎవరూ కాదు" తడబడింది.

"మరెందుకిక్కడ నిలబడ్డారు"

"మీ పూలతోట చూస్తున్నాను"

"మా గార్డెన్ చాలా బావుంది కదూ!" పాప గర్వంగా అంది.

"అవును. నీలాగే అందంగా ఉంది. నీ పేరేమిటమ్మా?"

"నా పేరు తేజస్వి"

"స్వీట్‌నేమ్" విద్య నవ్వింది.

"మా డాడీకి ఈ పేరంటే చాలా ఇష్టం" తేజ సగర్వంగా చెప్పింది.

"డాడీ....అంటే రవి మళ్లీ పెళ్లి చేసుకున్నాడా?'

విద్య కళ్లల్లో అశ్రువులు నిల్చాయి. బలవంతంగా తనను తను కంట్రోల్ చేసుకుని- "తేజా! మీ డాడీ పేరు నీకు తెలుసా?" ఏదో ఆశతో అడిగింది.

"రవీంద్ర" తేజ సమాధానానికి విద్య కుంగిపోయింది. గేటుకమ్మీ గట్టిగా పట్టుకుని ప్రాణం లేనట్టు నిలబడింది.

"ఏయ్....ఎవర్నువ్వు? బాబుగారు చూస్తే కోప్పడతారు'' అంటూ మాలి విద్యను గదిమి తేజవైపు తిరిగి, "లోపలి కెల్లమ్మా! బడికి ఏలయిపోతంది" అని తేజను లోపలకు పంపేశాడు.

విద్య దీర్ఘంగా నిట్టూర్పు విడిచింది- తన జీవితం ఏనాడో లయతప్పింది. ఇప్పుడది సరిచెయ్యాలనుకోడం అవివేకం అనుకుంటూ.

గిరుక్కున వెనుతిరిగింది. చెక్కిళ్ళపై జారిన కన్నీటిని చెంగుతో ఒత్తుకుంది. చెదరిపోయిన మనోధైర్యాన్ని కూడగట్టుకుని రెండడుగులు వేసిందో లేదో - "ఏయ్...అమ్మాయి ఆగు" వెనకనుండి ఎవరో పిలిచినట్టవడంతో చివ్వున వెనుతిరిగి చూసింది. వీధి గేటు తెరిచి ఓ ప్రౌఢ బయటకు వచ్చింది. ఆమెకు ముప్పయి అయిదేళ్ళు దాటి ఉండొచ్చు. కల్నేత చీర కట్టుకుని, చేతులకు నిండుగా ఎర్రటి గాజులు,నుదుట కుంకుమబొట్టుతో కాస్త మోటుగా, పనిమనిషిలా ఉంది.

"నిన్నే! మా అయ్యగారు నిన్ను లోపలకు పిల్చుకురమన్నారు" చెప్పిందామె.

"నన్నా?"

"ఈరోజు పొద్దుటే నక్కను తొక్కి వచ్చేవు. అయ్యగారి సేతికి ఎముకలేదు" అంటూ మాలి లోపలికి వెడుతున్న విద్య వైపు ఈర్ష్యగా చూశాడు. విద్య ఆ మాటలు పట్టించుకోనట్టు ఆమె వెంట లోపలికి వెళ్ళింది.

విద్య హాలు మధ్యగా నిలబడి చుట్టూ చూసింది. హాలులో ఖరీదైన సోఫా సెట్టుకింద కార్పెట్.కిటికీలకు, గుమ్మాలకు క్రీమ్ కలర్‌లో డిజైనున్న కర్టెన్సు, గోడలకు వేలాడుతున్న పెయింటింగ్స్- వీటన్నిటినీ కళ్లు విశాలం చేసుకుని మరీ చూసింది.

అదృష్టమంటూ ఉంటే తనీ ఇంట్లో ఇల్లాలిగా హుందాగా తిరగవలసింది. కాని అపరిచితలా, యాచకురాలిలా నిలబడాల్సి వచ్చిందిపుడు! ఈ ఐశ్వర్యాన్ని స్వంతం చేసుకున్న తేజ తల్లిమీద అసూయ చోటుచేసుకుంది విద్యలో.

"ఇంతలో పనిమనిషి వచ్చి మిమ్మల్ని ఈ గదిలో విశ్రాంతి తీసుకోమన్నారు" అని చెప్పింది.

"లేదు. నేను వెళ్ళిపోవాలి" విద్య అయిష్టంగా అంది.

"వెడుదుర్లెండి! సాయంత్రం మీతో మాట్లాడతామన్నారు అయ్యగారు" అని చెప్పి-"పదండి బాత్‌రూమ్ చూపిస్తాను" అందామె.

షవర్‌బాత్ చేస్తుంటే ప్రాణానికెంతో హాయి చేకూర్చినట్టయింది విద్యకు. మనసు తేలికయ్యేవరకూ చన్నీటితో స్నానంచేసి మళ్ళీ అవే బట్టలు కట్టుకుని





తల తుడుచుకుంటూ బయటికొచ్చింది.

"అరే..మళ్ళీ ఆ బట్టలే కట్టుకున్నారా? అదిగో...ఆ గదిలో మంచంమీద చీర, జాకెట్టు పెట్టాను. బొట్టు, కాటుక అన్నీ అక్కడే ఉన్నాయి. వెళ్ళి చీర మార్చుకుని బొట్టుపెట్టుకోండి" అందామె.

విద్య ఆమె చూపిన గదిలోకి వెడుతూనే సర్పద్రష్టలా ఆగిపోయింది. దోమ తెర వేలాడుతున్న ఆ మంచం, చిన్న డ్రెస్సింగ్ టేబుల్, దానిమీదున్న కుంకుమ భరిణ...ఆ వస్తువులన్నీ తనకు సుపరిచితమే.

డ్రెస్సింగ్ టేబిల్ ముందున్న బల్ల మీద కూర్చుని కుంకుమ భరిణెను ఆప్యాయంగా చేతుల్లోకి తీసుకుంది.చుట్టూ రేకులు విప్పిన పద్మం మధ్యలో అందంగా అమరిన వెండి కుంకుమ భరిణె దానిని తమ పెళ్ళిరోజున తన కొలీగ్‌నళిని. ప్రజంట్ చేసింది. పౌడరు అద్దుకుని ఆ భరిణెలో కుంకుమ తీసి బొట్టుపెట్టు కుంది విద్య.

మంచంమీదున్న చీరను చూడగానే దూరంగా నిలబడిపోయింది. తెల్లని పాము కుబుసంలాంటి చీర. తొలిరోజున రవీంద్ర తనకా చీరను ఇచ్చి కట్టుకో మన్నాడు. తొలిరోజు. అబ్బ! ఆరోజు తన జీవితంలో ఎప్పుడూ మర్చిపోలేదు. ఆ అనుభవం తల్చుకుంటేనే ఎదలో వేయి వీణలు మోగి కోటి రాగాలు పల్లవిస్తాయి. రవీంద్ర ఆ రోజును తనకిప్పటికీ మర్చి పోలేనంత మధురస్మృతిగా మిగిల్చాడు. ఆ అనుభూతిని తనలో చిరస్మరణీయం చెయ్యడానికి అతడు చేసినవన్నీ తనకు బాగా జ్ఞాపకం.

"మీరింకా చీరకట్టుకోలేదా" ఆమె వచ్చి పలుకరించేసరికి వాస్తవానికొచ్చింది.

''ఇదిగో కట్టుకుంటున్నా'' అంటూ ఆ చీరను తన చేతుల్లోకి తీసుకుంది.

''టిఫిన్ తెస్తాను'' అంటూ ఆమె వెళ్ళిపోయింది. ప్లేటుతో తిరిగి వచ్చేసరికి విద్య టవల్‌తో తల తుడుచుకుంటుంది.

''టిఫిన్ తీసుకోండి" అందామె.

"అయ్యగారు తీసుకున్నారా?" అడిగింది విద్య.

''చిన్నమ్మగారూ, ఆయనా కలిసి తీసుకుంటున్నారు. మీరు కూడా కానివ్వండి''

విద్య మనసు చివుక్కుమంది. 'తననీ అక్కడకు రమ్మని పిలవొచ్చుగా! ఇలా వేరు చేస్తున్నారంటే తనకీ ఇంట్లోవున్న స్థానమేమిటో తెలిసిపోతూనేవుంది' అనుకుంది.

"నీ పేరేమిటి?" విద్య చెయ్యి కడుక్కుంటూ అడిగిందామెను.

"సూర్యావతి'' చెప్పిందామె.

"ఇక్కడెంతకాలంగా పనిచేస్తున్నావు?" అడిగింది.

''అయ్యగారీ ఊరొచ్చినప్పణ్నుండీ ఇక్కడే పనిచేస్తున్నాను"

"అలాగా. అన్నట్టు పాపావాళ్ళమ్మ గారు కన్పించరేం?"

"ఇక్కడ లేరు"చెప్పి ఖాళీప్లేటు,గ్లాసు తీసుకుని వెళ్ళిపోయిందామె.

''ఇక్కడలేరంటే మరి పుట్టింట్లో వుందేమో? బహుశా రవిమీద అలిగి పాపను ఇక్కడే వదిలివెళ్ళిపోయుంటుంది' విద్య అలా ఆలోచిస్తుండగానే తేజస్వి లోపలికొచ్చింది.

''ఆంటీ... టిఫిన్ తిన్నావా?" తేజస్వి ప్రశ్నకు ఉలికిపడింది.

"ఆ! టిఫిన్ తీసుకున్నానమ్మా" జవాబు చెప్పింది విద్య.

"గుడ్" అంది తేజస్వి. విద్యకు నవ్వొచ్చింది. రవి కూడా ఆ "గుడ్" అనే పదాన్ని ఎక్కువగా ఉపయోగిస్తాడు. ఆ అలవాటు తండ్రినుండి పుణికి పుచ్చుకున్నట్టుంది.

"తేజా! నన్ను ఆంటీ అని పిలవమని ఎవరు చెప్పారు?" అడిగింది విద్య.

"డాడీ చెప్పారు"

"మీ మమ్మీ కన్పించరేం?" ఇంకా సందేహం తీరక అడిగింది.

"మా మమ్మీ ఇక్కడుండదు. మా ఊళ్ళో వుంటుంది"

'అంటే! బహుశా పాప తల్లి రవిమీద అలిగి పుట్టింటికెళ్ళిపోయుంటుంది. ఈ అందాల బొమ్మను విడిచి ఎలా వుండ గలుగుతుందో?

ఇంతలో "తేజా...కమాన్! స్కూల్‌కి టైమవుతోంది" హాల్లోనుండి రవి పిలిచాడు. ఆ స్వరం విద్య హృదయాన్ని పులకింప చేసింది. ఆ కంఠం ఎవరినయినా ఆజ్ఞాపిస్తున్నట్టే ఉంటుంది - అనుకుంది విద్య.

"వస్తున్నా డాడీ" అనిచెప్పి "ఆంటీ! సాయంత్రం వచ్చేక మాట్లాడుకుందాం" అని హడావుడిగా వెళ్ళిపోయింది తేజ.

విద్య డ్రెస్సింగ్ టేబుల్ ముందు కూర్చుని తలచిక్కులు తీసుకుంటోంది. విద్యవి నిడుపైన కురులు. ఎప్పుడయినా తనిలా తలచిక్కు తీసుకుంటున్నపుడు రవి తన దగ్గరగా వచ్చి తన ముఖానికి ఆచ్ఛాదితమైన నీలికురులను తప్పించి తన ముఖాన్ని దోసిటపట్టి - "విద్యా! ఇప్పుడు నువ్వెలా ఉన్నావో చెప్పనా! నల్లని మేఘ మాలికలమధ్య దాగిన చందమామలా, సెలయేటిమధ్య వికసించిన కలువ భామినిలా ఉన్నావు" అనేవాడు. ఆ మాటలకు తను మైమరచి అతడి కౌగిట్లో గువ్వలా ఒదిగిపోయేది.

గతస్మృతులు రేపిన కలకలంనుండి తేరుకుంది విద్య.'ఓహ్!నా మనసెందుకిలా పరుగెత్తుతోంది. ప్రతి అడుగు, ప్రతి మాటా రవి ప్రేమను గుర్తుతెస్తోంది. అతడితో కాపురం చేసింది సంవత్సర కాలమే అయినా అతడు తన ప్రేమ వాహినిలో ఈ లోకాన్నే మరిపింపజేశాడు. ఆ సంవత్సరకాలం అతడి ఉనికే ఊపిరిగా, మాటే జీవధారగా ఏదో అపూర్వలోకంలో ఉన్నట్టే భ్రమచెందింది. ఆ భ్రమలన్నీ చెరిగిపోయి తనిలా అగాథంలోకి పడిపోడానికి కారణం? తన దురదృష్టం. కాదు కాదు.... ఓ మనసులేని మగాడి క్రౌర్యానికి తన జీవితం బలైపోయింది'.

విద్యకు ఆనాటి స్మృతులను తల్చుకో గానే కళ్ళవెంట నీళ్ళుకారాయి. దువ్వెన డ్రెస్సింగ్ టేబుల్ మీదకు విసిరి పడక మీద వాలిపోయింది విద్య. మనసు ఒక్క సారి గతంలోకి పరుగులు తీసింది.




ఆ రోజు....

ఆఫీస్ రూమ్‌లోనుండి ముఖానికి పట్టిన చెమట తుడుచుకుంటూ బయటకు వచ్చిన వెంకటేశ్వర్రావును అందరూ జాలిగా చూశారు. అతడు తలెత్తి చూడలేక గబగబ తన సీట్లోకి వెళ్ళి కూర్చున్నాడు.

'ఛీ! వెధవ బతుకు. దీనికి అంతమెప్పుడో? తన పదేళ్ళ సర్వీసులో ఇలా ఎవరిచేతా చివాట్లు తినలేదు. తను వర్క్ విషయంలో చాలా అప్‌టుడేట్‌గా ఉంటాడు. ఈమధ్య ఇంట్లో తలెత్తిన చికాకులవల్ల చిన్న పొరపాటు జరిగిందంతే! ఎన్ని చివాట్లు తినాల్సొచ్చింది? డామ్ షేమ్' కసిగా తనను తనే తిట్టుకున్నాడు వెంకటేశ్వర్రావు.

అతడి ముఖం చూసి జరిగిందేమిటో ఊహించగల్గిన విద్య ఆఫీసర్ దగ్గరకు వెళ్లాలన్న ఆలోచనకే భయంతో బిగుసుకు పోయింది. విసుగ్గా వాచీవంక చూసింది. ఇక ట్రయిన్ రావడానికి అరగంట మాత్రమే టైముంది. చీర, టాయిలెట్ అంటూ ఇంటికి వెళ్ళకుండా ఆఫీసునుండే నేరుగా స్టేషన్‌కు వెడితే అప్పటికి తను ట్రైను వచ్చే టైముకు చేరుకోగలదు. కాని ఈ వేడిమీద వెళ్ళి పర్మిషనడిగితే ఆఫీసరు ఏమంటాడో? అతడసలే దుర్వాసముని. ఏమయినా తనను కూడా దులిపేస్తే! ఆ అవమానంకంటే కమలతోనిష్ఠూరంపడమే మంచిదేమో? అమ్మో! కమల మాత్రం తక్కువతిన్నదా. 'రాకరాక మీ ఊరొస్తానంటే ఆ మాత్రం మీ ఆఫీసర్ని అడిగి స్టేషన్‌కు రాలేకపోయావా? ఓ గంట పర్మిషనే దొరకనంత గొప్ప ఉద్యోగమా?' అంటూ దులిపిమరీ వదిలిపెడుతుంది. ఎదుటిమనిషిని అర్థంచేసుకునే సంస్కారం కమలలో లేదు – అనుకుంటూండే ఆ ఆలోచనలతోనే మరో అయిదు నిముషాలు గడిచిపోయాయి. లాభంలేదు. కమలతో చెడ్డనిపించుకునేకంటే ఆఫీసర్‌తో చివాట్లు తినడమే నయం. ఈ చివాట్ల తాలూకు అవమానం ఈరోజుతోనే పోతుంది. కమల మనసులో అపార్థం రాజుకుందంటే అది తొలగించడానికి తన జీవిత



కాలం చాలదు. చిన్న విషయాన్ని కూడా భూతద్దంలో పెట్టి చూస్తుంది. అందుకే విద్య ఆఫీసరును పర్మిషనడగడానికే నిశ్చయించుకుంది. అంతకుముందే రాసి వుంచిన పర్మిషన్ లెటర్ తీసుకుని ఆఫీసర్ రూమ్‌లోకెళ్ళింది. వెనుకనుండి స్టాఫంతా సానుభూతిగా తనవైపే చూస్తున్నట్టు ఫీలవుతూ ఆఫీసర్ ముందు నిలబడింది. అతడామె రాకనుపట్టించుకోనట్టే ఫైల్సేవో సీరియస్‌గా చూస్తున్నాడు.

"సర్" పిల్చింది.

ఏమిటన్నట్టు తలెత్తి ఆమె వైపు చూశాడు.

"నాకు ఓ గంట పర్మిషన్ కావాలి సర్" పర్మిషన్ లెటర్ అతడిముందు పెట్టింది విద్య. పర్మిషనడిగినందుకు కాబోలు భ్రుకుటి ముడిచి విసుగ్గా చూడ్డం గమనించి – "సారీసర్! మరీ అవసరం కాకుంటే నేనసలు పర్మిషన్ పెట్టేదాన్ని కాదు. మా మేనత్త కూతురు సర్కారుకు వస్తున్నానని, స్టేషన్‌కు రమ్మని రాసింది. అసలే ఆవిడకి ఈ ఊరు కొత్త. ఆమెను రిసీవ్ చేసుకుని ఇంటి దగ్గర విడిచి నేను మళ్ళీ ఆఫీసుకొచ్చేస్తాను" చెప్పింది విద్య.

"సరే...వెళ్ళండి"

తేలిగ్గా ఊపిరి వదిలి ఆదరాబాదరా బయటికొచ్చింది విద్య. వింతగాచూస్తున్న కొలిగ్స్‌ను పట్టించుకోనట్టే బయటికెళ్ళిపోయింది.

రవీంద్ర ఆఫీసరుగా వచ్చి నెల కావస్తోంది. ఈ నెలరోజుల్లోనే స్టాఫు తరఫునదుర్వాసముని, చండశాసనుడు, కర్కోటకుడు వగైరావగైరా బిరుదులందుకున్నాడు. రవీంద్ర ఆఫీసరుగా రాకముందు ఎవరూ సీట్లో పట్టుమని పది నిముషాలయినా ఓపికగా కూర్చుని పని చేసేవారుకారు. అలాంటిది అతడొచ్చేక ఫైల్స్ చూడ్డమే తమ జీవిత ధ్యేయమన్నట్లు బల్లలకు అతుక్కుపోవడం చూసి విద్యలాంటి ఒళ్ళు వంచి పనిచేసేవారంతా అమితాశ్చర్యం పొంది రవీంద్రకు మనసులోనే హేట్సాఫ్ చేశారు.

"నీకు పర్మిషన్ బాగానే ఇచ్చాడే ఆ దుర్వాసుడు" సాయంత్రం ఇంటికి వెడుతూ తన సెక్షన్‌లోనే టైపిస్టుగా పనిచేసే నళిని అంది.

"ఊ..." అని ఊరుకుంది విద్య.

"పర్మిషనడిగినందుకు ఏమీ అనలేదా?" ఇంకా అనుమానం తీరక అడిగింది.

"ఏమీ అనలేదు. అయినా నీకెందుకొచ్చిందా అనుమానం?" విద్య అడిగింది.

"మొన్నోరోజు అర్జంటుగా సునీతను కలవాలని ఓ గంట పర్మిషనడిగితే వీల్లేదు పొమ్మన్నాడు" అక్కసుగా అంది నళిని.

అసలు సంగతి విద్యకర్థమైంది. "నన్ను పర్మిషనెందుకని అడగబోతుంటే ముందుగానే కారణం చెప్పాను. విషయం విన్నాకే పర్మిషనిచ్చారు" చెప్పింది. ఇక ఆ విషయం మళ్ళీ మాట్లాడలేదు నళిని.

విద్య ఇంటికెళ్ళేసరికి కమల ఎదురొస్తూ– "వచ్చేశావుగా. ఈయనేమో పిక్చరు ప్రోగ్రాం వేశారు. నేను నీ కోసమే ఎదురుచూస్తున్నాను. త్వరగా తెములు.పిక్చరుకు వెడదాం" అని తొందర పెట్టింది.

"నేను రావడానికెలా కుదురుతుంది. వంటపని చూడాలిగా! అన్నయ్యా, నువ్వూ వెళ్ళిరండి" హేండ్‌బాగ్ టేబుల్ మీద పెట్టి లోపలికెళ్ళింది విద్య.

"ఒక్కపూట మనం ఇంట్లో వండుకు తినకపోతే కొంపేం మునిగింది. పిక్చరు చూసి అలా హోటల్‌కెళ్ళి భోంచేసి





వద్దాం" కమల విద్య వెనుకే వస్తూ అంది. కమల మనస్తత్వం తెలిసిన విద్య ఇంకేం మాట్లాడలేదు.

"సరే...అలాగే వెడదాంలే. ముందు కాస్త టీ తాగాలి" అంటూ విద్య స్టౌ వెలిగించి టీకి డికాషన్ పెట్టి బాత్ రూమ్‌కి వెళ్ళింది.

టీ కలిపి అందరికీ ఇచ్చేక, చీర మార్చుకుని ఇంటికి తాళం పెట్టి వారిద్దరి వెంట బయల్దేరింది విద్య.

"ఏ పిక్చరుకు వెడదాం?" దారిలో విద్యే కమలనడిగింది.

కమలకు బదులుగా ఆమె భర్త రామారావు నవ్వుతూ - "మీ ఇష్టం. ప్రస్తుతం మేము మీ అతిథులం కాబట్టి మీరే పిక్చరుకు తీసుకెడితే దానికి మేము రెడీ" అన్నాడు.

అతడి అతితెలివికి నవ్వుకుంటూ - 'ఇద్దరికిద్దరినీ బాగానే ఏర్చికూర్చారు' అనుకుంది విద్య మనసులోనే.

పిక్చరు చూశాక హోటల్లో భోంచేసి ఇంటికొచ్చేశారు. రిక్షా ఛార్జీలు కలుపుకుని ఆ పూట ఖర్చు ఏభయి అయింది.

మరునాడు ఉదయం తొమ్మిదింటికే వంట పూర్తిచేసి టిఫిన్ బాక్సులో టిఫిన్ సర్దుకుంది. "కమలా! మధ్యాహ్నం నా కోసం ఎదురుచూడక అన్నయ్యా, నువ్వూ భోజనాలు చెయ్యండి. నాకు లంచ్ అవర్లో ఇంటికి రావడం పడదు" ఆఫీసుకు వెడుతూ చెప్పింది విద్య.

"అదేమిటే! ఈరోజు నువ్వు ఆఫీసుకు సెలవు పెడతావనీ, ఊళ్లో విశేషాలు చూసి సాయంత్రం సరదాగా షాపింగ్‌కు వెళ్ళొచ్చనీ అనుకున్నానే" కమల ముఖం ముడుచుకుని అంది.

"సారీ కమలా! ఇదివరకటి ఆఫీసరయితే సెలవు పెట్టేదాన్నే. కాని ఇప్పుడున్నాయన కొత్తగా వచ్చేరు. సెలవు పెడదామన్నా గ్రాంట్ చేస్తారన్న నమ్మకంలేదు. పైగా ఆయన వచ్చిన వెంటనే సెలవు పెట్టడం బావుండదు. సాయంత్రం పిలుంటే త్వరగానే వస్తాను. ఒకవేళ రావడం ఆలస్యమైనా తప్పకుండా షాపింగ్‌కు వెడదాం. ఇక విశేషాలంటావా! రేపు సెలవేగా...రేపు చూద్దాంలే'' విద్య ఎంత అనునయంగా చెప్పినా కమల ముఖం ప్రసన్నం కాలేదు. విద్య అదేం పట్టించుకోనట్టు ఆఫీసుకు వెళ్లిపోయింది.

సాయంత్రం ఇంటికొస్తూనే ఓ గంటలో వంటయిందనిపించి షాపింగ్‌కు బయల్దేరదీసింది విద్య. తనెప్పుడూ బట్టలు కొనే షాపుకే లీసుకెళ్ళింది.

"ఇది మరీ చిన్న షాపులా ఉందే" కమల చిన్నగా గొణగడం విద్యకు విన్పిస్తూనే ఉంది.

"షాపు చిన్నది కాదులే. ఇక్కడ అన్ని వెరైటీస్ దొరుకుతాయి. నువ్వే చూస్తావుగా'' విద్య సేల్స్‌మన్ దగ్గరకు వెళ్ళి నాలుగైదు వెరైటీస్‌లో చీరలు చూపించమంది.

"ఏ ఖరీదులో కావాలండీ?" అడిగాడు సేల్స్‌మన్.

"కాస్త ఎక్కువ ఖరీదులోవే. న్యూ వెరైటీస్ చూపించండి'' కమలే అంది.

అతడు చూపినవి వదిలి పైఅరల్లో ఉన్నవి, అవి కాదని ఇవి, ఇవి కాదని అవి తిరగేసి ఓ రెండు గంటలకు ఎలాగైతే రెండు చీరలు వాటికి మ్యాచింగ్ బ్లౌజు పీసులు, పెట్టికోట్స్ సెలక్టు చేసుకుంది. ఆ వ్యవహారం సేల్స్‌మన్‌కే కాదు విద్యకు కూడా తలనొప్పి కల్గించింది.

తన సంగతయ్యాక "ఏమండీ! మీరూ

ఏమైనా తీసుకుంటారేమో చూడండి'' అంటూ భర్తకు అభయ ప్రదానం చేసింది కమల. "తీసుకోవాలనుందనుకో కానీ పర్సు తేలేదు. సూట్ కేస్‌లోనే వదిలిపెట్టి వచ్చినట్టున్నాను" రామారావు సన్నగా గొణిగాడు.

"మర్చిపోతేనేంలెండి! మా విద్య ఉందిగా...తనే చూసుకుంటుంది. తీసుకునేలా ఉంటే అవికూడా చూద్దాం" కమల మాటలకు విద్య గుండె గుభిల్లుమంది.

'తన నెలజీతమంతా ఈరోజు బట్టల బిల్లు చెల్లించడానికే సరిపోయేలా ఉంది. అబ్బా! ఇద్దరికిద్దరూ ఎంత తెలివిగలవాళ్లు' విద్యకు వారి లౌక్యం మీద ఎంతయినా ఆగ్రహమొచ్చింది.

"ఇప్పుడెందుకులే. మరోసారి తీసుకుంటాను'' రామారావు విద్యను అనుగ్రహిస్తున్నట్టుగా అన్నాడు. విద్య మనసు కొంత తేలికపడింది. నాలుగు వందల రూపాయలూ కౌంటర్లో చెల్లించి బయట పడ్డారు.

ఆ మరునాడు ఊరు చూసే నెపంతో విద్య దగ్గర మిగిలిన డబ్బు కాస్తా ఖర్చు చేయించి ఆ మూడోనాడు ఇద్దరూ సెలవు తీసుకుని వాళ్ళ ఊరెళ్లారు. ఇద్దరూ వెళ్లిన తరువాత ''హమ్మయ్య'' అని తేలిగ్గా అనుకోగలిగింది.

హేండ్‌బాగ్‌లో చూసుకుంటే ఓ పది రూపాయలనోటు, కాస్త చిల్లరా మిగిలింది. ఈనెల సేలరీ అంతా గోవిందా!' విద్య మనసులో అనుకుంటుండగా ఇంటిగల వారమ్మాయి సరిత లోపలికొచ్చింది.

"అక్కా! దయచేశారా మీ అతిథులు?" అడిగింది విద్యను.

"ఆ! ఇంతకుముందే వెళ్లారు" చెప్పింది.

"నీ చేతిచమురు బాగా వదిలించినట్టున్నారే?" సరిత నవ్వుతూ అంది.

"ఓ నెలజీతం గోవిందా" విద్య నవ్వుతూ అంది.

"వాళ్ళేం మనుషులక్కా! నువ్వున్నపుడు నీతో తీపిగా మాట్లాడేవారు. నువ్వు బయటికెళ్ళాక నీమీద ఏవేవో చెప్పుకునేవారు అదేం మనస్తత్వమో" సరిత ఏవగింపుగా అంది.

"ఈ విశాల ప్రపంచంలో భిన్న భిన్న మనస్తత్వాలుగల వారున్నారనడానికి మావాళ్లు ఓ చక్కని ఉదాహరణ. అది వారి నైజం"

"ఇంతకీ ఆమె నీకేమవుతుంది?" సరిత అడిగింది.

"మా మామయ్య కూతురే! నేను చిన్నతనంనుండి మా మయ్య దగ్గరే పెరిగాను. అమ్మా, నాన్నలేని నన్ను మామయ్యే చేరదీసి పెంచి పెద్దచేశాడు" చెప్పింది.

"అలా చెప్పు. అందుకే ఎప్పుడో ఏదో చేశారని ఇప్పుడు నీ సంపాదన మీద వాళ్ళకు సర్వహక్కులూ ఉన్నట్టు నిన్ను హడలెత్తించేసిందన్నమాట. మొత్తానికి మంచి గడుసరే"

విద్య మాట్లాడలేదు.

"అక్కా! రేపు మేమంతా ఓ ప్రోగ్రాం వేసుకున్నాం. నువ్వూ రేపు ఆఫీసుకు సెలవుపెట్టి మాతో రావాలి" అంది సరిత.

"నాకు కుదురుతుందో లేదో! అయినా ప్రోగ్రాం ఏమిటి?"

"మా అంకుల్‌కి ద్రాక్షతోటలున్నాయని చెప్పానుగా. ఆ తోటలో పిక్నిక్ ప్రోగ్రాం వేసుకున్నాం" చెప్పింది సరిత.

"ఎవరెవరెడుతున్నారు?"

"మా ఫేమిలీ, అంకుల్ ఫేమిలీ"





"అలాగా!"

"ఇంతకీ నువ్వు బయల్దేరాలిసుమా! మా తరపున నేనే రిక్వెస్టు చేస్తున్నాను"

"సారీ సరితా! సెలవు పెట్టడానికి కుదరదు. త్వరలోనే ఆఫీసులో ఇన్స్పెక్షన్ కూడా ఉండటంవల్ల వర్క్లోడ్ ఎక్కువగా ఉంది. హాలీడేరోజున ప్రోగ్రాం వేసివుంటే తప్పక వచ్చివుండేదాన్ని" విద్య అంది.

"అంతేనా! నువ్వు వస్తావని చాలా సరదాపడ్డాను" సరిత ముఖం చిన్నబుచ్చుకుంది.

"ప్లీజ్! అలా బాధపడకు సరితా! ఏమాత్రం అవకాశం వున్నా నిన్ను నిరుత్సాహపరిచేదాన్ని కాదు. అందునా మా కొత్త ఆఫీసరుగారు..."

"చండశాసనుడని చెప్పావుగా! సర్లే.. ఈసారికిలా జరిగినా మరెప్పుడైనా సెలవురోజునే ప్రోగ్రామ్ ఫిక్స్ చేసుకునేలా చూద్దాం" సరిత అంది.

"సాయంత్రానికి వచ్చేస్తారుగా" విద్య అంది.

"బాగా చీకటి పడుతుండేమో" అంది సరిత. ఇంతలో సరితను వాళ్ళమ్మ పిలవడంతో 'వస్తున్నానమ్మా' అంటూ సరిత వెళ్ళిపోయింది.

విద్య అద్దెకుంటున్న ఇల్లు మూడు పోర్షన్లున్న డాబాయిల్లు.చుట్టూ కాంపౌండ్ వాల్, మధ్య ఇల్లు. చూడముచ్చటగా ఉంటుంది. ఇంటి ముందున్న ఖాళీస్థలం తక్కువే అయినా అందులోనే సరిత, విద్య కలిసి చక్కటి పూలతోటను పెంచారు. సాయంత్రంవేళ విద్య, సరిత ఆ తోటలో కుర్చీలేసుకుని కూర్చుని సరదాగా కబుర్లు చెప్పుకొనేవారు. విద్యకు జాబ్వచ్చిన ఈ సంవత్సరకాలంగా ఆ ఇంట్లోనే అద్దెకుంటోంది. మిగిలిన రెండు పోర్షన్లు సరితావాళ్ళ ఆధీనంలోనే ఉన్నాయి. తన గొడవేదో తాను అన్నట్టుండే విద్య మన స్తత్వం అందరికీ నచ్చడంతో విద్యను ఆ ఇంట్లో ఒక వ్యక్తిగా కలుపుకోగలిగారు.

సాయంత్రం ఆఫీసునుండి రాగానే టీ కాచుకుని తాగేక ఆ స్టౌమీదే కాసిని బియ్యం కడిగి పెట్టి స్నానంచేసింది విద్య. చీరకట్టుకుని బొట్టు దిద్దుకుంటుండగా కాలింగ్బెల్ మోగింది. సరితా వాళ్ళ ఫేమిలీ పిక్నిక్కు వెళ్ళి ఇంకా తిరిగి రాలేదనే జ్ఞాపకంరాగానే తమ పోర్షన్ తలుపు తెరిచి 'ఎవరూ' అంది. గుమ్మండగ్గర నిలబడ్డవ్యక్తి విద్య స్వరం విని ఇటు తిరిగాడు. అతడు రవీంద్ర...తమ ఆఫీసరు. అక్కడ అతణ్ని చూడగానే "మీరా సర్! ఏమిటిలా వచ్చేరు?'' అంటూ బయటకు వచ్చింది.

"మీరు..." అతడు జ్ఞాపకం చేసుకుంటూ సాలోచనగా చూశాడు.

"నేను మీ ఆఫీసులోనే పనిచేస్తున్నాను" అంటూ తనే సెక్షన్లో పని చేస్తున్నదీ చెప్పగానే-"ఆ...అవునుకదూ మీ పేరు..." అంటూ అతడు జ్ఞాపకం చేసుకోడానికి ప్రయత్నిస్తుంటే-

"నా పేరు విద్యాధరి" చెప్పింది విద్య.

"భానుమూర్తిఉంటున్న ఇల్లు ఇదేగా?" రవీంద్ర అడిగాడు.

"ఆ! ఇదే సర్" చెప్పింది.

"భాను లేడా?" అడిగాడు.

"లేరండి! వాళ్ళ ఫేమిలీ అంతా ఈరోజు పిక్నిక్కు వెళ్లారు. మరి కాసేపటికి రావచ్చు" అంది విద్య.

"ఐసీ!" తల పంకించాడు.

"సర్ ... భానుమూర్తిగారు మీకు తెలుసా?" కుతూహలంగా అడిగింది విద్య.

"భానూ నేనూ బాల్యస్నేహితులం. క్లాస్‌మేట్స్‌ం, బెంచ్‌మేట్స్‌ం! భానూ వాళ్ళ నాన్నగారికి ట్రాన్స్‌ఫరవడంవల్ల ఈ ఊరొచ్చేశాను. ఉద్యోగరీత్యా ఇంత కాలానికి నేనూ ఇక్కడికే రావలసి వచ్చింది. వచ్చినప్పట్నుండి తీరికలేక పోవడంతో భానూని కల్సుకోలేక పోయాను. తీరా ఈరోజు తీరిక చేసుకొనివస్తే వాడు లేకుండాపోయాడు" చెప్పాడు రవీంద్ర.

"సర్ మీకభ్యంతరం లేకుంటే ఇలా లోపలికొచ్చి కూర్చోండి" మర్యాదగా అతణ్ని ఆహ్వానించింది విద్య.

"ఎందుకులెండి" రవీంద్ర మొహమాటంగా అంటుంటే,

"ప్లీజ్! ఓ కప్పు టీ తాగి వెళ్ళండి" అంది.

"సరే... పిలిచి అతిథి మర్యాద చేస్తానంటే కాదని ఎందుకు వెళ్ళిపోవాలి" అంటూ రవీంద్ర విద్య వెనుకే గదిలోకి వెళ్ళాడు.

అతడింత సులభంగా తన ఆహ్వానం మన్నిస్తాడనుకోలేదు. అందునా అధికారి తన ఇంటికి వచ్చేసరికి విద్య కంగారుతో తబ్బిబ్బయింది. విప్పుకున్న కురులను రిబ్బన్‌తో మధ్యకు కట్టేసి- "ఇప్పుడే వస్తానుండండి" అంటూ వంటగదిలోకి పరుగెత్తింది.

రవీంద్ర కూర్చున్నాక సునిశితంగా పరిసరాలను గమనించాడు. ఆ గదిలో ఓ మంచం, ఓ టేబుల్, దాని ముందు చిన్న బల్ల, మరో పక్కగా వరుసగా నాలుగు గాడ్రేజ్ ఛెయిర్స్ ఉన్నాయి. టేబుల్ మీదున్న ఫొటో స్టాండులో విద్య ఫొటో ఉంది. గోడకు తగిలించి ఉన్న చిన్న స్టాండుమీద దేవుడి ఫొటో, ఆ ఫొటోముందు పూలుపెట్టి,అగరువత్తులు వెలిగించింది. సింపుల్‌గా ఉన్న ఆ ఇంటిని, ఆ పరిసరాల్లోవున్న ప్రశాంతతను అతడు మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు.

కొద్ది నిమిషాల్లోనే విద్య టీ కప్పుతో ప్రత్యక్షమయింది. తెల్లటి చీర కట్టుకుని వంటింట్లోకెళ్ళాక ఆ చీర చెంగును బొడ్డున దోపి అలాగే వచ్చి తనముందు నిలబడ్డ విద్యనుచూసి నవ్వాడు రవీంద్ర.

"సర్! ఎందుకలా నవ్వుతున్నారు?" విద్య అడిగింది.

"మీ ఆడవారు వంటింటి యుద్ధం చేసేటప్పుడు ఇలా బొడ్డున చెంగు దోపడం చూస్తే ఝాన్సీలక్ష్మి, సత్యభామ, రుద్రమదేవి వగైరా వీరవనిత లంతా గుర్తొస్తారు"తమాషాగా అన్నాడు.

"అదా సారీ సర్" అనాలోచితంగా అనేసింది విద్య.

"ఏం తప్పుచేశారు సారీ చెప్తున్నారు" కొంటెగా అడిగాడు. విద్య మాట్లాడలేదు. తల వంచుకుంది.

ఆమె అవస్థ గమనించి "మీరు టీ తెచ్చుకోలేదేం?" అడిగాడు రవీంద్ర.

"నేనింతకుముందే తాగాను. మళ్ళీ మళ్ళీ తాగే అలవాటులేదు సర్" ఇబ్బందిగా చూసింది.

"ఇదే ఫిఫ్టీ ఫిఫ్టీ చేసుకుందాం. మరో కప్పు పట్టుకురండి"

"ప్లీజ్....వద్దు. మీరు తాగెయ్యండి"

"సరే. ఒక్క షరతుమీద ఈ టీ తాగుతాను"

"ఏమిటది చెప్పండి?"





"మీరిదే ఆఫీసనుకోవడం మానేసి, నన్ను 'సర్' అనడం మానేసి అలా ఎదురుగా కూర్చుంటానంటే తాగుతాను"

అతడి షరతుకు నవ్వుకుంటూ తనూ ఓ కుర్చీలో కూర్చుంది.

"ఈ ఇంట్లో మీరొక్కరే ఉంటున్నారా?" అడిగాడు రవీంద్ర.

"అవునండి"

"ఒంటరిగా వుండటం కష్టంగదా. మీవాళ్ళనెవరినైనా తోడు తెచ్చుకోలేకపోయారా'' అంటున్నవాడల్లా అప్పటికే మ్లానమైన ఆమె ముఖాన్ని చూసి సంభాషణ ఆపేశాడు.

"తోడు తెచ్చుకోవాలన్నా ఎవరూలేని ఒంటరిదాన్ని. తల్లి, తండ్రి చిన్నప్పుడే పోయారు. మేనమామ దగ్గరే పెరిగి పెద్దయ్యాను. బతుకు తెరువుకోసం ఉద్యోగం వెదుక్కున్నాను. ఇక ఒంటరిగా వుండకతప్పదుగా" అంది విద్య.

"సారీ....మిమ్మల్ని బాధపెట్టినట్టున్నాను'' ఆమె ముఖంలో కదలాడే నీలినీడలు చూసి నొచ్చుకున్నాడు రవీంద్ర.

''ఫరవాలేదు" విద్య సర్ది చెప్పింది.

''భానూ వాళ్ళ ఫేమిలీతోపాటు మీరూ పిక్నిక్కు వెళ్ళవలసింది. కాస్త ఒంటరితనం దూరమయ్యేదిగా" రవీంద్ర అంటుంటే చురుక్కుమనేలా అతడివైపు చూసి - "భానుమూర్తిగారి చెల్లెలు సరిత నన్నూ తమతో రమ్మని పట్టుబట్టింది. ఆఫీసులో వర్క్ లోడ్ ఎక్కువగా వుండటంతో సెలవు పెట్టలేకపోయాను" అంది.

'వర్క్ లోడ్ అన్నది సాకుమాత్రమేనని, తను సెలవు ఇవ్వడన్న భయంతోనే విద్య మానేసి ఉంటుందనీ' అనిపించింది రవీంద్రకు.

"అంతేనా...లేక మీ ఆఫీసరు చండశాసనుడికి, కర్కోటకుడికి జడిసి సెలవు పెట్టడం మానేశారా?" చిలిపిగా అడిగాడు.

విద్య ముఖం వెలవెలపోయింది. "అంటే స్టాఫ్ ఇచ్చిన బిరుదులు ఇతడికి తెలిసిపోయాయన్నమాట" అనుకుని గతుక్కుమంటూ - "మీకు .... మీకూ తెలిసిందా" అంది. అలా నోరు జారేక గాని తానెంత పొరపాటుచేసిందో తెలియలేదు.

"ఆ! తెలుసు. బిరుదులివ్వడంలో మన స్టాఫ్ కు జాతీయ అవార్డు ఇవ్వొచ్చు. నన్ను దుర్వాసుడిగా చిత్రీకరించేముందు ఎవరికి వారు ఆత్మవిమర్శచేసుకోవచ్చుగా! నేనొచ్చేసరికి ఆఫీసు ఓ బందిల దొడ్డిలా వుండేది. ఎక్కడి ఫైల్స్ అక్కడే పెండింగులో వుండిపోయాయి. నేనిక్కడకు వచ్చే ముందే ఇక్కడున్నండి రిటైరయిన ఆఫీసరుగార్ని కల్సుకుని ఆఫీసులో వారి ప్రవర్తనా, పనిచేసే తీరు అన్నీ వాకబుచేశాను. ఆయనే 'స్ట్రిక్టు రూల్స్ అప్లయిచేస్తేనేగాని స్టాఫ్ ఓదారికి రారని' సలహా ఇచ్చారు. ఆయన సలహా నేను అక్షరాలా పాటించాను. ఇప్పుడు చూడండి! అంతా ఎలా మారిపోయారో" రవీంద్ర చెప్తుంటే విద్యకు అతడు చెప్పింది నిజమే అనిపించింది.

రవీంద్ర వాచీ చూసుకుని - "చాలా టైమయింది. నేనిక వెడతాను విద్యా! భానుతో నేను వచ్చేనని చెప్పండి. వీలుంటే ఆదివారం కలుస్తానని చెప్పండి" అంటూ లేచాడు.

అతడిని వెన్నంటే వరండా వరకూ వచ్చి, "థాంక్యూ సర్" అంది.

"ఎందుకు... వచ్చి మిమ్మల్ని శ్రమ పెట్టి మాటల్తో బోర్ కొట్టించినందుకా?"

"ఉహూ! ఈ కాసేపూ చక్కటి కంపెనీ ఇచ్చినందుకు"

"థలేవారే" అని రవీంద్ర సెలవు తీసుకుని వెళ్లిపోయాడు. వెడుతున్న అతణ్ని వెనుకనుండి తదేకంగా చూసింది. ఎత్తు, ఎత్తుకు తగిన లావుతో గంభీరంగా కన్పించే అతడి విగ్రహం మగసిరి ఉట్టిపడే ఆ నడక ఎవరినైనా ఆకర్షిస్తాయి. ఎందుకో అతడితో గడిపిన ఈ అరగంటా చాలా హాయిగా ఫీలయ్యింది తను.

* * *

ఆదివారం సాయంత్రం రవీంద్ర మళ్లీ వచ్చేడు. అతడొచ్చేసరికి సరిత, విద్య మొక్కలకు పాదులు చేస్తున్నారు. విద్యను చిర్నవ్వుతో విష్ చేసి లోపలికి వెళ్లాడు రవీంద్ర.

రవీంద్రను చూడగానే భానుమూర్తి ఆత్మీయంగా అతడి భుజం మీద చెయ్యేసి "ఎన్నాళ్లకు కలుసుకున్నాంరా రవీ" అన్నాడు.

"ఆంటీ, అంకుల్ ఎలావున్నారు?" భాను చెయ్యి పట్టుకుని అడిగాడు రవీంద్ర.

"లోపలికి పద. నువ్వే చూద్దువుగాని" అంటూ రవీంద్రను చెయ్యిపట్టి లోపలికి నడిపిస్తూ "అమ్మా! ఎవరొచ్చారో చూడు" అన్నాడు.

వంటింట్లో టిఫిన్ చేస్తున్న విమల హాల్లోకొచ్చి, "నువ్వా రవిబాబూ! బావున్నావా? నాన్నగారు, సరోజ అంతా కులాసాయేనా?" అడిగింది ఆప్యాయంగా.

"నాన్నగారి ఆరోగ్యం కాస్త బావుండ లేదాంటీ! ఇక సరోజకు మొన్ననే పెళ్లి చేసి అత్తవారింటికి పంపెయ్యడం కూడా జరిగింది" చెప్పాడు రవీంద్ర.

"నాన్నగారిప్పుడెక్కడున్నారు?"

"మా ఊళ్లోనే! నా దగ్గరకు వచ్చెయ్యమని ఎంత బతిమాలినా నాన్నగారు రావడానికి ఒప్పుకోడం లేదు. తనా ఊరు వదిలి రాలేనని ఖచ్చితంగా చెప్పేశారు. ఏమిటో పెద్దల సెంటిమెంట్సు అలా ఉంటాయి కాబోలు" రవీంద్ర బాధపడుతూ చెప్పాడు.

"అంతే బాబూ! పుట్టి పెరిగిన ఊరు, తను ఉన్న ఇల్లు వదిలిపెట్టడానికి అంత త్వరగా మనస్కరించదు" విమల అంది.

"అన్నట్టు ఇంట్లో లలితగాని, సరిత గాని ఎవరూ కన్పించరేం?" రవీంద్ర అడిగాడు.

"లలితకు పెళ్లి చేసి పంపించాం. వాళ్లాయనకు కటక్‌లో ఉద్యోగం. అది అక్కడికే వెళ్లిపోయింది. ఇక సరిత బయట విద్యతో పాటు గార్డెన్‌వర్క్ చేస్తోందిగా... నువ్వు చూడలేదా?" భాను అన్నాడు.

"మైగాడ్! ఆ అమ్మాయి సరితేనా? అప్పుడే ఎంత ఎదిగిపోయింది. మీరు మా ఊళ్ళో వున్నపుడు ఐదేళ్లుంటాయను కుంటానే"

"అలా ఆశ్చర్యపడతావెందుకురా? ఆడపిల్లలు ఇట్టే ఎదిగిపోతారు. నిన్న పాపాయి, ఈవేళ అమ్మాయి, రేపు అమ్మ, ఎల్లుండే అమ్మమ్మ" భానుమూర్తి నవ్వుతూ అంటుంటే-

"నిజమేలే" రవీంద్ర కూడా నవ్వేశాడు.

"బాబూ టిఫిన్ తీసుకోండి" అంటూ రెండు ప్లేటలతో జీడిపప్పు ఉప్మా తీసుకొచ్చి ఇద్దరికీ ఇచ్చింది విమల.

"అంకులేరి ఆంటీ" రవీంద్ర అడిగాడు.

"నిద్రపోతున్నారు. మీరు టిఫిన్ కానివ్వండి. ఆయన్ను కూడా నిద్రలేపు




తాను" విమల మంచినీళ్లు తీసుకు రావ డానికి లోపలికెళ్లింది.

ఇంతలో సరిత చేతుల కంటిన మట్టి కడుక్కుని లోపలికొచ్చింది. రవీంద్రను చూసి సంకోచిస్తుంటే- "ఏమిట్రా సరితా! అలా సందేహిస్తావెందుకు? నన్ను మర్చి పోయావా?" రవీంద్రే చనువుగా పలక రించాడు.

"మీరెవరో నాకు గుర్తులేదండీ" సరిత అంది.

"వెరీబేడ్ 'అండీ మీవండీ' అంటూ నన్ను పరాయి చెయ్యకు. చిన్నప్పుడు 'అవన్నయ్యా' అంటూ వచ్చీరాని మాటలు మాట్లాడుతూ నా వెనుకే తిరిగేదానివి నువ్వు మర్చిపోయినట్టున్నావు. ఇప్పుడూ అలాగే పిలవాలి" అన్న రవీంద్ర మాటలకు సరిత నవ్వుతూ "ఊహూ! ఇప్పుడలా పిలవను" అంది.

"ఎందుకని?" రవీంద్రతెల్లబోతున్నట్టు చూశాడు.

"మాటలురాని పాపాయిగా 'అవ న్నయ్యా' అని పిలవడం నావల్ల కాదు. అందుకే 'అన్నయ్యా' అనిపిలుస్తాను''

సరిత కొంటెతనం అర్థమైన రవీంద్ర నవ్వేస్తూ- "భలే గడుసుదానివే!" అన్నాడు.

"సరితా... ఇలావచ్చి ఈ కాఫీకప్పులు పట్టుకెళ్లు" తల్లి పిలవగానే లోపలికెళ్లింది సరిత.

విద్య తన గదిలో కూర్చుని పుస్తకం చదువుదామని తెరిచిందేగాని ఆమె మనసు పుస్తకం మీద నిలవడంలేదు. పక్కగదిలో మాట్లాడుతున్న వారందరి చుట్టూ పరిభ్ర మిస్తోంది.

"ఒక్కరూ కూర్చుని ఏం చేస్తున్నావు?" రవీంద్ర లోపలికొస్తూ అడిగాడు.



"నవల చదువుతున్నాను" అతడలా రావటం ఆమెను విస్మయ పరచింది.

"నేను వచ్చేనని తెలిసికూడా మీరు సరితతోపాటు లోపలికెందుకు రాలేదు" రవీంద్ర అడుగుతుంటే విద్య ఆశ్చర్యంగా అతడివైపు చూసింది.

"అలా వస్తే వాళ్ళేమైనా అనుకుంటారేమోనండీ....!" అంది.

"ఏమనుకుంటారు? వాళ్ళేదో అనుకునేంతగా మనమధ్య ఏం వుంది?" ఆమె కళ్ళల్లోకి సూటిగా చూశాడు.

విద్య తడబడుతూ - "మీతో మాట్లాడి గెలవలేను. ఇక నన్ను వదిలెయ్యండి" అంది అభ్యర్థనగా.

"మిమ్మల్ని నేను పట్టుకోలేదే వదలటానికి" రవీంద్ర మాటల్లో కొంటెతనం విద్యని ఉక్కిరి బిక్కిరి చేసింది. తుళ్ళింతలాడే హృదయాన్ని అదుపులోకి తెచ్చుకుంటూ "ప్లీజ్" అన్నట్టు బేలగా అతడివైపు చూసింది.

అది అర్థంచేసుకున్న రవీంద్ర గంభీరంగా మారిపోతూ-"వెడుతున్నాను విద్యా! అది చెప్పాలనే వచ్చేను" అంటూ వెళ్ళబోతుంటే విద్య మనసువిలవిల్లాడింది.

చాలాసేపటివరకు విద్య అచేతనంగా కుర్చీలోనే కూర్చుండిపోయింది. ఆఫీసులో ఎప్పుడూ గంభీరంగా ఉండే రవీంద్ర వేరు, ఇక్కడ తనకెదురైన రవీంద్ర వేరు.

విద్య పడకమీద వాలిపోయింది.

ఇక ఆ పూటంతా అన్నం తినాలనిపించలేదు. మనసంతా ఆవేదనతో నిండిపోయింది. తన జీవితంలో గతించిన దురదృష్ట క్షణాలను తల్చుకుని అశాంతితో వేగిపోయింది.

ఉదయం నిద్ర లేస్తూనే చెదిరిన ముంగురులు సవరించుకుంటూ అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసి తుళ్ళిపడింది విద్య. ముఖం ఒక్క పూటలో బాగా పీక్కుపోయినట్టుంది. కళ్లు ఎర్రబారాయి. ముఖంలో చెప్పలేని దిగులు, అశాంతి. రాత్రి జరిగింది తల్చుకుని నిట్టూర్పు విడిచి బయటికొచ్చింది విద్య.

ఆఫీసుకెళ్ళాక ఏవో ముఖ్యమైన కాగితాల్లమీద సంతకాలు కావల్సొచ్చి రవీంద్ర రూమ్‌కు వెళ్ళింది.

"సర్! వీటిమీద సంతకం చేస్తారా?" ఫైల్స్ అతడిముందున్న బల్లమీదుంచింది. అతడు అవి చూడ్డానికి బదులుగా విద్య ముఖంలోకి చూశాడు. "ఏమిటలా డల్‌గా ఉన్నారు? ఆరోగ్యం బాగోలేదా?" అడిగాడు.

'ఇతడినుండి ఏ భావాన్నయినా దాచుకోవడం కష్టం' విద్య లోలోపల అనుకుంటూ -

"ఆరోగ్యం బాగానేవుంది" చెప్పింది.

"నేను నమ్మను. అవసరమైతే సెలవు తీసుకుని ఇంటికెళ్లి రెస్టు తీసుకోండి" మృదువుగా చెప్పాడు రవీంద్ర.

"మీ అభిమానానికి కృతజ్ఞురాలిని! లీవ్ పెట్టి ఇంటికెళ్లి మాత్రం ఏం చెయ్యాలి? నాకు పని చెయ్యడంలోనే ప్రశాంతత, విశ్రాంతి దొరుకుతాయి సర్"

'విద్య సమాధానంతో రవీంద్ర ఇంకేం మాట్లాడలేకపోయాడు. మవునంగా ఆ కాగితాలు పరిశీలించి సంతకం చేశాడు. విద్య బయటికొచ్చేసింది.

తన సీట్లోకొచ్చి కూర్చుండన్న మాటేగాని పనిలో తల దూర్చలేకపోయింది.

ఆమె మెదడునిండా ఆలోచనలు చెదల పుట్టల్లా లేచాయి. 'అతడికి తనంటే ఎందుకింత శ్రద్ధ? తనతో రెండుసార్లు




పర్సనల్‌గా కలిసి మాట్లాడినంతలో ఇంత శ్రద్ధ కల్గిందంటే నమ్మబుద్ధి పుట్టడంలేదు. అందరి విషయంలోనూ ఇలాగే శ్రద్ధ చూపిస్తాడనడానికి ఆస్కారం లేదు. నళిని, సుబ్బారావు. రమణ వీళ్ళందరూ అతడి పరోక్షంలో అతణ్ని విమర్శిస్తూ తిట్టుకుంటూనే ఉంటారు. ఒక్కోసారి వారి మాటలు వింటే తనకు కోపం కూడా వస్తుంది. నళినైతే మరీను. రవీంద్ర చేసిన ప్రతి పనికి వక్ర భాష్యం చెప్తూ వికృతంగా సృష్టిస్తుంది. ఎవరిపట్లా కనబరచని శ్రద్ధ తనమీద కలగడానికి కారణం బహుశా తనెవరూ లేని అనాథన్న జాలితోనేనేమో!'



## 3

ఆరోజు విద్య బర్త్‌డే. తలారా స్నానం చేసి కొత్త చీర కట్టుకుంది. నుదుట బొట్టు దిద్దుకుంటూ అద్దంలో తన రూపాన్ని తనే చూసుకుంది. పసి నిమ్మ పండు శరీర ఛాయకు కట్టుకున్న ముదురురంగు చీర చక్కగా అమిరింది. విశాలమైన కాటుక కళ్లు, చిన్న నుదుపు, అందంగా అమరిన ముక్కు— శరీరంలో ప్రతి అవయవం ఓ ప్రత్యేకతను పుణికి పుచ్చుకున్నట్టే ఉంది.

ఇంతలో సరిత– "అక్కా పుట్టిన రోజున నా శుభాకాంక్షలందుకో" అంటూ చేతిలో రెండు పసుపు గులాబీలతో ప్రత్యక్షమయింది.

'థాంక్యూ సరూ!" ఆ గులాబీలు అందుకుంది విద్య.

"ఈ చీరలో చాలా అందంగా ఉన్నావక్కా. నిన్నిలా చూస్తే ముద్దెట్టుకో బుద్ధేస్తోంది" సరిత మాటలకు విద్య ముఖం ఎర్రనయింది.

"రా...టిఫిన్ చేద్దాం'' అంటూ సరితను వంటింట్లోకి లాక్కెళ్లింది విద్య.

"ఈవేళ స్పెషల్సేమిటక్కా?" పీట వాల్చుకుని కూర్చుంటూ అంది సరిత.

"ఏముంటాయి! ఏం కావలసినా బజారులో పదార్థాలమీద దాడిచెయ్యాల్సిందే గాని ఇంట్లో చేసే తీరికా, ఓపికా రెండూ లేవు" విద్య నవ్వుతూ అంది.

"అమ్మకు చెప్పక్కా! నీకేం కావల సినా క్షణాలమీద చేసేస్తుంది"

"పిన్నిగారికి ఇంట్లో పనులు చాలవనా నా పనికూడా అప్పగించడం" విద్య అంది.

"నువ్వెప్పుడూ ఇంతేలే" సరిత మాట ముడిచింది.

సరిత టిఫిన్‌తింటూ– "అక్కా సాయంత్రం పిక్చరుకు వెడదాం" అంది.

"ఫస్ట్‌షోకా? మరో రోజున మ్యాటినీకి వెడదాంలే"

"నీదంతా చాదస్తం బాబూ! మనవెంట అన్నయ్యను తీసుకెడదాంలే" సరిత అంది.

"మళ్ళీ అన్నయ్యను శ్రమపెట్టడ మెందుకు చెప్పు" విద్య అయిష్టంగా అంది.

"మన కూడా తోడుగా పిక్చరుకు వచ్చినంతలో ఆయనేం అరిగిపోడులే. నువ్వు నాకింకేం సాకులు చెప్పకు. మనం పిక్చరుకు వెడుతున్నాం. అన్నయ్యతో

 చతుర ... 33

కూడా చెప్తాను"

సరితకు ఎదురు చెప్పలేకపోయింది విద్య.

ఆఫీసులో ఓ గంట గడిచేక ఆఫీసర్ ప్యూన్ సింహాద్రి విద్య దగ్గరకొచ్చాడు- "అమ్మా! నిన్న అయ్యగారేదో అర్జంటు ఫైల్ చూడమన్నారటగా. దాన్ని పట్టుకు రమ్మన్నారు" అంటూ.

హడావుడిగా ఆ ఫైల్ వెదికి ఆఫీసు రూముకి వెళ్లింది. "సర్! ఇదిగో మీరు తెమ్మన్న ఫైలు" అతడి ముందు పెట్టింది.

"మీరు చూశారా'' ఫైలు అటు ఇటు తిరగేస్తూ అన్నాడు.

''చూశాను సర్"

"మీరు చూశారంటే ఇక నేను చూడాల్సిన అవసరంలేదులెండి" ఫైలు మూసేసి అప్పుడు చూశాడామె వంక.

చూడగానే అతడి హృదయం లయ తప్పింది. ''ఏమిటి విశేషం?" కళ్ళతోనే ప్రశ్నించాడు.

చురకత్తుల్లా తళతళలాడుతూ తన ఎదలోయలను చీల్చిచూసే ఆ చూపులకు తత్తరపడుతూ తలవాల్చింది విద్య.

''పుట్టినరోజు శుభాకాంక్షలు స్వీకరించండి'' అన్నాడు రవీంద్ర.

"నా పుట్టినరోజని మీకెలా తెలుసు?" విస్మయంగా అడిగింది.

"వెరీసింపుల్! ఈరోజు ప్రత్యేకంగా ఆడాళ్లు చేసుకునే పండుగలేమీలేవు. ఇక మీరు కొత్త చీర కట్టుకోడంలో విశేషం ఏమిటా అని ఆలోచిస్తే మీ పుట్టినరోజని అర్థమయింది" అన్నాడు.

''మీ తెలివికి నా అభినందనలు'' విద్య అంది.

''ఒట్టి అభినందనలేనా? పార్టీలాంటి దేదీలేదా?'' రవీంద్ర అడుగుతుంటే విద్య సమాధానం చెప్పలేకపోయింది.

"మీరాహ్వానించకపోయినా రాత్రికి డిన్నరుకు వస్తున్నాను. రెడీగావుండండి"

"మీరు వస్తానంటే నాకు చాలా సంతోషమేగాని సరితా వాళ్లు మీ రాకకు ఏమైనా అనుకోవచ్చేమో'' విద్య భయపడ్డదానిలా కన్పించింది.

"ఏమనుకుంటారు? ఫ్రెండ్లీగా పిల్చినంతలో ఏదో అనుకునేంత కుసంస్కారులా వాళ్లు. మీకన్నిటికీ భయమే" రవీంద్ర అంటుంటే విద్య చిన్నబోయిన ముఖంతో నిలబడింది.

"ఏదో సరదాగా అన్నానేగాని నిజంగా డిన్నరుకు వస్తానేమోనని మీరు భయపడనక్కర్లేదులెండి" రవీంద్ర ఆమె మనసు చదివినవాడిలా అన్నాడు.

విద్య మనసు విలవిల్లాడింది.

''ప్లీజ్... అలా అనొద్దు. మీరు తప్పకుండా రావాలి. నేను మీకోసం ఎదురుచూస్తానని మాత్రం మర్చిపోవద్దు" చెప్పి అతడి సమాధానంకోసం ఎదురు చూడకుండా బయటికెళ్ళిపోయింది విద్య.

సాయంత్రం ఓ గంట ముందుగా పర్మిషనడిగి ఇంటికెళ్ళింది విద్య. వెళ్ళేటప్పుడు బజారులో రెండురకాల స్వీట్సు, అరటి పళ్లు కొని పట్టుకెళ్ళింది.

ఇంటి కెడుతూనే విమలతో- "పిన్నిగారూ మీరీ పూట వంట చెయ్యొద్దు. మీ అందరికీ మాఇంట్లోనే డిన్నరిస్తున్నాను" అంది.

"మా అందరికీ శ్రమపడి వంటవండే బదులు నువ్వే మా ఇంట్లో మాతోపాటు భోంచేసి వెళ్ళిపోడంనయం. అంత శ్రమ తీసుకోవద్దు'' అంది విమల.

''ప్లీజ్ అలా అనకండి. ఏదో నా సరదాకొద్దీ" విద్య అభ్యర్థించింది.

"సరే... నీ ఇష్టం. మేమేనా, ఇంకా ఎవరైనా గెస్ట్స్ వస్తున్నారా?'' విమల అడిగింది.

"ఎవరూ లేరనుకోండి" విద్య నసుగుతూ అంటుంటే "లేకపోదమేమిటి! ఎవరో వుండేవుంటారు" విమల విద్య ఆంతర్యం కనిపెట్టినదానిలా అంది.

"మా ఆఫీసరుగారిని మాత్రం పిలిచాను" చెప్పింది.

"రవీంద్రనా"

విద్య తలూపి తన పోర్షన్‌వైపు వెళ్ళిపోయింది. సరిత సాయంతో ఆరింటికల్లా వంట ముగించింది. ఇల్లంతా మరోసారి సర్ది స్నానం చేసి వచ్చింది. తనకున్న చీరలన్నీ అటుఇటూ తిరగేసి ఆఖరుకు వంగపండు రంగులో ఉన్న లైట్ కలర్ చీర సెలక్టు చేసి కట్టుకుంది. జడ వేసుకుని మల్లెల మాల తురుముకుంటూ అద్దంలో చూసుకుంది.

తన మనసు తనకు తెలియకుండానే మేఘ మాలికలమీద పయనిస్తోంది. శూన్యంలోకి నిచ్చెన వేసి పైకి ఎగబాకాలని, ఆకాశం అంచులు చూడాలని ప్రయత్నిస్తోంది.

ఇంతలో ఎవరో తలుపు తట్టినట్టవడంతో – "ఆ... వస్తున్నా" అంటూ వచ్చి తలుపు తీసింది. ఎదురుగా ఫుల్ సూట్‌లో రవీంద్ర నిలబడివున్నాడు.

"మీరా? రండి లోపలకు" ఆహ్వానించింది.

ఇంతలో సరిత కూడా అక్కడికొస్తూ–"అన్నయ్యా!సమయానికొచ్చారు. కబుర్లు తరువాత ముందు బయల్దేరండి. టైమయిపోతోంది" అంటూ హడావుడి పెట్టింది.

"ఎక్కడికి సరితా?" రవీంద్ర అడిగాడు.

"పిక్చరుకు. ఫస్ట్‌షో చూసి వచ్చేక అప్పుడు భోజనాలు చేద్దాం. అన్నయ్యను ఇంతకుముందే టికెట్స్ కొనివుంచమని థియేటరుకు పంపాను. మన కోసం ఎదురుచూస్తూంటాడు. త్వరగా బయల్దేరాలి" సరిత తొందరపెడుతుంటే రవీంద్ర–"పిక్చరుకయితే నేను రెడీయే" ఉత్సాహంగా అన్నాడు.

విద్య వారివెంట వెడుతూ "పిన్నిగారూ! మీరూ మాతోరండి" విమలను కూడా ఆహ్వానించింది.

"నేనెందుకులే విద్యా! మీరు వెళ్ళండి" అంది.

"అంకుల్ వస్తే మీరు భోజనాలు చేసెయ్యండి. మాకోసం చూడొద్దు" విద్య చెప్పింది.

"అలాగేలే. మీరు వెళ్ళండి...టైమవుతోంది" విమల హెచ్చరించడంతో ముగ్గురూ బయటకు నడిచారు.

థియేటర్ దగ్గరలోనే ఉండటంవల్ల అందరూ నడిచే వెళ్ళారు. అప్పటికే భానుమూర్తి టికెట్స్ తీసుకుని థియేటర్లో సీట్లు రిజర్వ్ చేసివుంచాడు. బయటికొచ్చి వీళ్ళ కొరకే ఎదురుచూస్తూ నిలబడ్డాడు.

సినిమాలో మంచి వైవిధ్యముంది. హీరోయిన్‌కు చాలా చిన్న వయసులోనే పెళ్ళవుతుంది. పెళ్ళయిన కొద్దికాలానికే భర్త యాక్సిడెంట్‌లో మరణిస్తాడు. వితంతువైన హీరోయిన్ బొట్టు, గాజులు, పూలు తియ్యడానికి అంగీకరించదు. "ఇది నాకు పుట్టుకతోనే ప్రాప్తించిన హక్కు. అతడు పోయినంత మాత్రాన ఇవన్నీ తీసెయ్యాలని ఏ ధర్మం మీకు చెప్పింది? ఇదిగో...అతడు కట్టిన తాళిని మాత్రం తెంచుకొని తీసుకెళ్ళండిగాని ఇవన్నీ

తియ్యను" అంటూ సంప్రదాయాల మీద తిరుగుబాటు చేసింది. తల్లిదండ్రులు అంగీకరించకపోయినా పినతండ్రి సాయంతో మళ్ళీ చదువు కొనసాగిస్తుంది. డిగ్రీ సంపాదించి ఉద్యోగం చేస్తూ తన బతుకు తను బతుకుతుంది. అప్పుడే హీరోతో పరిచయం లభించడం, ఆ పరిచయం ప్రేమగా మారడం, హీరో ఆమెను పెళ్ళి చేసుకోడానికి సిద్ధపడ్డం జరుగుతుంది. అతడి అభిప్రాయం విన్న తరువాత మాత్రం ఆమె అటు అతగాడి ప్రేమను వదులుకోలేక, తన జీవితంలో గడిచిన దురదృష్టకర సంఘటనల గురించి అతడికి చెప్పలేక సతమతమవుతుంది. మానసికంగా నలిగిపోతుంది. అప్పటి ఆమె మానసిక సంఘర్షణ చాలా గొప్పగా చూపించారు.

సినిమా అంతా చూశాక ఆ సినిమాకు, తన జీవిత కథకు చాలా పోలికవుందని తోచి విద్య హృదయం మరింత బరువెక్కింది.

ఇంటికొస్తుండగా ఆ పిక్చరు గురించే రకరకాలుగా తమ అభిప్రాయాలను వెల్లడి చేస్తూ వాళ్ళంతా గలగల మాట్లాడుతుంటే విద్యవారి వెనుకే పరధ్యానంగా నడిచివస్తోంది.

"విద్యా! మీరిలా మమ్మల్ని అవమానించడం బావోలేదు" రవీంద్ర అన్నాడు.

"ఏం మాట్లాడమంటారు?" విద్య అంది.

"పిక్చరు గురించి మీ అభిప్రాయమేమిటో చెప్తే సంతోషిస్తాంగా" అన్నాడు.

"పిక్చరు వాస్తవానికి చాలా దూరంగా ఉంది" విద్య అంది.

"వాట్? మీకలా అన్పించడం శోచనీయం" అన్నాడు.

విద్య మాట్లాడలేదు. సరిత, భానూ వారి సంభాషణను తమాషాగా వింటున్నారు.

"మీకెందుకలా అన్పించిందో ఆ కారణం చెప్పండి" రవీంద్ర ఆమెను అంతటితో వదలదల్చుకోలేనట్టుంది.

"వితంతువును వివాహం చేసుకునే ఔదార్యం, విశాల హృదయం కలవారు ఇటువంటి సిన్మాల్లోను, కథల్లోను కన్పిస్తారుగాని వాస్తవ సమాజంలో అటువంటి వ్యక్తులుండరు. అందుకే వాస్తవానికి భిన్నంగా ఉందనిపించింది" అంది విద్య.

"అలా అంటే నేనంగీకరించను. ఈ సమాజం మీరూహించినంత వెనక్కు లేదు. ఏ కొద్దిమందైనా మార్పును కోరుతున్నారని, ఆ మార్పుని స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నారని ఖచ్చితంగా చెప్పగలను"

"ఏమూలో అణగారి ఉన్న కొన్ని ఆశలు, కోర్కెలు తీర్చుకునే ప్రయత్నంలోనే ఆ కొద్దిమంది మీరన్నట్టు మార్పును స్వీకరించడానికి సిద్ధపడుతున్నారని నేనంటాను" విద్య అంది.

"అంటే మీ మాటల్లో భావమేమిటో స్పష్టంగా చెప్పండి" రవీంద్ర అడిగాడు.

"మనం చూసిన సిన్మాలో హీరోయిన్ లాంటి బాలవితంతువే ఉందనుకుందాం! ఆమె వెనుక తరగని ఆస్తిపాస్తులేమన్నా ఉంటే ఆ అమ్మాయి వెనుక ఉన్న ఆస్తి కోసమే ఆమెను పెళ్ళి చేసుకోడానికి సిద్ధపడతారుగాని ఆమెను మానవత్వంతో స్వీకరించే ఔదార్యం వారిలో ఉండదంటాను. అధవా ఏ రెండో పెళ్ళివాడైనా ఆస్తిలేని నిరుపేద అమ్మాయిల్ని పెళ్ళిచేసుకోడానికి సిద్ధపడినా అదీ





స్వార్థమేగా! నడివయసులో పడుచు పెళ్ళాన్ని కోరుకున్న అతడిలో ఔదార్యం కంటే వాంఛే అతడినందుకు ప్రేరేపిస్తుం దంటాను" విద్య అంది.

"మీ వాదంతో నేనేకీభవించను" రవీంద్ర అన్నాడు.

"ఎందుకంగీకరించరు! మీకే అటు వంటి అమ్మాయి ఎదురయితే ఆమెను స్వీక రించడానికి సాహసిస్తారా?" విద్య ఆవే శంగా అడిగింది. ఆ సంభాషణ వింటున్న భాను, సరిత కూడా విద్యలో ఆవేశానికి చకితులయ్యారు. రవీంద్ర వాడిగా విని పించిన ఆ ప్రశ్నకంటే ఆమెలో ఆవేశానికి దిగ్భ్రాంతుడయ్యాడు. అప్పటికి విద్య స్పృహలోకొచ్చింది. తనెంత అవివేకంగా ప్రవర్తించిందో అర్థమై సిగ్గుతో చితికి పోయింది. "ఓ! రియల్లీ అయామ్ సారీ! బుద్ధిలేకుండా ఏదో వాగేశాను. ... మన్నించండి" క్షమార్పణ కోరింది.

"నెవర్ మైండ్! అయినా మీ ప్రశ్నకు సమాధానం చెప్పడం నా బాధ్యత. నాకు అటువంటి పరిస్థితే ఎదురుపడితే సంప్ర దాయాలకంటే ఆ వ్యక్తి మనసుకే ప్రాధా న్యతనిస్తాను. ఆస్తిపాస్తులకంటే మానవతకు, మనసుకే విలువనిస్తాను" సౌమ్యంగా చెప్పాడు.

ఇంటికెళ్ళేక అందరూ ఆ విషయమే మర్చిపోయారు. ముందు భానుమూర్తికి, రవీంద్రకు భోజనం పెట్టబోతుంటే- "అదేం కుదరదు. మీరిద్దరూ కూడా మాతో పాటు తినాల్సిందే"నని రవీంద్ర పట్టుబట్ట డంతో సరిత, విద్యకూడా భోజనానికి కూర్చున్నారు. అందరూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు ముగించారు.

భోజనాలయ్యాక విద్య ఇచ్చిన వక్క పలుకు నోట్లోవేసుకుని - "అన్నదాతా సుఖీభవ! ఇలా వారానికోసారి ఇంటికి పిలిచి భోజనం పెడతానంటే పిలిచిందే తడవు మారుమాట్లాడకుండా వచ్చేస్తాను" అన్నాడు రవీంద్ర.

విద్య చిన్నగా నవ్వి ఊరుకుంది.

"వెళ్లొస్తాను విద్యా" రవీంద్ర విద్యతో చెప్పి భానుమూర్తితోపాటు వాళ్ళింటికి వెళ్లాడు.

విద్య వంటిల్లు చక్కబెడుతుంటే "అక్కా! నేనూ సాయంచెయ్యనా?" సరిత వచ్చి అడిగింది.

"వద్దు. నువ్వెళ్ళి గదిలో కూర్చో. అయిదు నిమిషాల్లో చక్కబెట్టి వస్తాను"

విద్య వారించింది.

సరిత వెళ్ళిపోయింది.

విద్య పనంతా చక్కబెట్టి లైట్లార్పి వీధితలుపుకూడా గడియవేసి గదిలో మంచంమీద దుప్పటి తీసిదులుపుతుండగా తలగడకింద ఏదో ప్యాకెట్టు కన్పించింది. ఏమిటోనన్న కుతూహలంతో ప్యాకెట్టు తెరిచి చూసింది. ఆ ప్యాకెట్టులో క్రీమ్ కలర్లో ఉన్న కాశ్మీరు శిల్కుచీర, దానికి మ్యాచింగ్ బ్లౌజుపీసు ఉన్నాయి. చీర మడత విప్పేసరికి అందులోనుండి ఓ తెల్లటికవరు జారికిందపడింది. కవరు తెరిచి అందులోనున్న గ్రీటింగ్ బయటకుతీసి చూసి తనను తాను మర్చిపోయింది విద్య. ఆ గ్రీటింగ్‌లో ఓ యువతి, యువకుడు ఉన్నారు. యువకుడు యువతి భుజాల చుట్టూ చెయ్యివేసి మరో చేత్తో ఆమె చుబుకంఎత్తిపట్టి ఆమె కళ్ళల్లో కళ్లుంచి అనురాగంగా చూస్తున్నాడు. ఆమె ముఖం నిండా సంతోష రేఖలు విచ్చుకోగా అతడి ప్రేమలో విలీనమై తనను తాను మర్చి పోయినట్టు తన్మయత్వంగా చూస్తోంది. చక్కటి కలర్ కాంబినేషన్‌తో ఆ చిత్రం

చూడముచ్చటగా ఉంది. వెనక్కు తిప్పి చూసింది. 'విద్యకు అభిమానంతో రవి' అని రాసివుంది. ఆ అక్షరాలకిందగా ఓ మూల ఆకులమధ్య ఇమిడిన రెండు గులాబీలు చిత్రించి ఉన్నాయి.

చటుక్కున ఆ గ్రీటింగ్‌ను ముద్దు పెట్టుకుని అంతలోనే సిగ్గు ముంచుకురాగా కళ్ళు మూసుకుంది విద్య. ఆ కళ్ళముందు రవీంద్ర రూపం కదలాడింది.

విద్యకు ఆ రాత్రంతా నిద్రపట్టనేలేదు. కలతనిద్రలో ఏవేవో కలలు. రవీంద్ర, తనూ చెయ్యీ చెయ్యీ కలిపి ఎక్కడికో సాగిపోతున్నట్టు ఓ కల! తను ఒంటరిగా దిగులుగా కూర్చున్నట్టు ఇంకో కల! ఇలా ఏవేవో...

* * *

వీధి తలుపు ఎవరో తట్టడంతో గబగబవచ్చి తలుపుతీసింది. ఎదురుగా సరిత నిలబడి ఉంది.

"అక్కా! ఇదిగో నీకు ఉత్తరం వచ్చింది"

"ఏది ఇలా ఇవ్వు" విద్య ఆ లెటర్ అందుకుంది.

"ఆ లెటర్ చదివే శ్రమ నీకక్కర్లేదు. నేనే ఆ తాజావార్త చెప్పేస్తున్నా! మీ వంశ మూలవిరాట్టు, కులదేవత శ్రీమతి మీనాక్షమ్మ తల్లి రేపు సాయంకాలం దయచేయుచున్నది" సరిత హాస్యంగా అంది.

ఆ వార్త వినగానే విద్యలో ఓపికనంతా ఎవరో ఒక్కసారి లాగేసినట్టయింది.

"నిజమేనా?" అంది.

"నిజమే. నీకడ అసత్యములు పల్కుదునా? ఇంతకీ ఆమె రాకకు కారణం జెప్పెదో నీవెరుంగుదువా?" అంది సరిత.

"ఏమో ... తెలియదు. ఈ నెలలో సుమతిని పురుడుకు తీసుకొస్తున్నట్టు, ఆమె వెళ్ళేవరకూ మరో వందరూపాయలు ఎక్కువ పంపమని రాసింది. అయినా నేనెప్పటిలాగే యమ్. ఓ. చేశానుగాని ఎక్కువ పంపలేదు. ఆమె ఆజ్ఞ ఉల్లంఘించినందుకు నన్ను చీల్చి చెండాడాలని వస్తున్నట్టుంది" విద్య అంది.

"అసలు నువ్వు డబ్బెందుకు పంపాలట? నువ్వు సంపాదిస్తున్నది వాళ్ళకోసం కాదుగదా! ఎప్పుడో ఏదో చేశారని నిన్ను జలగలా పీడిస్తుంటే నువ్వెందుకు సహించాలి? నీ సంపాదన కావాలిగాని నీ మంచి చెడ్డలు వాళ్ళకక్కర్లేదు. నీ మెతకదనమే నిన్ను పాడుచేస్తోంది" సరిత అలా ఆరిందాలా మాట్లాడుతుంటే ప్రేమగా చూస్తూ—

"పోనిద్దు చెల్లీ! నేను మాత్రం ఎవరికి పెడుతున్నాను. నా వాళ్ళకేగా. నా తల్లిదండ్రులయితే మాత్రం పెట్టుకోనూ! వాళ్ళెలాగూలేరు" అంటూ సర్ది చెప్పింది.

"నువ్వు వాళ్ళకిస్తున్నావని కాదక్కా! అంత పంపు, ఇంత పంపించని నీమీద హక్కున్నట్టు అధారిటీ చేస్తున్నవారికి నీ క్షేమం గురించి కాస్తయినా ఆలోచించాల్సిన అవసరముందిగా"

"ఇప్పుడు నాకేమయింది సరితా?"

"ఏమయిందా... ఇప్పుడు నీ వయసెంత?

"ఇరవై రెండేళ్ళు నిండాయి"

"అవునుగదా! ఈ వయసులో ఆడపిల్లకు పెళ్ళిచేసి అత్తవారింటికి పంపాలన్న జ్ఞానం, ఆ బాధ్యత ఆమెకుగానీ, ఆమె భర్తకుగాని ఉందంటావా? లాభం లేదు. వాళ్ళెలాగూ నీకు పెళ్ళిచెయ్యరు. నువ్వయినా సాహసించి పెళ్ళి చేసుకో అక్కా! పోనీ నీ పెళ్ళి విషయం





నీ తరఫున దాదీకి చెప్పనా? నీకెలాగూ ఉద్యోగం ఉంది కాబట్టి కట్నం లేకుండా చేసుకోడానికి ముందుకొచ్చే యువకు లుండకపోరు" అంది సరిత. పెళ్లి ప్రసక్తి రాగానే విద్య ముఖం కాంతి విహీనమయింది.

"చెప్పొద్దు సరితా! నీ ఆత్మీయతకు నా కృతజ్ఞతలు. నా ముఖాన పెళ్లి రాత రాసి పెట్టలేదు" నిస్పృహగా అంది.

"ఏం...ఎందుకులేదు? చదువుకున్న దానివి. నుదుటిరాతలూ, కర్మఫలాలు నమ్మికు కూర్చుంటావెందుకు? అయినా నీ ముఖానికేం? నీ అందం చూసి ఎవరైనా నిన్ను పెళ్ళాడ్డానికి ఎగిరి గంతేస్తారు. నా మటుకు నేను ఆడపిల్లనయ్యానుగాని మగాడినైయుంటే నిన్ను చూసిన మొదటి చూపులోనే ప్రేమించేసి ఈపాటికి పెళ్ళాడి ఉండేదాన్ని" అన్న సరిత మాటలకు విద్య నవ్వుతూ-

"మాట్లాడి చాలా అలిసిపోయావుగాని ముందీ టీతాగు" అంటూ సరితకు టీకప్పు అందించింది.

మర్నాడు సాయంత్రం ఆఫీసునుండి ఇంటికొచ్చేసరికి విద్య మేనత్త మీనాక్షి పిధి గుమ్మంలోనే ప్రత్యక్షమయింది.

"బావున్నావా అత్తా?"

"ఆ! బాగానే ఉన్నాను" పొడిగా చెప్పింది.

"మామయ్య రాలేదా?"

"లేదు"

విద్య లోపలికెళ్లింది. ఆమె వెనుకే మీనాక్షి కూడా లోపలికొస్తూ-

"ఫ్లాస్కులో టీపోసి ఉంచాను తాగు" అంది. విద్య ముఖం కడుక్కొని వచ్చి ఫ్లాస్కులో టీ గ్లాసులోపోసి తెచ్చుకుంది.

"నువ్వు తాగవా అత్తయ్యా!" అడిగింది విద్య.



"ఆ...తాగాను"

"ఇప్పుడు చెప్పు విశేషాలేమిటో?"

"కిందటి నెలాఖరున నేను రాసిన ఉత్తరం అందిందా?"

"అందింది"

"అందితే డబ్బులెందుకు పంపించ లేదు?"

"వీలుపడలేదు"

"ఎందుకని?"

"కిందటి నెల్లో కమల వచ్చినప్పుడు ఆ నెల జీతమంతా ఖర్చయిపోయింది. పైగా అప్పు చెయ్యాల్సొచ్చింది. మరి ఆ అప్పు తీర్చాలిగా"

విద్య మాటలకు మీనాక్షి బుగ్గలు నొక్కుకుంటూ–"ఇదేం చోద్యమే! కమల కోసమే ఆ జీతమంతా ఖర్చు చేశావంటావా? అది ఉన్నది ముష్టి మూడు రోజులేగా" విడ్డూరంగా అంది.

"అవును...మూడురోజులే. నాలుగు వందల రూపాయల బట్టలు తీసుకుని బిల్లు నాకప్పగించింది. ఇంటికవి కావాలి, ఇవి కావాలి అంటూ కప్పులు, సాసర్లు, లెమెన్ సెట్టు కొనిపించింది. సిన్మాకు వెడదామంటే బయల్దేరి అట్నుండి అటే హోటల్ కెళ్ళి భోజనం చేస్తే ఏభై రూపాయలూడాయి. కమల వెళ్ళేటప్పటికి నా దగ్గర చిల్లర డబ్బులు మిగిలాయంతే" చెప్పింది విద్య.

"అయితే ఇప్పుడు నువ్వేమంటావు?" విసుగ్గా అడిగింది మీనాక్షి.

"ఎప్పటిలాగే పంపిస్తాను. నాకు ఎక్కువ పంపడానికి వీలుపడదు. మీకు అవసరాలు పెరిగాయని నాకిక్కడ జీతం పెరగదుగా" విద్య అంది.

"ఏమో అనుకున్నాను నువ్వు చాలా పెద్దదానివయ్యేవు" వ్యంగ్యంగా అంది.

"ఇదంతా నీ చలవే! నువ్వేగా నన్ను పెంచి ఇంతదాన్ని చేశావు" దెబ్బ తిప్పి కొట్టింది.

"ఏమయినా ఒడ్డుకు చేరిన మనిషివి నువ్వు. ఇక మా ప్రసక్తి ఏముంది?" మరో బాణం ఎక్కుపెట్టింది మీనాక్షి.

"ఒడ్డుకు చేరానుకాబట్టిచేతనైనంతలో నీకు చెయ్యందిస్తున్నానంటున్నాను. నీళ్ళలో మునిగి ఈదమంటే మాత్రం నావల్లకాదు" విద్య చెప్పింది.

"నీ ఇష్టం వచ్చినట్టే చెయ్యి" మీనాక్షి అంతటితో ఊరుకుంది. విద్యకి ఇప్పుడెంతో గర్వంగా అనిపించింది. మీనాక్షికి సమాధానం చెప్పగలిగే ధైర్యం తనకెలా వచ్చిందో ఆమెకే అర్థంకాలేదు.

మీనాక్షి వెళ్ళేముందు – "నీ సూట్ కేసులో కొత్త చీరుందిగా...అది నేను తీసుకెడతాను. సుమతికి పురుడు వెళ్ళేక చీర పెట్టి పంపాలిగా" అంది.

విద్య గతుక్కుమంది. అది రవి తనకు ప్రజెంట్ చేసిన చీర.

"ఆ చీరా... వద్దు! ఆ చీర నాదికాదు. మా ఫ్రెండ్ ది" కంగారుగా అంది.

"ఎవరిదో అయితే నీదగ్గరెందుకుంది?"

"వాళ్ళ త్తగారి నోటికి ఝడిసి నా దగ్గర దాచుకుంది" అబద్ధం చెప్పింది.

మీనాక్షి ఇక మాటాడలేదు.

"నేను మళ్ళీ నెల్లో చీరకొని ఉంచుతానులే" ఆమెను శాంతపరచింది విద్య.

మీనాక్షి ముఖం ముడుచుకునే వెళ్ళింది. ఆమె వెళ్లేక విద్య తేలిగ్గా ఊపిరి వదిలింది.

* * *

ఆదివారం. మధ్యాహ్నం భోజనంచేసి బద్ధకంగా పడుకునుంది విద్య.

కళ్లు మూసుకుందేగాని నిద్రపట్టలేదు.





రవీంద్ర ఊరెళ్లాడు. మూడు రోజులయింది. అతడి తలపులు తనను నిలువనియ్యడంలేదు. ఏమిటి తనలో ఈ బలహీనత? ఈ భావాన్నే ప్రేమంటారేమో? ఆ ప్రేమ అనే రెండక్షరాల్లో ఇంత మధురిమ ఉంటుందా? ఈ మూడు రోజులూ ఆఫీసులో తనకు పనిచెయ్యాలనే ఆసక్తే ఉండేదికాదు. ఆఫీసరు లేనందుకు స్టాఫంతా నవ్వుతూ, తుళ్ళింత లాడుతూ స్వేచ్ఛాలోకంలో విహరిస్తుంటే తనుమాత్రం మూతి ముడిచి మవునంగా కూర్చుంది. వారి ఆనందంలో తను పాలుపంచుకోలేకపోయింది. నళిని అసలే గట్టిపిండం. తన వైఖరి గమనించి "ఏమిటోయ్...అలా ఉన్నావు? దుర్వాసుడు లేనందుకు అందరూ సంతోషిస్తుంటే నువ్వేమిటిలా దివాళా తీసినట్టు ముఖం పెట్టావు! ఈ దిగులంతా ఎవరి మీదేమిటి?" అంటూ ఆరాలు తియ్యడం మొదలుపెట్టింది. ఆమెను నమ్మించడానికి, తన మనసు బయటపడకుండా జాగర్త పడ్డానికి మీనాక్షి అత్త కథనం బాగా ఉపయోగపడింది. మీనాక్షి అత్త ఆగడాలు గురించి మనసు కరిగేలా చెప్పేసరికి పాపం నళిని చిత్తయిపోయింది.

"బాధపడకోయ్! అటువంటి మనుషులు కూడా మనమధ్య ఉన్నారు. ఏం చేస్తాం?" అని ఓదార్చింది.

ఈ ప్రేమలో ఉన్న మహత్తేమిటో కాని అబద్ధాలు పలికించి సాహసాలు కూడా చేయిస్తోంది- అనుకుంటూ ఆ సాయంత్రం విద్య కళ్లు మూసుకుని ఆలోచనలలో తేలిపోతుండగా ఎవరో లోపలికొచ్చినట్టు అలికిడవడంతో కళ్ళువిప్పి చూసింది. ఎదురుగా రవీంద్రను చూసి సంభ్రమంగా లేచి "ఎప్పుడొచ్చారు?" అంది.

"ఉదయం వచ్చేను. ఏమిటిలా పడుకున్నారు?" అడిగాడు.

"ఊరికే. ఇలా పడుకుని మీ గురించే ఆలోచిస్తుంటే సినిమాల్లోలా హఠాత్తుగా ప్రత్యక్షమయ్యారు" విద్య నవ్వుతూ అంది.

"నా గురించి ఆలోచించడానికి ఏముంటుందబ్బా?" రవీంద్ర సాలోచనగా అన్నాడు.

"ఊహూ...చెప్పను. కొన్ని ఊహలు, ఆలోచనలు మనసుకే పరిమితం" విద్య హృదయం ఆనందంతో ఎగిరెగిరి పడుతుండటంవల్ల ఆమె మాటలు ఆమెకు తెలియకుండానే బయటికొస్తున్నాయి.

"విద్యా! త్వరగా చీర మార్చుకుని కాస్త నీట్‌గా తయారై భాను ఇంట్లోకి రండి! మీకో గెస్టును పరిచయం చెయ్యాలి" చెప్పి రవీంద్ర వెళ్ళిపోయాడు.

"ఎవరబ్బా ఆ గెస్టు?" ఆలోచిస్తూనే జడవేసుకుని పది నిమిషాల్లో తన అలంకరణను ముగించింది. రవీంద్ర రమ్మని చెప్పి వెళ్ళినా భాను ఇంట్లోకి వెళ్ళడానికి సందేహిస్తూ గదిలోనే అస్థిమితంగా అటు ఇటు తచ్చాడింది. సరిత రాగానే తలుపు గడియపెట్టి వెంటవెళ్ళింది.

హాల్లో సోఫాలో రవీంద్ర పక్కన భానుమూర్తి, వారికెదురుగా విమల, విమల పక్కనే ఎవరో అపరిచిత యువతి కూర్చుని ఉండటంచూసి విద్య సంకోచంగా గదిబయటే ఆగిపోయింది.

"లోపలికి రా విద్యా" విమల ఆహ్వానించడంతో లోపలికొచ్చి విమలకు మరో పక్క కూర్చుంది.

"రోజా! ఈమె విద్య" అంటూ ఆ యువతికి విద్యను పరిచయం చేశాడు

రవీంద్ర.

"నమస్కారం" సరోజ నమస్కరిస్తుంటే- "విద్యా! ఈమె నా చెల్లెలు సరోజ" అంటూ పరిచయం చేశాడు రవీంద్ర.

సరోజ తననెందుకో కళ్లు విప్పార్చి పరీక్షగా చూడ్డం గమనించి విద్య సోఫాలో అసహనంగా కదిలింది.

"మేమలా బయటికెళ్లొస్తాం. మీరు మాట్లాడుకోండి" అని చెప్పి రవీంద్ర, భాను బయటకు వెళ్ళిపోయారు.

'ఇప్పుడే వస్తానంటూ' విమల టిఫిను ఏర్పాట్లు చూడ్డానికని లోపలికి వెళ్ళింది. ఇక అక్కడ సరోజ, విద్య, సరిత మిగిలారు.

"మీరేం చదివారు?" సరోజే విద్య నడిగింది.

"బి.ఎ"

"ఇక్కడ మీరొక్కరే వుంటున్నారా?"

"అవునండీ"

"అదేం? మీవాళ్ళెవరూ మీతో ఉండటంలేదా?"

"నావాళ్ళంటూ ఎవరూలేరు. అమ్మా నాన్నా చిన్నప్పుడే పోయారు. మా మేనమామ దగ్గరే పెరిగాను"

"మీరు కూడా మా అన్నయ్య పని చేస్తున్న ఆఫీసులోనే పనిచేస్తున్నారటగా?" అంది సరోజ.

"ఆ...అవును" అంతటితో సంభాషణ మరి ముందుకుసాగలేదు. ఈసారి విద్యే చొరవతీసుకుని- "మీవారేం చేస్తారు?" అడిగింది.

"జూనియర్ ఇంజనీరుగా పని చేస్తున్నారు" చెప్పింది సరోజ.

"మీరెంత వరకూ చదివారు?"





"మీ అంతకాదులెండి! హైస్కూలు చదువు ముగించానంతే! నాన్నగారికి ఛాందసమెక్కువ. ఎదిగిన ఆడపిల్లకు పైచదువులుఅనవసరమనే ధోరణిలోవుండే వారు. అన్నయ్య ఎంత నచ్చజెప్పాలని చూసినా నాన్నగారు అంగీకరించలేదు. అందుకే నా చదువుకు మధ్యలోనే బ్రేకు పడింది''

"మరి మీ అమ్మగారైనా ఆయనకు నచ్చచెప్ప ప్రయత్నించలేదా?'' విద్య ప్రశ్నతో సరోజ ముఖం మ్లానమయింది.

"అమ్మ ప్రేమకు నోచుకునే అదృష్టం మాకులేదు. నాకు బాగా చిన్న వయసులోనే అమ్మ పోయింది. నాన్న తమ ప్రాణాలన్నీ మా ఇద్దరిమీదే నిలుపుకుని పెంచి పెద్దచేశారు" చెప్పింది సరోజ.

"మీతోపాటుమీవారుకూడావచ్చేరా?"

"రాలేదు. దీపావళినాటికి వస్తానన్నారు" చెప్పింది సరోజ.

ఇంతలో విమల టిఫిన్ ప్లేట్లున్న ట్రేతో వచ్చి, "టిఫిన్ తీసుకోండమ్మా" అంది.

"ఇప్పుడీ టిఫిన్లవీ చేసి ఎందుకు శ్రమ పడ్డారాంటీ'' నొచ్చుకుంది సరోజ.

''శ్రమేముంది. మీకోసమే ప్రత్యేకించి చెయ్యలేదుగా" వారు టిఫిన్ ముగించే సరికి బయటికెళ్ళిన రవీంద్ర,భాను కూడా వచ్చేశారు.

"మీ లేడీస్ అన్నిటా ఫస్టులావున్నారే? టిఫిన్ తినడంలో కూడా మాకంటే ముందుగా వున్నారు'' అన్నాడు నవ్వుతూ రవీంద్ర.

మరికాసేపు కూర్చుని సరోజ, రవీంద్ర 'వెడతామంటూ' లేచారు.

"ఈ పూట భోంచేసి వెళ్ళండి" అంది విమల.

"మరోసారి వస్తాం ఆంటీ! ఈ పూట

కిక మమ్మల్ని ఇబ్బంది పెట్టొద్దు" సరోజే అంది.

విమల బలవంతం చెయ్యలేదు–"రవీ! సరోజను అప్పుడప్పుడు తీసుకొస్తుండు" అంది.

"అలాగే అంటీ" రవీంద్ర విద్య దగ్గర కళ్ళతోనే సెలవు తీసుకుని సరోజను వెంటబెట్టుకుని వెళ్ళిపోయాడు.

ఇంటికెళ్ళాక, "అన్నయ్యా! నీ సెలక్షన్ చాలాబావుంది" సరోజ రవీంద్రతో అంది.

"రోజా!"

"అవునన్నయ్యా! నీ మనసునర్థం చేసుకోలేనంత అమాయకురాలిననుకున్నావా?"

"కాని మనం ఆశించినవన్నీ లభించవుగా?" రవీంద్ర అన్నాడు.

"అది అందరి విషయంలో కావొచ్చు నీ విషయంలో మాత్రంకాదు" దృఢంగా అంది.

"విద్య నీకు నచ్చిందా?"

"విద్య రూపం, సంస్కారం అన్నీ వున్న మనిషి! ఇంకేం కావాలి?"

"అయినా ఆమె మనసులో నాపట్ల ఎటువంటి భావాలున్నాయో?"

"నిన్ను చూడగానే మెరిసే ఆమె కళ్ళే ఆమె మనసును విప్పి చెప్తున్నాయి. అయినా కళ్ళతో మూగభాషలాడుకునే మీ ఇద్దరికీ ఒకరంటే మరొకరికి ఇష్టమని అర్థమవుతూనేవుంది" సరోజ అంది.

పట్టుబడ్డ దొంగలాచెల్లెలివైపుచూశాడు.

"ఇప్పట్లో నా అభిప్రాయం విద్యకు చెప్పను. ఆమెను పూర్తిగా అర్థంచేసుకునే వరకూ నా అభిప్రాయం వెల్లడించదల్చుకోలేదు" రవీంద్ర అన్నాడు.

"నిన్ను చూస్తే నాకు గర్వంగా ఉందన్నయ్యా" సరోజ ఆర్ద్రంగా పలికింది.

"ఎందుకు?"

"అన్నయ్యా! ఈ దేశంలో ఆడపిల్లగా పుట్టడమంత దురదృష్టం మరోటి లేదనుకుంటాను. ఆడపిల్ల పెళ్ళి అనేసరికి వరకట్నం పెద్ద సమస్య అయి కూర్చుంటుంది. అప్పోసప్పోచేసి కట్నం ఇద్దామనుకున్నా ఆ కట్నాల బరువుకు సరిపడే లాంఛనాలు, వియ్యపువారి మర్యాదలు, అల్లుడికిఆషాడానికోబహుమతి, పండుగకు మరో బహుమతి – ఇటువంటి లేనిపోని సంప్రదాయాలతో ఆడపిల్లతల్లిదండ్రులను చెండుకుతింటారు. ఒక్కపిల్ల పెళ్ళిచేసి తిరిగి చూసుకుంటే పాపంలా పెరిగిన అప్పులు కన్పిస్తాయి. ఈ కరువురోజుల్లో బతుకీడ్వడమే ఓగండమనుకుంటే ఈ సంప్రదాయాల సంకెళ్ళు గుదిబండల్లా తగులుకుని మనిషిని ముందుకు సాగనివ్వవు. నువ్వయినా వాటిమీద తిరుగుబాటుచెయ్యాలి. కట్నాలు తీసుకుని తాళికట్టే ప్రబుద్ధులంతా నిన్ను చూసి తలవంచాలి. నీ పెళ్ళికి ఆడంబరాలొద్దు. లాంఛనాలు, కట్నాలు ఇవేవీ సమస్య కాకూడదు. నేనూహించిన రీతిలో నిరాడంబరంగా నలుగురి పెద్దలమధ్య నీ పెళ్ళి జరిగిపోవాలి. అదే నాకోరిక" ఏదో కలలో తేలిపోతున్నట్టు మాట్లాడుతున్న రోజా మాటల్లో ఎవరిమీదో కసి, పగ ప్రస్ఫుటమయ్యాయి.

"రోజా! నువ్వు కోరినట్టే జరుగుతుంది" చెల్లెలి భుజంమీద చెయ్యేసి తట్టేడు.

సరోజ తానున్న ఇరవైరోజుల్లోనూ నాలుగైదుసార్లు విమలగారింటికొచ్చింది. విద్యకూడా తన సంకోచాలన్నీ వదిలి ఆత్మీయురాలయింది. రెండుసార్లు సరిత,



సరోజ, రవీంద్రలతో పాటు సన్మాకు కూడా వెళ్ళింది.




దీపావళి రెండు రోజులుండగా సరోజ భర్త ప్రకాష్ ఊర్నుండి వచ్చేడు. అతణ్ని చూడగానే సరోజముఖం మ్లానమయింది. మరుక్షణంలో చిర్నవ్వుముఖాన పులుముకుని- "రండి లోపలికి. అత్తయ్య, సుధా బావున్నారా?" అడిగింది. ముక్తసరిగా 'ఊ' అని లోపలికొచ్చేడు.

"కాఫీ తెస్తాను" అంటూ సరోజ లోపలికెళ్ళింది. మరికొద్దిసేపట్లో సరోజ తెచ్చినకాఫీ అందుకుని- "వెళ్ళగానే లెటర్ రాస్తానన్నావుగా రాయలేదేం?" అడిగాడు.

"రెండుత్తరాలు రాశానుగా... మీకు అందలేదా?" అంది సరోజ.

"నాక్కావల్సిందినీక్షేమసమాచారాలు కాదు. అమ్మ నువ్విక్కడకు వచ్చేముందు నీకేం చెప్పింది?"

"అదా? నేను...అన్నయ్యను అడగలేదు" తడబడుతూ అంది సరోజ. ప్రకాష్ కళ్లు జేవురించాయి.

"ఎందుకడగలేదు?" అతడి స్వరం కర్కశంగా పలికింది.

"అన్నయ్యకు ఆఫీసుపనులతో తీరిక లేదు. ఎప్పుడూ ఆ విషయం కదిపేంత సావకాశం దొరకలేదు" సరోజ మాటలను బుసకొట్టాడు-

"అబద్ధం అందంగా అతికినట్టు చెప్పడం నీకు చేతకాకపోతే నోర్మూసుక్కూర్చోవాలి. నువ్వొచ్చి ఇరవైరోజులు దాటినా మీ అన్నయ్యతో ఆ విషయం కదిపే అవకాశమేదొరకలేదంటున్నావంటే నమ్మే వెర్రివెంగళాయినికాను. నీ సంగతి తెలిసిన సుధ- 'వదినకు ఆ విషయం వాళ్ళన్నతో మాట్లాడ్డం ఇష్టముండదు' అని అంటూనే వుంది. నీకు నా మాటంటే గౌరవముందేమోనని భ్రమపడ్డాను" ప్రకాష్ మాటలకు సరోజ కళ్ళల్లో నీళ్లు చిప్పిల్లాయి. ఆమె మౌనం అతడి కోపానికి ఆజ్యం పోసింది.

"ఎందుకా ఏడుపు? మాటంటేచాలు ఏడుస్తూ కూర్చోడం తెలుసు. వెళ్లు... లోపలికెళ్ళి ఏడ్వు" విసుక్కున్నాడు. సరోజ ప్రాణంలేని బొమ్మలా లోపలికెళ్ళిపోయింది.మళ్ళీ అతడిదగ్గరకువెళ్లాలనిపించలేదు. వంటమనిషి రాఘవులుకి అవీ ఇవీ పురమాయిస్తూ వంటింట్లోనే ఉండిపోయింది. ప్రకాష్‌కూడా అదేం పట్టించుకోలేదు.

కొంత సేపయ్యేక లోపలికొచ్చి- "నేనలా బయటికెడుతున్నా" సరోజను పిల్చి చెప్పేడు.

"వంటయింది... భోంచేసి వెళ్ళండి" సరోజ అంది.

"ఆకలేస్తే ఊరినిండా హోటల్సు వున్నాయి. ఎక్కడోచోట తినేస్తానులే. ఇంట్లోవుంటే బోర్‌కొడుతోంది" అంటూ బయటికెళ్లాడు ప్రకాష్.

'అమ్మ, చెల్లి దగ్గరలేరుగా. బోర్ కొట్టకేంచేస్తుంది?' విరక్తిగా అనుకుంది.

మధ్యాహ్నం రవీంద్ర ఇంటికొచ్చేసరికి ప్రకాష్ ఇంకా ఇంటికి రాలేదు.

"బావొచ్చేరని ఫోన్ చేశావుగా! ఆయనెక్కడా కన్పించరేం?" చెల్లెల్ని




అడిగాడు.

"లేరన్నయ్యా! ఇంట్లో బోర్ కొడుతోందట. బయటికెళ్లారు" నవ్వుతూ చెప్పింది.

"భలే వింతమనిషే! నువ్వుండగా అతడికి బోర్ కొట్టడమేమిటి?" రవీంద్ర అన్నాడు. సరోజ జవాబివ్వకుండా "పదన్నయ్యా ... భోజనం చేద్దాం!" అంటూ వంటింటివైపు వెళ్ళింది.

భోజనం చేశాక సరోజ అన్నగారి దగ్గరకొచ్చి "అన్నయ్యా! నీతో ఓ విషయం మాట్లాడాలి" అతడి పక్కనే కూర్చుంటూ అంది.

రవీంద్ర చదువుదామని తీసిన పేపరు పక్కకు పెట్టి - "ఏమిటి రోజా అది" అన్నాడు.

"అన్నయ్యా! ఆయన నీతో ఓ విషయం మాట్లాడబోతున్నారు. ఆయన మాటల్లో పడి ఆయనకే విషయంలోనూ మాటివ్వకు. ఇచ్చేవంటే నీ జీవితాన్ని నువ్వే నిప్పుల గుండంలోకి నెట్టుకున్న వాడివవుతావు" అంది.

రవీంద్ర కనుబొమలు ముడిపడ్డాయి. "విషయమేమిటో స్పష్టంగా చెప్పమ్మా" అన్నాడు.

"మా ఆడబిడ్డ సుధ నీకు తెలుసుగా"

"ఎందుకు తెలియదు. పాపం! ఇప్పుడామెకేమయిందట"హాస్యంగా అన్నాడు.

"ఏంలేదులే. ఆవిడపై నీ అభిప్రాయం ఏమిటి?"

"నీ ప్రశ్నకు సమాధానంగా ఓ రెండు తావుల వ్యాసం రాయొచ్చు. అయినా కాలహరణం నాకిష్టంలేదు కాబట్టి క్లుప్తంగా చెప్తాను. ఆ వాలుకంటి చూపులకు పదేళ్ళ పాప కూడా ఝడుసుకుంటుంది. అందంతక్కువ,అలంకరణపై మోజెక్కువ. అంతర్ సౌందర్యం అంటే అర్థం తెలియదు. ఆమె అహంకారం బరువు మరో ఐదు కేజీలు ఎక్కువుంటుంది. ఆమెను కట్టుకోబోయేవాడు ఆమె ఇంటి పెద్ద పాలేరు కావాలని వాంఛించే విశాల హృదయం కలది. సినిమాలు; షికార్లపై ఉన్న మోజు సంసారం మీద పెంచుకోలేని ఆధునికపు అతివ. ఆమెను కట్టుకోబోయేవాడు కోటీశ్వరుడయి ఉండటం చాలా అవసరం. నాబోటివాడయితే ఆ పూర్ ఫెలో నెల జీతం ఆమె వాడే పెర్ఫ్యూమ్స్‌కు, బాత్‌రూమ్ చెప్పులకు కూడా రాదు" రవీంద్ర చెప్తుంటే సరోజ నవ్వేసింది.

"ఇక ఆపు బాబూ. క్లుప్తంగా చెప్తున్నానంటూ చాలా బాగానే వర్ణించావు" అంది.

"ఏదో అడిగావు కదా అని చెప్పాను. ఇంతకీ విషయమేమిటి?" అన్నాడు.

"ఆమెగారు నిన్ను ప్రేమించిందట"

"హతోస్మి! నేను తప్ప ప్రేమించడానికి ఆ తల్లికి లోకంలో ఇంకెవరూ దొరకనేలేదా?'' నీరసంగా పలికాడు రవీంద్ర.

"ఏమో! ప్రేమ చాలా విచిత్రమైందని, ఎప్పుడు ఎవరిమీద ఎటువంటి పరిస్థితుల్లో ఆ ప్రేమ ప్రవాహం పుట్టుకొస్తుందో చెప్పలేమని వారంరోజులు కిందట నువ్వేగా చెప్పావు" సరోజ నవ్వు దాచుకుంటూ అంది.

"ప్రేమా, గీమా గోటుహెల్. ఆమెతో ప్రేమించబడటమనే హింసకు గురి కాబడ్డంకంటే లక్షణంగా సన్యసించడం ఆరోగ్యప్రదం. ఇక ఆ విషయం వదిలి మరేదైనా మాట్లాడు" రవీంద్ర అయిష్టంగా అన్నాడు.

"వదలండమెలా కుదురుతుంది. మీ

బావగారు అడగబోయే విషయమదే. ముద్దు చెల్లెలు మనసుపడ్డ ఒక్క కోర్కెను తీర్చడం ఆ అన్నగారి బాధ్యత. తన చెల్లెలు మనసు పడింది నిన్నే అని తెలియగానే ఆ విషయం అడగమనే నన్ను ప్రత్యేకించి ఇప్పుడు పంపించాడు. నేనడగలేదని తెలుసుకొని ఆయనే నిన్నడగడానికి సిద్ధంగా ఉన్నారు. ఈ విషయంలో నా గురించి ఆలోచించి నీ భవిష్యత్తును నాశనం చేసుకోకు. నీ అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా చెప్పు. ఆమెను చేసుకుంటే సుఖపడలేవు. జీవితాంతం నరకంలో వేగిపోతావు'' సలహా ఇచ్చింది సరోజ.

"రోజా! నేనెవరికీ తలవంచనని నీకూ తెలుసు. నాకిష్టంలేని పనిని నాచేత ఎవరూ చేయించలేరు. నా గురించి నువ్వు భయపడకు. ఒక మాటడుగుతాను నిజం చెప్పు. ప్రకాష్ ఎటువంటివాడు? నీపట్ల ఎలా ప్రవర్తిస్తున్నాడు?" అడిగాడు రవీంద్ర.

"తల్లి దండ్రులపట్ల గౌరవం చూపాలన్న సూక్తి తెలిసినవాడు. రామాయణమంటే భక్తి ఉన్నవాడు. శ్రీరామునిలా మాతృవాక్య పరిపాలకుడే కాదు భార్య అనేది సీతలా పతిభక్తిని చూపాలని కోరుకునేవారిలో మొదటివాడు. భార్యతో ఏ బంధమైనా పడకటింటికే పరిమితం చెయ్యాలనుకునే బుద్ధిమంతుడు" సరోజ చెప్తుంటే రవీంద్ర ప్రకాష్‌ను లోలోపల అసహ్యించుకున్నాడు. రోజా మనస్తత్వం అతడికి బాగా తెలుసు. తల్లి పెంపకంలో పెరగని ఆడపిల్ల మంచి, చెడు తెలియక పెంకిఘటంలా తయారవుతుందంటారు. సరోజ అలా కాదు. పరిస్థితులను తనకనుకూలంగా మార్చుకోడానికి ప్రయత్నిస్తుంది. ఆ ప్రయత్నంలో ఓడితే తనే ఆ పరిస్థితులకు అనుకూలంగామారి తనచుట్టూవున్న వాతావరణాన్ని ఆహ్లాదంగా ఉంచగలిగే నేర్పు కలది.

"రోజా! వజ్రాలగని అని భ్రమపడి నిన్ను తీసుకెళ్ళి మసిబొగ్గుల్లో వేశామన్న మాట" రవీంద్ర బాధగా అన్నాడు.

"దానికి నువ్వెందుకన్నయ్యా బాధ పడ్డం! ఎదుటిమనిషి అంతరంగం తెలుసుకునే సాధనాలేవీలేవు. నా గురించి నువ్వు మధనపడకు. నేను దేనికయినా ఎడ్జస్టవగలను" అన్నగారిని ఓదార్చింది సరోజ. రవీంద్ర మవునంగా కూర్చుండిపోయాడు.

సరిగా అప్పుడే ప్రకాష్ లోపలికొచ్చేడు–"బావున్నారా" రవీంద్ర పలుకరించాడు. తలూపి వచ్చి రవీంద్రకెదురుగా కూర్చొన్నాడు ప్రకాష్.

"ఎక్కడికెళ్ళారు?" రవీంద్ర అడిగాడు.

"ఏంతోచక అలా పిక్చరుకెళ్లాను"

"మా చెల్లాయి దగ్గరుండగా తోచకపోడమంటూ ఉండదే?"

"మీ చెల్లాయి మీ దగ్గరలా ఉంటుందేమోగానీ నాదగ్గరమాత్రం పప్పుముద్దే! మాట్లాడితే నోటిముత్యాలు రాలుతాయనుకుంటుంది" ప్రకాష్ నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అన్నాడు.

"భోజనానికి రండి! ఇప్పటికే చాలా ఆలస్యమయింది" సరోజ పిలవడంతో ప్రకాష్ లేచి లోపలికెళ్లాడు.

ప్రకాష్ వెళ్ళేముందురోజు రవీంద్రతో అసలు విషయం కదిపాడు. "చూడండి రవీ! మా సుధకు మీరంటే చాలా ఇష్టం. ఫారిన్ రిటర్న్‌డ్‌ను తెచ్చి చెయ్యాలని నాన్నగారి అభిప్రాయం. కాని అది





సనేమిరా మిమ్మల్నితప్ప మరెవర్నీ చేసుకోనని పట్టుబడుతోంది...మా అమ్మగారు మీఅభిప్రాయం కనుక్కోమన్నారు. మీ చెల్లెలెలాగూ మా ఇంటికోడలయింది. ఇక మా చెల్లెల్ని మీకిచ్చిచేస్తే 'మన బంధం మరింత గట్టిపడుతుంది. ఏమంటారు?" ప్రకాష్‌మాటల్లో రవ్వంతఅహం, బెదిరింపు వినిపించాయి.

అతడిధోరణికి రవీంద్రకు ఒళ్లుమండినా అక్కడున్నది చెల్లెలి భర్తకాబట్టి ఆమె క్షేమంఆలోచించి బలవంతంగా శాంతాన్ని తెచ్చుకున్నాడు.

రవీంద్ర మౌనాన్ని మరోలా అర్థం చేసుకున్న ప్రకాష్ "ఈ విషయంలో నా మాట మీరు కాదనలేరని నాకు తెలుసు. అయినా అదృష్టం 'నేనయ్యా బాబని' మీ ఇంటి తలుపు తడితే కాదనే తెలివితక్కువవారా మీరు" అంటుంటే రవీంద్ర ఇక భరించలేకపోయాడు.

"క్షమించండి! నా సమాధానం వినకుండానే మీరేవేవో అనేస్తున్నారు. ఇటువంటి వివాహాలు పెద్దల దృష్టిలో నిషిద్ధం. మా నాన్నగారసలు అంగీకరించరు" రవీంద్ర ఖండితంగా చెప్పాడు.

ప్రకాష్ ముఖం కోపంతోజేవురించింది. అతడిలో దాక్కున్న రాక్షసుడు వికృతంగావికటాట్టహాసంచేస్తూ బయటకు తొంగిచూశాడు.

"కట్నం లక్షన్నరిస్తాం. బాగా ఆలోచించుకోండి" అన్నాడు ప్రకాష్.

"మీకివ్వగల అంతస్తుందని నాకు



తెలుసు" రవి శాంతంగా అన్నాడు.

"రెండు లక్షలు కట్నంగాఇచ్చి మీరు నాకు కట్నంగా ఇచ్చిన డబ్బును మీ చెల్లెలికే ఆడబిడ్డ లాంఛనంగా ఇస్తాం" ప్రకాష్ మళ్ళీ అన్నాడు.

ప్రకాష్ ధోరణికి రవీంద్ర మండి పడ్డాడు- "పెళ్ళంటే వేలంపాట కాదు. మీ ఆస్తంతా రాసిచ్చినా ఈ వివాహానికి నేనంగీకరించను" అన్నాడు రవీంద్ర.

ప్రకాష్‌లోకి రాక్షసుడు పూర్తిగా ప్రవేశించాడు. "మీకంటే గొప్పవాడు దొరకడనుకొని మిమ్మల్నిలా దేవిరిస్తున్నా మనుకొన్నారా? మీ అందాన్ని చూసి ఆ పిచ్చిది మనసు పారేసుకుంది. నా చెల్లెలు కోరిన కోర్కెను తీర్చాలన్న ఆశతోనే మిమ్మల్నిలా అడగాల్సొచ్చింది. మీరు కాదన్నాక పరిస్థితులెలా వుంటాయో బాగా ఆలోచించుకోండి" ప్రకాష్ మాటల్లో హెచ్చరికే ఎక్కువగా ప్రస్ఫుటమయింది.

రవీంద్రకది అసలేగిట్టదు. "మిమ్మల్ని దేవిరించమని నేనడిగేనా? డబ్బుందని దాంతో అన్నీ కొనగలమన్న అహాన్ని విడిచిపెట్టండి. రెండు జీవితాలను, మనసులను కలిపిముడివేసి మధురిమను మిగిల్చేదే పెళ్ళి. మనసుకు నచ్చినచోట డబ్బుప్రసక్తి లేదు. మీ చెల్లాయిపట్ల నాకెప్పుడూ అటువంటి అభిప్రాయంలేదు. డబ్బుకంటే కూడా పెళ్ళి విషయంలో మనసుకే ప్రాధాన్యమివ్వడం నా అభీష్టం" రవీంద్ర సౌమ్యంగానే చెప్పాడు.

"ఓహో! కట్నం తీసుకోకుండా పేదింటి పిల్లను చేసుకోవాలనుకుంటున్న ఆదర్శపురుషులన్నమాట. ఆ దర్శం మనిషిని అగాధంలోకి నెడుతుందేగాని బతుకునుద్ధరించదు. డబ్బు తరవాతే ఏదయినా" ప్రకాష్ వ్యంగ్యంగా అన్నాడు.

"అదే స్వార్థవిచిత్రం. డబ్బుజీవితంలో అవసరాలు తీర్చుకునేందుకు పనికొచ్చే సాధనమేగాని అదే జీవితంకాదు" రవీంద్ర దృఢంగా చెప్పాడు.

ప్రకాష్ ఇక మాట్లాడలేదు. మౌనంగా లేచి లోపలికెళ్ళిపోయాడు.

ఈ సంఘటనతో రవీంద్రమనశ్శాంతిని కోల్పోయాడు. సూటిగా తన అభిప్రాయాన్ని వ్యక్తపరచడంవల్లసరోజ కెటువంటి చిక్కులెదురవుతాయోనన్న భయం అతన్నిపట్టి పీడించసాగింది.

హాల్లో వారిద్దరిమధ్య జరిగిన సంభాషణ గదిలోవున్న సరోజకు విన్పిస్తూనే ఉంది. అన్నగారలా నిష్కర్షగా చెప్పగానే భర్త ముఖం ఎలా వివర్ణమైయుంటుందో సరోజ ఊహించింది. అతడలా విసురుగా గదిలోకి రాగానే మరింత బిగుసుకుపోయింది.

"బట్టలన్నీ సర్దేశావా? రేపుదయం ట్రైనుకే మన ప్రయాణం" భార్యకు హుకుం జారీ చేశాడు ప్రకాష్.

"సర్దేశాను" చెప్పింది. ప్రకాష్ మరేం మాట్లాడకుండా ఇంటిపైకప్పుకేసి చూస్తూ ఆలోచనలో మునిగాడు. సరోజ చాలాసేపు కూర్చుని విసుగొచ్చి-"లైటార్పెయ్యమంటారా...నాకు నిద్రొస్తోంది" అంది.

"ఊ..."

లైటార్పి వచ్చి అతడి పక్కనే కాస్త ఎడంగా పడుకుంది. "నువ్వు నిజంగా నా భార్యవేనా? భర్త అవమానం భార్యది కాదూ? అమాత్రం ఏడ్చో, మొత్తుకునో అన్నగారిని పెళ్ళికి ఒప్పించలేవూ? అయినా నీకు సుఖంటే మొదట్నుండీ కిట్టదు" అన్న ప్రకాష్ మాటలు సరోజ హృదయాన్ని గాయపరిచాయి.





"అలా ఎప్పుడూ అపార్థం చేసుకోకండి. సుధంటే నేనెందుకు ఈర్ష్యపడాలి? సుధని నేనెప్పుడూ ఓ సోదరిలా అభిమానించేనేగాని ఆడబిడ్డలా చూడలేదు" అంది.

"ఆ ప్రేమే ఉంటే మీ అన్నను సుధతో పెళ్ళికి ఒప్పించు చూస్తాను'' సవాలు చేశాడు.

"క్షమించండి. ఈ విషయంలో అన్నయ్యను నేను బలవంత పెట్టను" సరోజ అంది.

"నువ్వలా అంటున్నావంటే నీకెంత ప్రేముందో అర్థమవుతూనే ఉంది. మాటల్లో అమృతం చిందిస్తావు. నీ హృదయం నిండా విషమే" ప్రకాష్ మాటలకు సరోజ దెబ్బతిన్నట్టు చూసింది.

"అంటే మా అన్నయ్యకు ఇష్టం లేదని తెలిసి కూడా మీ చెల్లెల్ని చేసుకునేందుకు బలవంతంగా వాడిని ఒప్పించి వాడి జీవితంలో సుఖశాంతులు నా చేతుల్తో తుడిచేసి మీ పట్ల, మీ చెల్లెలి పట్ల ఉన్న గౌరవాన్ని ప్రకటిస్తే అప్పుడు నా మంచిని గుర్తిస్తారన్న మాట. నేను మీ అంత గొప్పదాన్ని కాను మీరన్నట్టు ఏడ్చో, మొత్తుకుంటే వాడు నామాట కాదనక పోవచ్చు. కాని ఇష్టంలేని పెళ్ళి చెయ్యడం వల్ల వాళ్ళెంతవరకూ సుఖపడతారో ఆలోచించండి" అంది సరోజ.

"పెళ్ళిళ్ళన్నీ స్త్రీ, పురుషులిద్దరి అభిప్రాయాలతో కట్టుబడి జరుగుతున్నాయా? ఒకసారి పడ్డ ఆ బంధంనుండి ఎలాగూ తప్పించుకోలేరు కాబట్టి ఇష్టమున్నా, లేక పోయినా చచ్చినట్టు ఒకరిపట్ల మరొకరు ఇష్టాన్ని కల్గించుకుంటారు. నా మటుకు నా విషయంలో కూడా జరిగిందంతే! అమ్మా వాళ్లు పది సంబంధాల వరకూ చూశారు. నిజంగానే ఒక అమ్మాయినైనా నా కళ్ళతో చూడలేదు. అమ్మా, నాన్న నిన్ను చూశాక మీ అన్నయ్య ఇస్తానన్న కట్నం కూడా నచ్చడంతో అప్పుడు నిన్ను చూసి రమ్మని మీ ఇంటికి పంపించారు. నువ్వు నాకు నచ్చే విధంగా ఉన్నావు కాబట్టి నీతో పెళ్ళికంగీకరించాను. నిన్ను నేను ప్రేమగా చూసుకోడం లేదా? నీతో కాపురం చేయడం లేదా?'' అన్నాడు ప్రకాష్.

"దానికేముంది! ఎవరి వ్యక్తిత్వం వారిది. అన్నయ్య దృష్టిలో పెళ్ళనేది ఓ అపురూప వరం, ఊహాతీతమైన అనుభూతి"

''అంటే మీ అన్నయ్య గొప్ప ఆదర్శ పురుషుడు, నేను కాదు. అదేగా నీ అభిప్రాయం?" ప్రకాష్ కళ్లు కోపంతో ఎరుపెక్కాయి.

''ప్లీజ్! నా మాటలకు పెడర్థాలు తీయకండి" దీనంగా అంది సరోజ.

''దాదాపు ఈ సంబంధం ఖాయమైనట్టే. మీరిక ముహూర్తాలు పెట్టించెయ్యండని' అమ్మకు ధీమాగా చెప్పివచ్చేను. ఇప్పుడు నా ముఖం వాళ్ళకెలా చూపించను" ప్రకాష్ బాధేమిటో సరోజకర్థమైంది.

"ఇందులో మీరంతగా ఖేదపడుతూ చిన్నబుచ్చుకోవాల్సిన అవసరమేమీలేదు. పెళ్లిళ్లు దైవనిర్ణయాలు. మనం అనుకున్నా వారికి రాసిపెట్టిలేనప్పుడు ఏం చెయ్యగలం"' అనునయించింది సరోజ.

"ఇటువంటి సానుభూతి వాక్యాలు చక్కగా వల్లిస్తావు. నువ్వు కాస్త గట్టిగా నా పక్షాన నిలబడితే దైవనిర్ణయమన్న మాట గాలిలో కలిసి మన చేతిలో పనన్న వాదం మిగిలివుండేది"

"మీరెంత అమాయకులు! జీవితంపట్ల ఖచ్చితమైన అభిప్రాయాలేర్పరుచుకోడానికి, క్రమపద్ధతిలో బతుకు నడుపుకోడానికి డిగ్రీలే అవసరమనుకుంటున్నారా? చిన్నప్పట్నుండి పెరిగిన వాతావరణం, చుట్టూ వున్న పరిస్థితులు ఏవ్యక్తినయినా ఉన్నతంగానో, సంకుచితంగానో తీర్చిదిద్దడానికి తోడ్పడుతాయి. ఆపై చదువు వివేకాన్ని, విజ్ఞానాన్ని పెంపొందిస్తుంది'' అంది సరోజ.

"నోరు విప్పావంటే కవిత్వం విన్పిస్తావు. భర్త మాటకు విలువివ్వాలనే విషయం మాత్రం తెలియదు" ప్రకాష్ విసుగ్గా అన్నాడు.

లాభంలేదని సరోజ మౌనంగా ఊరుకుంది.

మర్నాడుదయమే ప్రయాణానికి సిద్ధమవుతుంటే రవీంద్ర నొచ్చుకుని-

"మధ్యాహ్నం భోంచేసి వెళ్ళండి" ప్రకాష్‌తో అన్నాడు.

"నాకక్కడ చక్కబెట్టుకోవాల్సిన పనులు చాలావున్నాయి. చూడండీ...నా చెల్లికోసం ఏం చెయ్యడానికైనా నేను సిద్ధంగా ఉన్నాను. మీ చెల్లి క్షేమాన్ని, సుఖాన్ని దృష్టిలో పెట్టుకుని ఈ విషయం మరోసారి ఆలోచించి ఓ నిర్ణయానికి రండి. ఈ నెలాఖరువరకూ మీనుండి లెటర్‌కోసం ఎదురుచూస్తాను" హెచ్చరించాడు ప్రకాష్.

రవీంద్ర ఉబికివస్తున్న ఆవేశాన్ని నిగ్రహించుకుని సరోజ ఉన్న గదిలోకి వెళ్లాడు. రవీంద్రను చూడగానే సరోజ-

"అన్నయ్యా! విద్య విషయంలో నువ్వొక అభిప్రాయానికొస్తే ఆమె అంగీకారం తెలుసుకుని వెంటనే పెళ్ళిచేసుకో. నీ వయసిప్పుడు ఇరవైఎనిమిదనుకుంటాను. జీవితంలో కష్టసుఖాలు పంచుకునే తోడు ఎంతయినా అవసరం. నీ పెళ్ళికి నేను రాలేకపోవచ్చు. నువ్వు బాధపడకు. ఎక్కడున్నా నీ క్షేమాన్ని కోరతాను" ఆప్యాయంగా అంది సరోజ.

సరోజ ప్రేమకు రవీంద్ర కళ్లు చెమర్చాయి. "రోజా! నువ్వు నాకు చెల్లెలివేఅయినా లాలించడంలో అమ్మను మరిపించావు" ఆమె చేతులు పట్టుకుని అన్నాడు.

అన్నగారి కళ్ళలోకి ప్రేమగా చూసింది సరోజ.

"రోజా! విద్య నీకు బాగా నచ్చింది కదూ!" అనుమానం తీరక అన్నాడు.

"మనలానే ఆమెకూడా తల్లిప్రేమెటువంటిదో తెలియకుండా పెరిగింది. మనకు నాన్నగారుండబట్టి ఆయన లాలనలో కష్టాలు, కన్నీళ్లు తెలియలేదు. విద్య అలాకాదు... అభిమానం, ప్రేమ ఎలా ఉంటాయో తెలియని వాతావరణంలో పాషాణంలాంటి మనుషులమధ్య ఎండ, నీరు లేని లతలా పెరిగింది. నీ భావాలతో అల్లుకుపోయి నీ జీవితంలో చక్కగా కల్సిపోతుంది. నువ్వయినాసుఖపడతావు" అంది సరోజ.

ఆఖరిమాట రవీంద్ర హృదయంలో సూటిగా నాటుకుంది. "రోజా! ప్రస్తుతం నా భవిష్యత్తు గురించి ఆలోచించేకంటే నీ గురించి ఆలోచించటం ముఖ్యమని తోస్తోంది. నీ కన్నీటిమధ్య నేనో బంగారు సౌధాన్ని నిర్మించుకోడం మంచిపనేనా? నీ ఆనందంకోసం నా స్వసుఖాన్ని త్యజించడం మంచిదనిపిస్తోంది"

రవీంద్ర మాటలకు సరోజ విచలిత అయింది. "ఎప్పుడూ అలాంటి పని




చెయ్యకు అన్నయ్యా! పొరపాటునకూడా సుధతో పెళ్ళికి నీ అంగీకారాన్ని తెలుపొద్దు. ఆ ఇంట్లో మనుషులకు ఎదుటి మనిషి మనసుతో ఆడుకోడంతప్ప ప్రేమించడం, అభిమానించడం ఏమిటో తెలియదు. మనిషికి డబ్బుతప్ప మరేదీ అవసరంలేదనే ఆలోచన నరనరాన నిండి ఉన్న మనుషులు. పురుషుడికటువంటి మనస్తత్వంవున్నా స్త్రీ సహనంతో అతడి మూర్ఖత్వాన్ని భరిస్తుంది. అటువంటి మనస్తత్వం స్త్రీకి ఉంటే ఆమెను చేసుకున్నవాడు చేతులారా నరకాన్ని సృష్టించుకున్నవాడవుతాడు. వద్దొద్దు... ఆ నరకాన్ని నువ్వనుభవించడం కలలో కూడా భరించలేను" అంది.

సరోజ భయం అర్థమైంది రవీంద్రకు. "రోజా! నీకు చేస్తున్నది మంచనుకుని చెడు చేసినట్టున్నాను. అంతస్తు తరిచి చూశానేగాని అంతరంగం అవగతం చేసుకోలేకపోయాను" పశ్చాత్తాపంనిండిన కంఠంతో అన్నాడు.

"అది నా దురదృష్టం. ఏమైనా నీ చెల్లెలు పిరికిదికాదని మాత్రం మర్చిపోకు. నువ్వు ప్రసాదించిన మనోబలం, ఆత్మీయతలు నా హృదయంలో చెక్కుచెదరకుండా ఉన్నంతవరకూ నేను సుఖంగానే ఉంటాను. నా గురించి ఆలోచించి మనసు పాడుచేసుకోకు" అంది.

ప్రకాష్‌కు, సరోజకని కొన్న బట్టలు ఇద్దరికీ ఇచ్చాడు. ప్రకాష్ వద్దంటున్నా బలవంతంగా తనేసూట్‌కేసులో సర్దాడు.

వారిద్దరూవెళ్ళాక అతడి హృదయం ఎంతో బరువెక్కింది. ఆఫీసుకెళ్లాలని పించక పడకమీద నిస్సత్తువగా వాలిపోయాడు.

* * *

'రవీంద్ర ఎందుకు రాలేదోనని' క్షణ క్షణం అతడి గురించే ఆలోచించి బుర్ర పాడుచేసుకుంటున్న విద్యకు సాయంత్రం నాలుగ్గంటలకుఆఫీసుస్టాఫ్‌చెప్పుకుంటుంటే తెలిసింది-'రవీంద్రకు జ్వరం వచ్చిందని'. ఆ విషయం వినగానే విద్య మనసు అతణ్ని చూడాలని ఆరాటపడింది. 'అతడింటికి వెళ్ళడం మంచిదా కాదా' అని కాసేపు 
తర్జనభర్జన... [illegible]ట్టుమిట్టాడింది. చివరకు 'తలనొప్పిగా ఉందని'' ఓ అరగంట ముందుగానే ఇన్‌ఛార్జ్‌ని పర్మిషనడిగి బయటికొచ్చింది.

ఆమధ్య ఎప్పుడో సరిత చెప్పినగుర్తులు మననం చేసుకుంటూ రవీంద్ర ఇల్లు వెదుక్కుంటూ వెళ్లింది. ఇల్లు గుర్తుపట్టడంలో పెద్దగా శ్రమపడలేదు. కాలింగ్ బజర్ నొక్కగానే ఓ వ్యక్తి బయటికొచ్చి "ఎవరుకావాలమ్మా?" అనడిగాడువిద్యను. చూడగానే అతడా ఇంట్లో పనిచేసే నౌకరని అర్థమైంది.

"అయ్యగారింట్లోనే ఉన్నారా?" అడిగింది.

"ఉన్నారమ్మా! జ్వరంగా ఉంది. లోపల పడుకున్నారు" చెప్పాడు.

''నేను అయ్యగారినోసారి కలుసుకోవాలి"

''మీ పేరేటో చెప్పండి. అయ్యగారితో చెప్పివస్తాను'' అన్నాడు.

విద్య తన పేరు చెప్పింది. పేరువిని లోపలికెళ్లిమరునిముషంలో బయటకొచ్చి- ''మిమ్మల్ని లోపలకు రమ్మన్నారు" చెప్పాడు.

విద్య అతడివెంట లోపలికెళ్లింది.

"అదుగో..ఆ గదిలోనే పడుకున్నారు. వెళ్ళండి" చూపించి అతడు లోపలికెళ్లాడు. విద్య సంకోచంతోనే ఆ గదిలో కెళ్ళింది.

"మర్యాదగా ఇంటికి రమ్మని ఆహ్వానించినప్పుడు రానేలేదు. ఏమిటి ఇంత హఠాత్తుగా దయకల్గింది" సీరసంగా నవ్వుతూ అడిగాడు రవీంద్ర.

విద్య అతణ్ని ఆప్యాయంగా చూస్తూ- "మీకు జ్వరమని తెలిసింది. తెలిసేక రాకుండా ఉండలేకపోయాను. ఇప్పుడెలా వుంది?" కొంచెం దగ్గరగా వెళ్ళి అడిగింది.

"జ్వరం ఉందో లేదో నాకెలా తెలుస్తుంది!" రవీంద్ర అన్నాడు. అతడి అంతరంగం అవగతమైనట్టు దగ్గరగా వెళ్ళి నుదుటిమీద చెయ్యేసి చూసింది. చల్లగానే వుంది. "ఇప్పుడు జ్వరం లేదు" అంది.

"జ్వరం లేదుగాని తలనొప్పి మాత్రం ఎక్కువగా ఉంది. ఈ బాధ భరించలేకపోతున్నాను" కణతలు నొక్కుకుంటూ బాధగా అన్నాడు.

"సరోజగారున్నారా?" అడిగిందివిద్య.

"లేదు. మొన్ననే వెళ్ళిపోయారు"

"వెళ్లిపోయారా! వెళ్ళేముందు కనిపిస్తానని చెప్పారే?" అంది.

"సావకాశంలేకపోయింది విద్యా! సరోజ హజ్‌బెండ్ ఓ తిక్కవాడు. వెళ్ళేముందు రాలేకపోయినందుకు మిమ్మల్నందర్నీ మన్నించమని చెప్పింది. ఏదీ...నేనొచ్చి చెప్దామంటే ఈ జ్వరం వచ్చిపడింది'' చెప్పాడు రవీంద్ర.

"అంటే, మీ అనారోగ్యానికి మీ బావ మరిది తిక్కే కారణమేమో?" విద్య అంది.

ప్రశంసగా చూశాడు. "చక్కగా ఊహించావు విద్యా!" అంటూ ప్రకాష్ వచ్చినప్పట్నుండి జరిగిన సంఘటనలు అంటే సుధను పెళ్ళి చేసుకోమన్న విషయం వివరంగా చెప్పాడు. అన్నీ వింటూ మవునంగా ఉన్న విద్యవైపు చూసి - "విద్యా! ఇవన్నీ మనసు విప్పి చెప్పినందుకు నువ్వెలా భావించినా ఫరవాలేదు. నిన్ను చూస్తే నాకు స్నేహమయిలా కన్పిస్తావు. నీముందు నాకేదీ దాచుకోవాలనిపించదు. అందుకే మనసు విప్పి మాట్లాడేస్తుంటాను" చెప్పాడు.

అతడి మాటలకు ఆమె మనసు పొంగిపోయింది. "థాంక్యూ సర్" అంది.

''అలా మన్నించేలా ఉంటే వెళ్ళిపోవచ్చు..ఇదేం ఆఫీసు కాదు" చిరుకోపంగా చూశాడు.

"సారీ రవీ!'" అంది.

"గుడ్"

"రవీ! మీరీ రెండు రోజుల్నుండి కన్పించక ఏం జరిగిందోనని కంగారు పడ్డాను. కారణం తెలియగానే ఇలా పరుగెత్తుకొచ్చేను. నిజంగా మిమ్మల్ని చూసే వరకూ నా మనసునాపుకోలేక పోయేను" విద్య తన మనసు బయటపెట్టింది.

"స్టాఫ్‌తో పాటు నేను రానందుకు సెలబ్రేట్ చేసుకోలేకపోయావా?" తమాషాగా అన్నాడు రవీంద్ర.

"అబ్బ! అవన్నీ మీకెలా తెలుస్తాయి బాబూ! కొంపదీసి స్టాఫ్‌లో మీకెవరైనా గూఢచారులున్నారా ఏమిటి?" బుంగ మూతిపెట్టి అంది.

''నువ్వు అమాయకురాలివి. ఆ మాత్రం ఊహించలేనా?" నవ్వుతూ అన్నాడు.

ఇంతలో రాఘవులు కాఫీ కలిపి తెచ్చాడు.ఓకప్పుతెచ్చి విద్యకందిస్తుంటే- ''మీరు తీసుకోరా?" రవినడిగింది.

''కాఫీ సయించడంలేదు. నేను తాగను" అయిష్టంగా ముఖం పెట్టేడు.

"పోనీ బత్తాయిరసం తీసి ఇస్తాను... తాగండి"అంటూ కాఫీ తాగేక తనుతెచ్చిన బత్తాయిల్తో రసంతీసి అతడికి ఇచ్చింది.





"ఇక నేనింటికి వెడతాను" విద్య వెళ్ళబోతుంటే రవీంద్రలో ఉత్సాహం గుప్పున ఊదేసినట్టయింది.

"అప్పుడేనా!"నీరసంగా పలికిందతడి కంఠం.

"నేనొచ్చి గంటయింది''

"అంతేగా! రెండురోజుల తపస్సు ఫలితంగా దేవి ప్రత్యక్షం అయితే, అది గంట కాలమేనా?"

విద్య హృదయం ఆనందసాగర మయింది.

"ప్లీజ్! నా భయమేమిటో మీకు తెలుసుగా'' అంది అభ్యర్థనగా.

"తెలుసులే. పోనీ మళ్ళీ ఎప్పుడు కన్పిస్తావో చెప్పి వెళ్లు"

"ఎల్లుండి ఆఫీసులో"

"ఉహు! ఏకంగా రెండురోజులా? కాదు...రేపొస్తానంటేనే ఇప్పుడు వెళ్లు" పట్టుబట్టాడు.

"అలాగే. వేరే ఆలోచనలేవీ పెట్టు కోకుండాప్రశాంతంగా నిద్రపోండి"అంది.

"రేపు సాయంత్రం నువ్వొచ్చేవరకూ ప్రశాంతంగానే ఉంటాను"

నవ్వుకుంటూ బయటకు నడిచి గుమ్మం దగ్గర ఆగి వెనుతిరిగి చూసింది. రవీంద్ర కూడా ఆమె వైపే చూస్తున్నాడు. విద్య చిర్నవ్వు నవ్వి చెయ్యూపి వెళ్లిపోయింది.

విద్య హృదయం విహంగంలా ఎగిరి పోతోంది. 'తన ప్రమేయం లేకుండానే రవీంద్రకు చేరువగా వెళ్లిపోతోంది. తనకే కాదు అతడికీ తనను చూడగానే ముఖంలో దాగని సంతోషం, కళ్లల్లో మెరిసే మెరుపులు స్పష్టంగా తను చూడగల్గింది' అనుకుంటూ ఇంటికి చేరుకుంది.

మాటిచ్చిందేగాని ఆమర్నాడు రవీంద్ర దగ్గరకు వెళ్లేధైర్యంలేకపోయింది.అతడు తనకోసం ఎదురుచూస్తాడని తెలుసు. తనకూ అతడికోసం వెళ్లాలనే ఉంది. కాని అలా వెళ్ళడం తనకే అంతమంచిది కాదు. అతడి సాన్నిహిత్యంలో తన పరిధిని దాటి అతడి హృదయంలోకి చొచ్చుకు పోతుంది. స్త్రీగా అచారవ తనకు తగనిది. అందుకే వెరపుతో వెళ్ళలేకపోయింది విద్య.

రవీంద్ర మూడో రోజున ఆఫీసు కొచ్చేశాడు. గెడ్డం చేసుకోడంవల్ల మనిషి తేటగా కన్పించినా ముఖంలో నీరసం మాత్రం పూర్తిగా తగ్గలేదు. అతడొచ్చిన గంటకు ఫైల్సు మీద అతడి సంతకాలు కావల్సొచ్చి తనే అతడి రూముకు వెళ్లింది. ఆమెను చూసినా పట్టించుకోనట్టే ఆమె తన ముందు పెట్టిన కాగితాలమీద చకచక సంతకాలు పెట్టేస్తుంటే విద్య వుండబట్టలేక ''సర్! మీ ఒంట్లో ఎలా ఉంది?" అనడిగింది.

"బాగానే ఉంది" తలెత్తకుండానే సమాధానం చెప్పి తన పని చూసుకో సాగాడు. అతడికి తన మీద బాగా కోప మొచ్చిందని అర్థమైంది. "సారీసర్! నిన్న నేను రానందుకు మీకు బాగా కోపమొచ్చిం దనుకుంటాను" అంది.

"కోపమెందుకు! మీకిష్టముంటే వస్తారు. లేకుంటే లేదు. అది పూర్తిగా మీ పర్సనల్ మేటర్" రవీంద్ర మాటలు తుంచేస్తుంటే విద్య హృదయం ముక్క లయింది. మౌనంగా కాగితాలు తీసుకుని వెళ్లిపోయింది.

సాయంత్రమయ్యేవరకూ యాంత్రి కంగా పనిచేసుకుపోయిందే తప్ప విద్య మనసు మనసులోలేదు. లంచ్అవర్లో తినాలని తెచ్చుకున్న టిఫెన్‌బాక్సు తెరవనే లేదు. నళిని బలవంతంమీద టీ తాగి ఊరు

కుంది. తను చేసిన తప్పుకంటే అతను వేసిన శిక్ష పెద్దగాతోచింది. తన భయాలేమిటో, తనెందుకు రాలేకపోయిందో అర్థం చేసుకోవచ్చుగా! ఇక జన్మలో తన ముఖం చూడకూడదని ఒట్టుపెట్టుకున్నట్టు ఆ సీరియస్‌నెస్ ఎందుకో? విద్యకు అతడి ముఖభావాన్ని, వైముఖ్యాన్ని తల్చుకుంటే దుఃఖం ముంచుకొచ్చింది. ఇక పని చెయ్యాలనిపించలేదు. లేచి ఆఫీసురూమ్ కెళ్లి రవీంద్రను పర్మిషనడిగింది. అప్పుడు రవీంద్ర తలెత్తి ఆమె వైపు చూశాడు. ముఖం వాడి, వన్నె తరిగి ఉంది. ఉదయం నుండి సాయంత్రం వరకూ మండు టెండలో నడిచిన మనిషిలా డీలా పడ్డట్టుంది. విద్యనాస్థితిలో చూడగానే మనసు అర్ద్రమయింది.

"ఒంట్లో బావోలేదా?" మృదువుగా అడిగాడు.

ఆ పాటి అనునయానికే కళ్లు నీటితో నిండిపోయాయి. "బాగానే ఉంది. మనసే బావోలేదు" అంది.

"సరేవెళ్లు!" అన్నాడు. విద్య బయటి కొచ్చేసింది.

ఇంటి కెళ్ళేసరికి సరితావాళ్లింటికి తాళం పెట్టివుంది. 'ఎక్కడికెళ్లారో' అనుకుంటూనే తాళం తీసి లోపలికెళ్లి పడకమీద వాలిపోయింది. 'ఏమిటిలా తను బేలయిపోతోంది' పదే పదే అనుకుంది. టీ పెట్టుకుని తాగాలనిపించలేదు. అలాగే దిండులో తలదూర్చి పడుకుంది.

ఎంతసేపు గడిచిందో ఆమెకే తెలియదు. తలమీదెవరో చెయ్యేసి నిమురుతుంటే చటుక్కున తలెత్తి చూసింది. ఎదురుగా మంచాన్నానుకుని రవీంద్ర నిలబడి ఉన్నాడు. విద్య సంభ్రమంతో లేచి నిలబడింది.

"ఏమిటిలా తలుపులు తెరిచి మరీ పడుకొన్నావు? దొంగలెవరైనా వచ్చి మీ ఇల్లు దోచుకుంటేనో?" రవీంద్ర అంటుంటే చురుగ్గా అతడి వైపు చూసి "దోచుకోడానికైనా నాదంటూ నా దగ్గరేమీ లేదులెండి! అన్నీ అన్యాక్రాంతం చేసి నా అవివేకానికి బాధపడుతున్నాను" మర్మగర్భితంగా చెప్పింది విద్య.

"అంటే నువ్వూ నేనున్న పరిస్థితులోనే ఉన్నావన్నమాట!" రవి ఆమెనర్థం చేసుకున్నవాడిలా తిప్పిచెప్పాడు.

"మీరిలా కుర్చీలో కూర్చోండి. టీ పెట్టి తీసుకొస్తాను" విద్య లేచింది.

"విద్యా! నిన్నీరోజు చాలా బాధ పెట్టేనుకదూ?" ఆమె వెనుకే వెడుతూ రవీంద్ర అన్నాడు.

"అలా అనుకోలేదుగాని దెబ్బకు దెబ్బ తీర్చుకున్నారనుకున్నాను" అంది.

"నిజమే! నీకోసం నిన్నెంతగా ఎదురు చూశానో తెలుసా! నన్నెంతగా నిరాశ పరిచావో తెలియచెప్పడానికే అలా ప్రవర్తించాను" చెప్పాడు.

"ఒక్కమాట. మీకెప్పుడయినా నా మీద కోపంవస్తే నన్ను తిట్టండిగాని ఇటువంటి శిక్షలు మాత్రం వెయ్యకండి" విద్య అంది.

"విద్యా! నాకాకలిగా ఉంది. టిఫిన్ ఏదయినా చెయ్యి. అసలీరోజు ఆంటీతో ఏదైనా టిఫిన్ చేయించుకు తినాలనివచ్చేను. ఇంటికి తాళం పెట్టి ఉంది. అందరూ ఎక్కడికెళ్ళారు?" అడిగాడు.

"నాకూ తెలియదు. ఎక్కడికయినా వెడితే ముందుగా నాతో చెప్తారు. బహుశా అనుకోకుండా ప్రోగ్రాం తగిలుంటుంది. టిఫినడిగారుగా...పకోడీలు చెయ్యమంటారా?" అడిగింది విద్య.







"ఏదో ఒకటి. త్వరగా మాత్రం అయిపోవాలి" ఈజీఛైర్లో వాలుతూ అన్నాడు.

"అలాగే" విద్య లోపలికెళ్ళి పావు గంటలోనే వేడి వేడి పకోడీలు ప్లేటులో తీసుకొచ్చి అతడిముందుంచింది.

"థాంక్స్ విద్యా!" పకోడీల ప్లేటు అందుకుని తినసాగాడు రవీంద్ర.

"వాటినలా చీటికీ మాటికీ నాదగ్గర వేస్ట్‌చెయ్యకండి. మీకోసం ఏంచేసినా నాకు శ్రమ అన్పించదు" విద్య అంది.

"అలా ఎందుకుంటుందో?" కంటి చివర కొంటెతనం తళతళలాడుతుండగా అన్నాడు.

"అవును. ఎందుకుంటుంది" ఒక్క క్షణం అయోమయంలోపడి అతడివేపు నిస్సహాయంగా చూసింది.

"విద్యా! చెప్పడం మరిచాను .... రేపు సెలవేగా. నువ్వు సరితావాళ్ళతో ఏం చెప్పుకుంటావో, ఎలా చెప్పుకుంటావో తెలియదు. నువ్వుమాత్రం రేపు ఉదయం ఎనిమిదిగంటలనుండి సాయంత్రం ఆరింటి వరకూ నాతోసరదాగా గడపబోతున్నావు. గుర్తుంటుందా!" రవీంద్ర అన్నాడు.

"అమ్మో! రోజంతానా...ఎలా వీలవుతుంది?" అంది గాభరాగా.

"ఏమో...ఎలా వీలుచేసుకుంటావో నాకు తెలియదు. నువ్వు రాకపోతేమాత్రం శిక్షేమిటో తెలుసా?" రవీంద్ర అడిగాడు.

"చెప్పండి"

"ఇక ఎప్పుడూ నీముఖం చూడను. రేపట్నుండి లాంగ్‌లీవ్ పెట్టి మా ఊరెళ్ళిపోయి ట్రాన్స్‌ఫర్‌కోసం ప్రయత్నిస్తాను" అన్నాడు.

విద్య తుళ్లిపడింది. "చాలా పెద్ద శిక్ష వేస్తున్నారు" అంది జాలిగా.

"మనసుంటే మార్గముంటుంది. ఏదో ఒక సాకుచెప్పివస్తే ఆ శిక్షవుండదుగా!"

"సరే! ప్రయత్నిస్తాను"

"ప్రయత్నిస్తానుకాదు వస్తాను అను"

"అలాగే వస్తాను"

రవీంద్ర వెళ్లిపోయాడు. అతడు వెళ్ళేక తలుపులు బిగించి వంట ప్రయత్నంలో పడింది విద్య.



5

రవీంద్ర ఇంటి వరండా మెట్లెక్కుతూ టైము చూసింది విద్య.సరిగా ఎనిమిదీ పది నిమిషాలయింది. విద్యనుచూసి బయటి కొస్తూ-"హమ్మయ్య! వచ్చేవా. అన్న టైముకు పదినిముషాలు దాటితే నాలో, ఇప్పుడిప్పుడే కోపంపుట్టి పెరుగుతోంది" రవీంద్ర అన్నాడు.

"పాపం! ఇప్పటికెంత పెరిగిందేమిటి?"

"పది డిగ్రీలు"

"ఈ పదినిమిషాల లేటుక్కూడా శిక్షిస్తారా? శిక్షిస్తానంటే నేను రెడీ" అంది విద్య.

"లేదులే! లోపలికి పద. టిఫిన్‌తిని బయలేరదాం"

"నేను టిఫిన్ తినే వచ్చాను" మొహమాటంగా అంది.

"నాకోసమైనా రా! నువ్వొచ్చేక ఇద్దరం కలిసి తిందామని నేనింతవరకు తినలేదు" రవీంద్ర అంటుంటే కాదనలేక డైనింగ్‌రూమువైపు వెళ్ళింది.

టేబుల్ ముందు ఎదురెదురుగా కూర్చున్న ఇద్దరికీ రాఘవులు టిఫిన్ పెట్టేడు. కాఫీతాగేక, "ఇక ఇప్పుడు చెప్పండి ప్రోగ్రాం ఎక్కడికో!" కుతూహలంగా అడిగింది విద్య.

"ఇప్పుడు చెప్పను. తినబోతూ రుచు లడగడం దేనికి? నువ్వే చూస్తావుగా?" అన్నాడు రవీంద్ర.

"ఇప్పుడుకూడా సస్పెన్సేనా?" కాఫీ కప్పు కిందపెట్టి లేచింది విద్య. ఈ రోజు విద్య రవీంద్ర బర్త్‌డేకి ప్రజెంట్ చేసిన చీర కట్టుకొచ్చింది.

"ఈ చీర నీకు చాలా బావుంది" అన్నాడు రవీంద్ర.

"చీర బావుందా..నేను బావున్నానా?" చిలిపిగా అంది విద్య.

"నీకంటే చీరే బావుంది" ఆమెను ఉడికించడానికన్నాడు. విద్య నవ్వింది.

"పద వెడదాం!" అంటూ అతడు స్కూటర్ దగ్గరకు వెడుతుంటే, "మీ స్కూటర్‌మీద నేనురాను" విద్య చెప్పింది.

"ఏం... అంతపాపం నా స్కూటరేం చేసింది" అడిగాడు.

"ఎవరైనా మీ వెనుక నన్నుచూస్తే ఇంకేమైనా ఉందా?" భయంతో విద్యకళ్లు విశాలమయ్యాయి.

"ఎవరూ చూడకుంటే అభ్యంతరం లేదా?" రవి కొంటెగా అడిగాడు.

"అబ్బ! మీకసలు సీరియస్‌గా ఉండడమే తెలియనట్టుంది. నా భయం మీకు నవ్వులాటగా ఉందికదూ" మూతి ముడిచి అలక అభినయించింది.




"ప్లీజ్ విద్యా! అటువంటి భంగిమలతో నన్ను చిత్తుచెయ్యక వచ్చికూర్చో! ఎవరికంటా పడకుండా తీసుకెడతాగా!" స్కూటర్ స్టార్టుచేశాడు.

స్కూటర్ చాలా స్పీడుగా పోనిస్తున్నాడు. టౌన్ లిమిట్స్ దాటుతుండగా, "విద్యా! నీకు భయంగావుందా? అలా ముడుచుకుపోతున్నట్టు కూర్చున్నావు" రవీంద్ర స్కూటర్ పోనిస్తూనే అన్నాడు.

"లేదు" పైకి నిబ్బరంగా అంది విద్య.

"భయంగా ఉంటే స్టైయిలిష్‌గా నా భుజాన్ని పట్టుకుని కూర్చో. నేను నీలా ఎవరికీ భయపడనులే" రవీంద్ర అన్నాడు.

ఆ మాటకు విద్య ముఖంలో గులాబీలు విరిశాయి- 'ఇతనెంత చిలిపివాడు!' అనుకుంది.

రోడ్‌కు ఓ పక్కగా దిగువకు స్కూటర్‌ను పోనిచ్చాడు. ఎదురుగా ఉన్న గేట్లోనుంచి స్కూటర్ లోపలకు దూసుకుపోయింది. స్కూటర్ గేటు దగ్గర్నుంచి ఫర్లాంగు దూరంలోనున్న చిన్న బంగళాముందు ఆపాడు స్కూటర్. దిగి చుట్టూవున్న అందమైన పూలతోటను సంభ్రమంగా పరికించి చూస్తున్న విద్యను- "విద్యాదేవిగారూ...పూలతోటను తరువాత అవలోకించొచ్చు. ముందు బంగళాలోకి పదండి" అంటూ స్టాండ్‌వేసి కీస్ జేబులోవేసుకుని చిన్నగా విజిల్ ఊదుతూ బంగళామెట్లెక్కి వెళ్లాడు. విద్య వరండాలోనే ఆగింది. రవీంద్ర తాళంతీసి తలుపులు తెరిచి లోపలకు అడుగుపెట్టి మళ్ళీ విద్యవైపు తిరిగి కొంచెంగా వంగి రెండుచేతులూ ముందుకుచాచి- "లోపలికి దయచెయ్యండి" వినయంగా ఆహ్వానించాడు.

అతడి చిలిపితనానికి నవ్వుకుంటూ విద్య లోపలికొచ్చింది. అది సింగిల్ పోర్షనే అయినా ఉన్న విశాలమైన గదిలో ఆధునికపు హంగులన్నీ ఉన్నాయి. ఆ గదిలో ఓ పక్క డబుల్‌కాట్. మరో పక్క డ్రెస్సింగ్‌టేబుల్, మరోపక్క సోఫా సెట్టు, ఫ్రిజ్ అన్నీ ఉన్నాయి. కిటికీలకు అందమైన తెరలు వేలాడుతున్నాయి.

ఊరు చివర పూలతోట, ఆ తోటలో అందమైన ఆ చిన్న ఇల్లు....తామిద్దరు ఏకాంతంగా ఉన్నారని తల్చుకోగానే విద్య గుండెలు దడదడలాడాయి. తను చాలా పొరపాటుచేసింది. అతడు రమ్మనగానే 'ఎక్కడికి, ఎందుకు' అని అడగనైనా అడగక ఇంతదూరం రావడం అనాలోచిత చర్యేమో! తనకేదైనా జరిగితే? 'ఛీ! రవి అటువంటివ్యక్తి కాదు' సర్ది చెప్పుకోబోతుంటే మనసు వ్యతిరేకించింది.

'అటువంటి వ్యక్తికాదని అతడి ముఖం మీద రాసిపెట్టిలేదు. ముందు మంచిని చూపి నీ బలహీనతను ఆసరాగా తీసుకుని మాటల్తో బంధాలువేసి తనకనుకూలంగా మార్చుకోడానికే నిన్నింత దూరం తీసుకొచ్చాడేమో' మనసు శంకించింది. అప్పుడు విద్యకు భయం కల్గింది. 'అటువంటిదేదైనా జరిగితే తనేం చెయ్యాలి? ఎలా ప్రతిఘటించాలి?' ఒక్క క్షణం ఆలోచించింది. మళ్ళీ అంతలోనే- 'ఇదీ ఒకందుకు మంచిదే. రవీంద్ర ఏ ఉద్దేశంలో ఇక్కడకు తీసుకొచ్చాడో, అతడిలో ఎటువంటి ఆలోచనలున్నాయో తెలుసుకోడానికి ఇది చక్కని అవకాశం' ఇలా పలురకాలుగా ఆలోచిస్తూ కిటికీ దగ్గరే నిలబడి బయటకు చూస్తోంది విద్య.

"విద్యా! ఇక్కడేం చేస్తున్నావు?" రవీంద్ర సమీపానికొచ్చి పలకరించగానే

విద్య ఉలికిపడుతూ-"ఆ! ఏమిటన్నారు అహ ...ఏంలేదు" అంటూ కంగారుపడుతోంటే రవీంద్ర ఆమె వంక సూటిగా చూసి ఆమెలో ఆలోచనలు అంచనా కట్టాడు. "నేను నమ్మను. నీ బుర్రలో ఏముందో చెప్పమంటావా?" రవీంద్ర అన్నాడు.

విద్య మాట్లాడలేదు.

"ఈ పూలతోట, ఈ చిన్న బంగళా, ఒంటరితనం అన్నీ చూడగానే సినిమాలో విలన్‌లు నీ బుర్రలో చకచక కదిలి వెళ్లాయి. 'ఏమిటిలా ఇతడి వెంట వచ్చేశాను' అని జరిగిందానికి మధనపడుతూ, 'ఏదైనా జరిగితే ఏం చెయ్యాలి' అని ఫ్యూచరు గురించి ఆలోచిస్తున్నావు కదూ?" అన్నాడు.

విద్య తలదించుకుండే తప్ప నోరు విప్పలేదు.

"విద్యా! అటువంటి చెడ్డ ఊహలకు నీలో తావివ్వకు. నువ్వలా ఊహా మాత్రంగానైనా నా వ్యక్తిత్వాన్ని శంకించడం నేను భరించలేను. నాలో అటువంటి నీచభావాలే వుండివుంటే ఇదివరలో నీతో రెండు మూడుసార్లు ఏకాంతం లభించినపుడే ఆ సమయాన్ని నాకనుకూలంగా మార్చుకోడానికి ప్రయత్నించివుండేవాడినేమో! నువ్వు నలుగురూ ఉన్నప్పుడు ఎంత ఫ్రీగా ఉంటావో ఇక్కడా అలా ఉంటానంటేనే వుందాం. లేదంటే నిన్నిప్పుడే మీ ఇంటికి తీసుకెళ్లి దిగబెడతాను పద" అన్నాడు.

అతడి ముఖంలో వ్యధను చూసి విద్య హృదయం కలుక్కుమంది.

"అదేంలేదు. మీరు వెడదామనేవరకూ వుందాం" విద్య అంది.





"ఆపాటి విశ్వాసం వుంచినందుకు థాంక్స్. పద...అలా తోటలోకి వెడదాం" రవీంద్ర ఉత్సాహంగా కదిలాడు.

"ఈ తోట ఎవరిది?" విద్య అతడి సరసనే నడుస్తూ అడిగింది.

"నా ఫ్రెండ్‌ది. వాడికీమధ్యే పెళ్ళయింది. హాలీడేస్‌లో సతీసమేతంగా ఈ తోటలోనే గడిపివెడతాడు" చెప్పాడు.

"అయితే ఈరోజుకూడా వస్తారేమో! వాళ్ళమధ్య మనం ఉండటం బావుండదు" సంకోచంగా అంది.

"ఆ భయం వద్దులే! ఈరోజు వాడు రాడు" రవీంద్ర అన్నాడు.

"మరి ముందీవిషయం చెప్తే ఇంటి దగ్గర ఏదైనా టిఫిన్‌చేసి తెచ్చేదాన్నిగా" అంది విద్య.

"ఆ బాధ మనకొద్దులే. ఫ్రిజ్‌లో పళ్లు, పాలూవున్నాయి. వాటితో ఎడ్జస్టయిపోదాం" అన్నాడు.

"ఈ పూలతోట చాలా బావుంది. నాకిటువంటి ప్రశాంత వాతావరణమంటే ఎంతో ఇష్టం. ముఖ్యంగా పిండారబోసినట్టుండే వెన్నెల్లో ఈ తోటలో చెట్ల నీడలో తిరిగితేఎంతహాయిగా వుంటుందో" విద్య తన్మయత్వంగా అంటుంటే ఆమెలో ఆ పరవశంచూసి చిన్నగా నవ్వుకున్నాడు.

"నీకు తప్పకుండా ఇష్టమవుతుందనే పనిబట్టి నిన్నిక్కడకు తీసుకొచ్చాను"

"అవునూ...నాకిటువంటి వాతావరణమంటే ఇష్టమని మీకెలా తెలుసు?"

"వెరీ సింపుల్! నాకిష్టమయిందల్లా నీకూ ఇష్టమవుతుంది కాబట్టి" రవీంద్ర మాటలకు విద్య చెంపలు కెంపులయ్యాయి.

"విద్యా! ఇక్కడ కూర్చుందాం" మామిడిచెట్ల నీడన కర్చీఫ్ పరిచాడు. విద్య కూడా తన చేతిరుమాలు పరిచి కూర్చుంది.

"ఇలా రావడం గురించి సరితా వాళ్ళకు ఏం చెప్పావు?" రవీంద్ర అడిగాడు.

"ఉదయం చీరకట్టుకుని తయారవు తుంటే సరిత వచ్చి 'పొద్దుటే ఎక్కడికి ప్రయాణం' అని అడిగింది. సర్దిచెప్ప డానికి అబద్ధం అల్లి చెప్పాలంటే తల ప్రాణం తోకకొచ్చిందనుకోండి! మీకేం హాయిగా బెదిరించి మరీ వెళ్లారు!"

విద్య చెప్తుంటే రవీంద్ర నవ్వాడు.

"ఇంతకీ నువ్వల్లిన ఆ అందమైన అబద్ధం గురించి చెప్పలేదు"

"ఏముంది...మా కొలీగ్ సరళ సిస్టర్ మారేజని చెప్పాను. సరిత అంత తేలిగ్గా వదిలేరకంకాదని మీకు తెలుసుగా! 'ఎవరు సరళ, ఎక్కడుంటుంది' అని వివరాలడిగి నన్ను బేజారెత్తించింది. 'ఆ సరళ నీకు తెలియదులే! ఈమధ్యే వచ్చింది. పైగా మా సెక్షన్‌కూడా కాదు' అని తప్పించుకున్నాను" చెప్పింది విద్య.

"విద్యా! నేను త్వరలోనే పెళ్ళిచేసుకో వాలనుకుంటున్నాను" రవీంద్ర ప్రత్యే కించి ఈ విషయం తనకెందుకు చెప్తు న్నాడో అర్థంకాలేదు విద్యకు.

"మంచినిర్ణయమే తీసుకున్నారు. ఇంతకీ అమ్మాయిని చూశారా లేదా?" అంది.

"చూశాను..నాకు నచ్చింది. నాకేకాదు మా చెల్లాయిక్కూడా నచ్చింది" రవీంద్ర మాటలు విద్యను సందిగ్ధంలో పడేశాయి.

"ఎవరో ఆ అదృష్టవంతురాలు. త్వర లోనే మాకు విందు భోజనం లభిస్తుం దన్నమాట"

"ఆ ఆశలు పెట్టుకోకు. నా పెళ్ళికి విందు, మంత్రాలు, హంగులు ఉండవు. అంతా అయ్యాక కాస్త తీపిపెట్టి కాఫీ మాత్రం ఇచ్చి పంపిస్తాను"

"అదేమన్నా నియమమా లేక మంత్రాలమీద ద్వేషమా?"

"అలాంటిదేంలేదు. సంప్రదాయాలు, మూఢనమ్మకాల పేరుతో మనం ఎంత డబ్బు వృధాగా ఖర్చుపెడుతున్నామో లెక్కవేసుకోరు. మన పూర్వులుబాగా ఆలోచించి ఈ మంత్రాలు, పెళ్ళితంతు ఏ ఉద్దేశంతో పెట్టారో దానియొక్క అర్థమే మారి రానురాను వికృతరూపం దాల్చి డబ్బుతో ముడిపడి ఓ భూతంలా మారిపోయింది. పెళ్ళివరకూ రాకముందే వరుడి తండ్రి, అక్కా, చెల్లెళ్లు కట్నం లాంఛనాలు దోచేస్తారు. ఇక పీటలమీద కూర్చున్నాక ఐదివ్వండి, పదివ్వండి అంటూ పురోహితుడుగారు ప్రాణాలు తోడతారు. ఇక వధూవరులు పెళ్ళిపీటల మీదనుండి లేచాక గుమ్మందగ్గరే ఆడపిల్ల లంతా గుమిగూడి ఒకరి పేరు మరొకర్ని చెప్పమని బలవంతంచేసారు. ఆ కొత్త దంపతులు పరస్పరం పేర్లు చెప్పడానికి ఓడియపడుతూ, తాత్సారం చేస్తున్న దృశ్యం ఎంతో మనోహరంగాఉంటుంది. తీరా ఆ వేడుక అవగానే ఆడపిల్లలు డబ్బులువెయ్యమంటూ పళ్ళేలు ముందుకు చాచడంతో దాని అందమే పోతుంది.

"ఇక మొదటిరాత్రి శోభనం గదిలోకి వరుడు వెళ్ళేముందు అలుకపూని మంచ మెక్కుతాడు. 'మా అమ్మాయి బతుకు నుద్ధరించడానికి నీకేంకావాలి చెప్పు నాయనా' అని పిల్లతండ్రి అల్లుడుగారి కాళ్లు పట్టినంత పనిచేస్తాడు. రేడియోనో, టి.వీయో, స్కూటరో, కారో – ఇలా ఎవరి తూకాన్నిబట్టి వాళ్ళు అడగడం, మామగారు తనకిచ్చే తాహతువున్నా,

లేకున్నా కూతురి బతుకునుద్ధరించడం కోసం ఆ ముడుపు చెల్లిస్తానని మాటిస్తాడు. అప్పుడు అయ్యగారు పాన్పుదిగి గదిలోకి వెళ్ళడం ....ఇదంతా నాకెంతో హేయంగా కన్పిస్తుంది విద్యా! ఒకవేళ ఆ మామగారు ఆ కోర్కెను తీర్చలేక పోతే సద్దుకుపోయే మగాడు సద్దుకు పోతాడు. లేనివాడు దానికోసం భార్యను చిత్రహింసలు పెడతాడు.

"అలాగే మనుగుడుపుకు బహుమతులు, ఆషాఢమాసానికి బహుమతులు ఇలా అందంగా, అపురూపంగా దాచుకోవాల్సిన ఘట్టాలన్నీ డబ్బుతో ముడిపడి ప్రాణాంతకంగా పరిణమించి మరికొన్ని బతుకుల్లో మంటలురేపే పరిస్థితి ఎదురవుతున్నపుడు వాటిని వదిలి మనం కొత్తపుంతలు తొక్కడమే మంచిదికదూ!

"అసలు పెళ్ళన్నది ఎందుకు చేసుకోవాలో, తామిద్దరూ ఎలా జీవించాలో ఓ ఆలోచన, పద్ధతి అన్నది నేటి యువతరంలో లేకపోవడం మరెన్నో అనర్థాలకు కారణమవుతోంది..." రవీంద్ర చెప్తున్నదంతా విద్య కళ్ళు విప్పార్చి మరీ వింది.

"నిజమే! మీ మాటల్లో చాలా వాస్తవముంది" అంది.

"అందుకే సింపుల్ గా రిజిస్టర్ మారేజ్ చేసుకోవాలనుకుంటున్నాను" రవీంద్ర అన్నాడు.

"మీ ఉద్దేశం మంచిదే. అందుకు ఆ అమ్మాయి తల్లిదండ్రులు అంగీకరించాలిగా" విద్య అంది.

"అంగీకరిస్తారు. అంగీకరింప చెయ్యగలనన్న నమ్మకం నాకుంది" రవీంద్ర దృఢంగా అన్నాడు. విద్య మాట్లాడలేదు.

"విద్యా! నాకు పెళ్ళంటే నీకే మన్నిస్తోంది?" రవీంద్ర సంభాషణ పొడిగించాడు.

"నాకెందు కన్పిస్తుంది"

"ఎందుకా? నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు కాబట్టి" రవీంద్ర మాటలకు విద్య గతుక్కుమంది.

"అవును... ప్రేమిస్తున్నాను, ఆరాధిస్తున్నాను. మొట్టమొదటిసారిగా నా గుండె గదిలో కూర్చుని ప్రేమ సితారను మీటిన పురుషుడు మీరేనని నిర్భయంగా చెప్తాను. కాని మీరు నన్నుకాక మరో అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానంటే నేను అసూయపడను ... సంతోషిస్తాను"

"ప్రేమించినవాడితోనే జీవితం పంచుకోవాలని ఆశించడం సహజంకదా" రవీంద్ర అన్నాడు.

"జీవితాన్ని పంచుకోడానికి ముందు నాకున్న అర్హతలేమిటో నేను తేల్చుకోవాలిగా! నాకా అర్హతలేదు కాబట్టి నేనా తీరులో ఆలోచించడంలేదు. ప్రేమించడమన్నది నా మనసుకు సంబంధించినది. జీవితాన్ని పంచుకోవడం భౌతికంగా జరగాల్సింది. మనసుకు అడ్డుగోడలు, అర్హతలు అవసరంలేదు" అంది విద్య.

"కాని నేను ప్రేమించిన అమ్మాయితోనే జీవితం పంచుకోవాలనుకుంటున్నాను" రవీంద్ర గంభీరంగా అన్నాడు.

"అలాగే చెయ్యండి" విద్య అంది.

"అయితే రేపోసారి రిజిష్ట్రారాఫీసుకు వెళ్ళి అప్లికేషన్స్ పడేసి వద్దాంరా"

"రవీ" విద్య అదిరిపడింది.

"అవును. నేను ప్రేమించినది, జీవితం పంచుకోవాలనుకున్నది నీతోనే" స్థిరంగా పలికిందతడి కంఠం.

"నో...నేనందుకు సిద్ధంగాలేను" విద్య ఖండితంగా అంది.

"ఎందుకని?" రవీంద్రలో పట్టుదల

పెరిగింది.

''నేనందుకు అనష్టపడాలిని'' వేలగా అంది.

"అది నిర్ణయించాల్సింది నీకు నువ్వే ననుకుంటున్నావా?"

"........."

"నీ భయాలేమిటో చెప్పు విద్యా?" ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకుని మృదువుగా అడిగాడు రవీంద్ర.

"మీ విద్యకు మీ కళ్ళకు కన్పించని గతమొకటుంది. మీరు వింటానంటే చెప్తాను. విషయం విన్నాక కూడా మీరు నన్ను పెళ్ళి చేసుకోవాలనుకుంటే నాకభ్యంతరంలేదు" అంది విద్య.

"విద్యా! నీ గతంతో నాకు పనిలేదు. నీవెనుకో కథంటూవున్నా అది నన్ను కలవరపరిచేదయుంటుందనుకోను"

"అలాఎలా ఊహించగల్గుతున్నారు?"

"మగాడు మాట్లాడితేనే ఉలికిపడే అమ్మాయిలు తమ జాగ్రత్తనెరిగి ప్రవర్తించే ముందుచూపుగలవారని నా ఉద్దేశం''

''కావచ్చు. నా గతం నన్నెప్పుడూ హీనస్థితిలో నిలబెట్టలేదు. అదంతా నా మనసుతో, వయసుతో ప్రమేయంలేకుండా నా దురదృష్టం మా అత్తరూపంలో నన్ను బలిచేసింది'' విద్య నిట్టూర్పు విడుస్తూ అంది.

''అయితే నువ్వింక నాకేం చెప్పక్కర్లేదు"

"అలాఅనకండి. భవిష్యత్తులోఅదంతా ఎవరి నోటయినా విన్నపుడు మీరు పొందే బాధ నేను చూడలేను. ముందుగానే తెలుసుకునిమరోసారి ఆలోచించి నిర్ణయం తీసుకుంటే మంచిది" విద్య అంది.

"విద్యా! అవన్నీ చెప్పి నా నిర్ణయాన్ని మార్చలేవు. నీకు నామీద ఇష్టంలేకుంటే చెప్పు...ఇప్పుడే నీకు దూరంగా వెళ్ళిపోతాను'' నిష్ఠూరంగా అన్నాడు.

"మీమీద ఇష్టంలేకపోవడమా! నా హృదయాన్ని మీకు చూపగల శక్తే ఉంటే తెలిసేది- ఈ విద్య మీ సాన్నిధ్యం కోసం, మీ మాటకోసం ఎంతగా తపించి తన్మయురాలవుతుందో" అంది.

"అటువంటపుడు గతం అదీ ఇదీ అంటూ వెరపుతో వెనుకడుగెయ్యడమెందుకు? నువ్వు నా అర్ధాంగిగా నా జీవితంలోకి అడుగుపెట్టాలి. నువ్వు నాక్కావాలి విద్యా! నీ సమక్షంలో నేను పొందే ప్రశాంతత, నీ అనురాగం నాకు కావాలి" రవీంద్ర అన్నాడు.

విద్య అతడి కంఠంలో ధ్వనించిన రాగమధురిమకు చలించింది. ఏమీ చెప్పలేని మూగదయింది.

"విద్యా! నీకభ్యంతరం లేకుంటే ఒక్కసారి..." అంటూ చేతులుచాచి సందేహంగా ఆగిపోతే విద్య సిగ్గుతో దోసిట్లో ముఖం దాచుకుంది. ఆమె మౌనంలో, సిగ్గులో తనకు సమాధానం లభించడంతో ఆమెను దగ్గరగా తీసుకుని హృదయానికి హత్తుకున్నాడు. అతడి హృదయంలో తలదాచుకున్న విద్యకు ఈ ప్రపంచమే తెలియలేదు. మిధ్యాబింబం లాంటి ఈ విశ్వంలో తామిద్దరి ఉనికే శాశ్వతమైనట్టు భ్రమపడింది. రవీంద్ర ఆమె నుదుట చుంబించి వదిలాడు. అతడి స్పర్శతో పులకెత్తిన శరీరం ఇంకా ఆ అనుభూతిని జ్ఞాపకం చేస్తుంటే మొగ్గలా ముడుచుకుని ఒద్దికగా కూర్చుంది.

"అమ్మాయిగారి భయాలన్నీ తీరినట్టేనా... ఇంకా మిగిలివున్నాయా?" రవీంద్ర చిలిపిగా అడిగాడు.

"నాకు మీపట్ల భయాలేవీ లేవు. నా అదృష్టంమీదే నాకెప్పుడూ నమ్మకంలేదు" అంది.

"ఆ నమ్మకం కలిగించాలంటే వెంటనే నీ మెళ్లో తాళికట్టి నావెంట తీసుకుపోవాలి" అన్నాడు.

"సంతోషంగా మీవెంట వస్తాను" అంది.

"విద్యా! మన పెళ్ళయ్యేక నువ్వు జాబ్ చెయ్యడానికి వీల్లేదు. ముందుగా చెపుతున్నా...నువ్వు రిజిగ్నేషనివ్వాలి"

"అది మీరు విధించే షరతా?"

"షరతుకాదు...నాకెందుకో నా భార్య ఉద్యోగం చెయ్యడం ఇష్టంలేదు. నేను అలిసి ఇంటికొచ్చినప్పుడు నీ సమక్షంలో, సేవలో నా మనసు సేదతీరాలి. ఇంటిని చక్కగా తీర్చిదిద్ది నా పిల్లలకు, నా కంటికి నువ్వు దీపం కావాలి'' అన్నాడు రవీంద్ర.

"మీ ఇష్టమే నా ఇష్టం. ఇంతవరకూ బతుకుతెరువుకోసం చేశాను. మీరు ముందుగా చెప్పకపోయినా నేనే రిజిగ్నేషనిచ్చి వుండేదాన్ని''.

"విద్యా! ఇందుకే నిన్నింతదూరం తీసుకొచ్చేను. నా దృష్టిలో కొన్ని ఘట్టాలు హృదయకుహరంలో అపురూపంగా, మధురంగా నిలిచిపోవాలి. ప్రతి అనుభవాన్ని అందంగా మలచుకొనే శక్తి మన చేతుల్లోనే వుందని నా నమ్మకం. అలా నిలుపుకోవడంకోసం ఎంతటి సాహసాన్ని చేయటానికయినా నేను వెనుదీయను."

"మన విషయం సరోజకు తెలుసా?" విద్య అడిగింది.

"తెలుసు. నువ్వు నాకు తగినవ్యక్తివని రోజాకూడా సలహా ఇచ్చింది"

"నిజంగా మీ ఇద్దరికి నేను చాలా ఋణపడివున్నాను. చదువు, అందం వీటితో సంబంధం లేకుండా కేవలం డబ్బుకే ప్రాధాన్యమిచ్చే ఈరోజుల్లో ఎవరూలేని నన్ను మీలో కలుపుకోడానికి సిద్ధపడ్డారంటే మీరిద్దరూ ఎంతటి గొప్ప మనసున్న మనుషులో అర్థమవుతూనే వుంది" విద్య కృతజ్ఞతనిండిన గొంతుతో అంది.

"విద్యా! అంత పెద్ద మాటలొద్దుగాని రిజిస్టర్ మారేజికి నీకు ఆమోదమేనా?" రవీంద్ర అడిగాడు.

"మీతో నరకానికి రమ్మన్నా సంతోషంగా వస్తాను. ఈరోజునుండి నా బాధ్యతలన్నీ ఇక మీవే" అంది.

"రేపు సెలవు కాబట్టి ఎల్లుండి రిజిస్ట్రారాఫీసుకు వెళ్లి అప్లికేషన్ వేసివద్దాం" అన్నాడు.

"ఒక్కమాట" విద్య అంది.

"ఏమిటి?"

"మన విషయం ఇంకా ఎవరికీ చెప్పొద్దు. ఆఖరుకు భానుమూర్తిగారి ఫేమిలీకి తెలియనివ్వొద్దు. అంతా జరిగేకే అందరూ తెలుసుకోవాలి. అప్పటివరకూ అందరి ముందు ఇదివరకులా అపరిచితులమే...ఏమంటారు?"

"నీ ఇష్టం" అన్నాడు రవీంద్ర.

"మనం మాటల్లోపడి టైముచూసుకోనేలేదు. అప్పుడే పన్నెండయ్యింది" విద్య టైముచూసి అంది.

"పద వెళదాం" అంటూ రవీంద్ర ముందుగా లేచి విద్యకు చెయ్యందించాడు.

బంగళా వైపు నడిచారు.

ఇద్దరూ యాపిల్ ముక్కలు తింటుండగా ఓ వ్యక్తి చేతిలో అరటిపళ్లు, ఖుజాస ఫ్లాస్కుతో లోపలికొచ్చాడు.

"నువ్వా రంగయ్యా! లోపలికి రా!'' రవీంద్ర అతణ్ని పిలిచాడు. పళ్లు, ఫ్లాస్కు





వారి ముందున్న స్టూలు మీద పెట్టేడు.

"ఇప్పుడు మా కోసం శ్రమ తీసుకున్నావన్నమాట" రవీంద్ర నొచ్చుకున్నాడు.

"శ్రమేముంది బాబూ! నిన్నే మీరొస్తారని చినబాబు చెప్పేరు" అని వెళ్లిపోయాడు రంగయ్య.

అరటిపళ్లు చెరో రెండూ తిని కాఫీ తాగారు.

"అతిథిని ఇంత దూరం తీసుకొచ్చి ఒట్టి పళ్లు, కాఫీతో లంచ్ ముగించినందుకు క్షంతవ్యుణ్ని. మరోసారి సంపూర్ణంగా అతిథి మర్యాద చేసుకోగలవాడినని మనవి చేస్తున్నాను. ఇప్పుడిక ఓ గంట విశ్రాంతి తీసుకోడం మంచిది" మంచం మీద వెనక్కు వాలాడు.

"మీరు పడుకోండి. నాకు పగటి నిద్ర అలవాటులేదు" అంది విద్య.

"అలవాటు లేకనా ... ఒళ్లు మరచి నిద్రపోడం మంచిదికాదనా!"

చురుక్కుమనేలా చూసి, "నాకేం భయంలేదు" అంది సోఫాలో వాలుతూ.

"మంచి పిల్లవి" వెక్కిరింతగా అన్నాడు.

"నేనేం పిల్లనుకాను" విద్య ఉడుక్కుంది.

"మాటకు ముందు పోట్లాడకోయ్! మనం పోట్లాడుకునే రోజులు ముందు ముందు చాలావున్నాయి" అన్నాడు.

రవీంద్ర మాటలకు విద్య నవ్వుతూ–"మాటల్లో మీతో గెలవలేనని ఎప్పుడో తెలుసుకున్నాన్లెండి" అంది.

రవీంద్ర మాట్లాడుతూనే ఇట్టే నిద్రపోయాడు.

విద్య కూడా క్రమంగా నిద్రలోకి జారుకుంది.



మెలకువొచ్చేసరికి సాయంత్రం నాలు గయింది. కళ్లు విప్పి ఎదురుగా చూసింది. రవీంద్ర మంచం మీద పడుకుని ఆమె వైపే చూస్తున్నాడు.

"నిద్ర అలవాటు లేదంటూనే కుంభ కర్ణుడి చెల్లెల్లా నిద్రపోయావు" రవీంద్ర పరిహాసంగా అన్నాడు.

విద్య సిగ్గుపడుతూ - "చాలా టైమ్ అయింది. ఎప్పుడూ నేనిలా నిద్రపోలేదు. మీరు లేచి ఎంతసేపయింది?" అంది.

"ఓ గంటపైనే అయింది"

"నన్ను నిద్రలేపలేకపోయారా!" విద్య నొచ్చుకుంటూ అంది.

"ఆ పాపం నాకెందుకులే అని లేప లేదు" రవీంద్ర లేచి ముఖం కడుక్కొని వచ్చేడు. విద్యకూడా తలదువ్వుకుని బొట్టు దిద్దుకుని పావుగంటలో రెడీఅయింది.

"విద్యా! పూలతోట కూడా చూసి ఇంటికి వెడదాం" అన్నాడు. విద్య అతణ్ని అనుసరించింది. ఇద్దరూ నడుచు కుంటూ తోటలోకి వెళ్లారు.

తోటంతా చూసివచ్చి మాధవీలత నీడలో వచ్చి కూర్చున్నారు. ఏవేవో విషయాలు మాట్లాడుతూ ఆరింటి వరకూ అక్కడే గడిపారు. మాటల్లో మునిగి పడమటి కొండల్లోకి ఒరిగిన సూర్యుణ్ని గాని, నల్లముసుగు వెయ్యడానికి సిద్ధ మవుతున్న ప్రకృతినిగాని గమనించనే లేదు.

"విద్యా! ఇక వెడదామా?" రవీంద్ర లేచాడు.

విద్య అతడి వెనుకే కూర్చుని- స్కూటర్‌మీద "రవీ! నా జీవితాధ్యా యంలో అండర్‌లైను చేసుకుని అపు రూపంగా దాచుకోవాలిన రోజిది. ఈరోజు నేనెప్పటికీమర్చిపోలేనిది" అంది.

"నా మాటలు నిజమని ఇప్పటికైనా ఒప్పుకున్నావు. నీకేకాదు...నాకూ అదే భావం ఉంది. కాబట్టి చెల్లుకు చెల్లు" అన్నాడు.

"విద్యా! నేరుగా ఇంటికి డ్రాప్ చెయ్యనా?" దారిలో అడిగాడు.

"వద్దు. దగ్గరలో దింపెయ్యండి. రిక్షాలో ఇంటికి వెడతాను"

"మళ్ళీ ఎప్పుడు పునర్దర్శనం?"

"రేపుదయం ఆఫీసులోనే"

* * *

"విద్యా! సాయంత్రం ఆఫీసు వదిలేక మా ఇంటికిరా. నీతో మాట్లాడాలి" రవీంద్ర మధ్యాహ్నం ఆఫీసులో విద్యతో చెప్పాడు.

"ఏ విషయం?"

"మన మారేజ్ విషయం"

"వస్తాను"

ఆఫీసు వదలగానే విద్య సరాసరి అతడింటికి వెళ్ళింది. వంటవాడు రాఘవులు ఆమెను లోపలికాహ్వానించి-"అయ్యగా రింకా రాలేదు. మీరొస్తే కూర్చోమని చెప్పమన్నారు" అన్నాడు. విద్య హాల్లో సోఫాలో కూర్చుని రాఘవులిచ్చిన టీ తాగి రవీంద్రకోసం ఎదురుచూడసాగింది.

ఓ అరగంటలోనే రవీంద్ర వచ్చేడు. లోపలికొస్తూనే అలసటగా ఈజీఛైర్లో వాలిపోయాడు. "సారీ విద్యా! చాలా లేటయింది కదూ?" అన్నాడు.

"పరవాలేదు" విద్య లోపలికెళ్లి రాఘవులునడిగి కప్పుతో టీ తెచ్చి అతడికి ఇచ్చింది.

"థాంక్యూ. అన్నట్టు విద్యా... షాపునుండి కుర్రాడు చీరలు తెస్తాడు. నీకు నచ్చినవి సెలక్టు చేసుకో"

"ఇప్పుడు నాకు చీరలెందుకు?"





అంది ఇబ్బందిగా.

"కారణం లేనిదే ఏపనీ చెయ్యం! రేపే మన మారేజ్"

"రేపా! మరి నాకు ముందే ఎందుకు చెప్పలేదు?" చిరుకోపంతో అంది విద్య.

"నిన్ను సర్ప్రయిజ్ చెయ్యాలని!"

"గొప్పపని చేశారు"

ఇంతలో ఇంటి ముందాగిన రిక్షాలో నుండి షాపు కుర్రాడు దిగి చిన్న బట్టల మూట పట్టుకుని లోపలికొచ్చేడు.

"విద్యా! బట్టలు చూడు" అని చెప్పి రవీంద్ర లోపలికెళ్లాడు.

విద్యకిదంతా బిడియంగా తోచింది. ఓ పట్టుచీర, మరో సింథటిక్ చీర సెలక్టు చేసింది.

రవీంద్ర డ్రస్సు మార్చుకుని లుంగీ చుట్టుకుని వచ్చేసరికే విద్య సెలక్షన్ పూర్తవడం చూసి నవ్వుతూ – "అరె! అప్పుడే చీరలు సెలక్టు చెయ్యడం అయిందా! అసలు మీ ఆడవారికి చీరలు చూస్తేనే మతిపోతుందటగా! ఏది సెలక్టు చేసుకోవాలో తెలియక రెండు చీరల కోసం వెళ్ళినవారు అరడజను చీరలతో వస్తారటగదా! మరి నువ్వు..." అంటూ మరో నాలుగు సాదా చీరెలు, ఓ పట్టు చీర తీసి ఆ కుర్రాణ్ని పంపేశాడు.

"మీరు చేసిన పని నాకు నచ్చలేదు" అంది విద్య.

"నాకోసం భరించడం అలవాటు చేసుకో"

"నిజంగా రేపేనా మన వివాహం?" అనుమానం తీరక అడిగింది.

"నిజమే. నేను ఆఫీసుకు సెలవు పెట్టేను. నువ్వుకూడా సి.ఎల్. పంపించు. తొమ్మిదింటికి రెడీగా ఉంటే నేనొచ్చి నిన్ను తీసుకెడతాను. అక్కడ అన్ని ఏర్పాట్లు చూడ్డానికి మా మిత్ర బృందం ఉండనే ఉంటుంది"

"అప్పుడే అందరికీ చెప్పేశారా?"

"ఆ! చెప్పకపోతే బావుండదు. భాను కూడా చెప్పాను"

"అయ్యో! వాళ్ళముఖం నేనెలా చూడ్డం!" విద్య వాపోయింది.

"చూడొద్దు దాచేసుకో. అయినా మనమేం తప్పుచేస్తున్నామని ఆ భయం. రేపయినా తెలుస్తుందిగా?"

"సరోజ వస్తుందా?" విద్య అడిగింది.

రవీంద్ర ముఖం మ్లానమయింది. "లేదు ఈరోజే సరోజనుండి లెటరొచ్చింది. వాళ్లాయనకు ఫోన్‌చేసి 'కనీసం సరోజను పంపించ'మని చెప్పినా 'వీలుపడద'ని ఖచ్చితంగా చెప్పేశాడు. వాడికి రోజాను పంపించడం ఇష్టంలేకనే అలా కుంటి సాకులు చెప్పేడు. ఈవిధంగా మా ఇద్దర్నీ సాధించాలని కాబోలు అతడి ఉద్దేశం" బాధగా అన్నాడు.

అతడెంత బాధపడుతున్నదీ విద్య ఊహించింది. "నేనిక వెడతాను" విద్య లేచింది.

"ఉదయం నేనొచ్చేసరికి రెడీగా ఉండాలిసుమా!"

విద్య తలూపి ఇంటికి బయల్దేరింది.

తలుపు తాళంతీసి లోపలికి అడుగు పెట్టి లైటు వేసిందోలేదో విమల, సరిత విద్య గదిలోకి వచ్చేరు. "అమ్మాయ్! భాను చెప్పాడు...నిజమేనా?" విమల విద్యనడిగింది.

"నిజమే ఆంటీ!"

"మంచిపనిచేశావు. ఎన్నోసార్లు నీ పెళ్ళివిషయం కదపాలని ప్రయత్నించి నువ్వు చిన్నబుచ్చుకుంటావని నీతో అన లేదు. ఇప్పటికైనా నీ జీవితం ఓ దరికి చేర

బోతున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. రవిలాంటివాడు భర్తగా దొరకడం నీ అదృష్టం" విమల అంది.

"అక్కా! ఆలస్యంగానైనా మంచి ఛాయిస్ కొట్టేవు. నిన్ను మనసారా అభినందిస్తున్నాను" సరిత అంది.

"ఈ విషయం మీ అత్తకు, మామయ్యకు రాశావా?" విమల అడిగింది.

"రాయలేదాంటీ" విద్య చెప్పింది.

"గుడ్! ఇప్పుడునువ్వు నాకు నచ్చేవు. మీనాక్షత్తలాంటివాళ్ళ ఆటలు కట్టించాలంటే అలాగే చెయ్యాలి. పాపం! ఆవిడ గారికీ విషయంతెలిస్తే ముఖం వెల్లవేసిన తెల్లగోడలా అయిపోతుంది" ఆ సీను ఊహించుకుని కాబోలు సరిత హాయిగా నవ్వుకుంది.

"ముందుగా తెలియపరచకపోయినా తరువాతయినా రమ్మని ఉత్తరం రాయడమో, నువ్వే స్వయంగా వెళ్ళడమో చెయ్యాలి. వాళ్ళెటువంటి వ్యక్తులైనా నిన్ను పెంచి పెద్దచేసినవారు" విమల సలహా ఇచ్చింది.

"నేనూ అదే చెయ్యాలనుకున్నాను అంటీ" అంది విద్య.

"అక్కా! పైకలా అమాయకంగా కన్పిస్తావుగాని చాలా గడసరివి" సరిత బుంగమూతి పెట్టి అంది.

"మీ లవ్‌స్టోరీ గురించి మాట మాత్రంగానైనా ఎప్పుడూ చెప్పలేదు. పైగా రవీంద్రన్నయ్య చెప్పేవరకు నువ్వు పెళ్ళి సంగతి చెప్పలేదు"

సరిత అభియోగానికి విద్య నొచ్చుకుంది. "చెల్లీ! లవ్‌స్టోరీ లాంటిది ఏమీ మామధ్య లేదమ్మా! నెలకిందట సరళ సిస్టర్ పెళ్ళికి వెళ్ళినపుడు రవీంద్రగారు నా అభిప్రాయమడిగారు. కాదనడానికి నాకేఆస్కారం కన్పించలేదు. ఆ సంగతి సూటిగానే చెప్పాను. ఆ మర్నాడే రిజిష్ట్రారాఫీసులో అప్లికేషన్ ఇచ్చి వచ్చాం. మారేజ్ రేపేననే సంగతి ఇప్పుడే రవీంద్ర గారు చెప్తేనే తెలిసింది" విద్య చెప్పింది.

"దాని మాటలు పట్టించుకోకు విద్యా! ఇక ఇప్పుడేం వండుకుంటావుగాని ఈ పూటకు మా ఇంట్లో భోంచేసెయ్యి. పెళ్ళయి వెళ్ళిపోతే నీతో సరదాగాగడిపే అవకాశం వస్తుందోలేదో" విమల అంది.

"అలాగే ఆంటీ!"

"పెళ్ళయ్యేకకూడా జాబ్‌చేస్తావా?" విమల అడిగింది.

"లేదాంటీ! రేపే రిజిగ్నేషనిస్తున్నాను. రవీంద్రగారు పెట్టిన షరతుల్లో ఇదే ముఖ్యమైంది" విద్య నవ్వుతూ చెప్పింది.

"ఇదే ముఖ్యమైంది అంటున్నావంటే రవన్నయ్య ఇంకా చాలా షరతులు విధించాడన్న మాట! అవికూడా మా చెవిన వేస్తే విని ఆనందిస్తాను" సరిత అంది.

"పో..కొంటెపిల్లా! విద్యను ఒంటరిగా వదిలిపెట్టు" విమల సరితను తనతో లాక్కెళ్ళింది.

విద్య నవ్వుకుంటూ తలుపు వేసివచ్చి డ్రస్సు మార్చుకుంది.



## 6

ఉదయం తొమ్మిదయ్యేసరికల్లా రవీంద్ర భాను ఇంటికొచ్చేడు.

"రావోయ్ పెళ్ళికొడుకా!" విమల నవ్వుతూ ఆహ్వానించింది.

"అన్నయ్యా! నువ్వు మీ పెళ్ళికి నన్ను పిలవకపోయినా నేను నీ పెళ్ళి కొస్తున్నాను చూశావా" సరిత గర్వంగా అంది.

"అన్నయ్య పెళ్ళికి చెల్లిని ప్రత్యేకించి పిలవాలా! నువ్వు లేంది నా పెళ్ళి అసలు ఎలా జరుగుతుంది చెప్పు" నవ్వుతూ అన్నాడు.

"అంతా అబద్ధం. నీ పెళ్ళి విషయం ఈరోజువరకూ చెప్పలేదుగాని" మూతి ముడిచింది సరిత.

"నామీద తరువాత అలుకసాగిం చొచ్చుగాని మీ వదిన రెడీఅయ్యిందో లేదో చూసిరా" సరితను బుజ్జగిస్తూ అన్నాడు.

"వదినా... అవునవును! వరసమార్చు కోవలసిందే" అంటూ విద్య గదిలోకి వెళ్ళింది సరిత.

వారు వెళ్ళేసరికి అప్పటికే రవీంద్ర ఫ్రెండ్సంతా పుష్పగుచ్ఛాలతో, పూల దండలతో వారికోసమే ఎదురుచూస్తూ కన్పించారు.

"రా రా నాయనా! నీకన్నా ముందు మేమేవచ్చి కూర్చున్నాం. ఏమిటింత ఆలస్యం?" అంటూ చుట్టూ మూగేరు.

రవీంద్ర అందర్నీ విద్యకు పరిచయం చేశాడు. "విద్యా! వీరంతా నా ఫ్రెండ్స్! భాస్కర్....బిజినెస్ మాగ్నెట్. ఇతను ప్రసాద్...డాక్టర్. ఇక ఇతను...." అంటూ అందర్నీ పేరుపేరునా విద్యకు పరిచయం చేశాడు.

అందరికీ నమస్కరించింది విద్య.

ఆఫీసులో సంతకాల కార్యక్రమం ముగిసేక అందరి సమక్షంలో విద్య మెళ్లో తాళికట్టేడు రవీంద్ర. ఫ్రెండ్సందించిన పూలదండలు ఒకరి మెళ్లో ఒకరు వేసు కున్నారు. అక్కడితంతు ముగిసి బయటి కొచ్చేక స్నేహితులందరూ, 'మా ఇంటికి రావాలంటే మా ఇంటికి రావాలి' అంటూ ఆ కొత్త దంపతుల్ని ఆహ్వానించారు.

రవీంద్ర అందరికీ చేతులు జోడించి, "ఈరోజుకు మాత్రం మమ్మల్ని వది లెయ్యాలి. ఈ రోజు మా ఇంట్లోనే గడప దల్చుకున్నాం. రేపట్నుండి వరసగా రోజుకొకరింటికి వచ్చి అతిథిమర్యాదలు స్వీకరించడానికి మాకెట్టి అభ్యంతరం లేదు" అన్నాడు.

అతడి మాటలకంతా ముసిముసిగా నవ్వుతూ, 'పాపం! ఈరోజుకి మనవాణ్ని వదిలేద్దాం' అనుకున్నారు. అందరిదగ్గరా వీడ్కోలు తీసుకుని అంతా చేతులూపు తుండగా వారిద్దరూ స్కూటర్‌మీద వెళ్ళిపోయారు.

ఇంట్లో అడుగు పెట్టేముందు, "రాణీ వారు కుడిపాదం పెట్టాలి" చెప్పాడు రవీంద్ర.

"తెలుసు" విద్య చిన్నగా నవ్వి అడుగు లోపలికేసింది.

లోపలికెళ్ళగానే రాఘవులు ఆ ఇద్దర్నీ చిర్నవ్వుతో ఆహ్వానించి లోపలికెళ్ళి స్వీట్సున్న ప్లేట్లు తీసుకొచ్చి ఇద్దరికీ ఇచ్చాడు. కాఫీ తాగేక రవీంద్ర, "ఇప్పుడే వస్తాను విద్యా!" చెప్పి బయటికెళ్ళి పోయాడు.

విద్యకిదంతా తల్చుకుంటే గమ్మత్తుగా ఉంది. మెళ్లో పచ్చగా మెరిసే ఆ పసుపు తాడు చూస్తేతప్ప తనకు పెళ్ళయిందన్న వాస్తవాన్ని నమ్మలేకపోతోంది. తనకింత అదృష్టమా? ఇది స్వప్నమా,వాస్తవమా?' అని భ్రమపడుతూనే ఉంది. ఏంతోచక రవీంద్ర బెడ్‌రూమ్‌లోకి వెళ్ళింది. టేబుల్

మీదున్న ఫొటో ఫ్రేములో సరోజ, రవీంద్రల ఫొటోలున్నాయి. డబుల్ కాట్ మీద కొత్త దుప్పటి పరిచివుంది. డ్రెస్సింగ్ టేబుల్ ముందు నిలబడి తననుతనే అపరిచితలా చూసుకుంది. తన రూపం ఆమెకే కొత్తగా కనిపించింది. 'విద్యా! నువ్వు లక్కీ ఫెలోవి' అంత రంగం విద్యను గేలిచేసింది. వీక్లీ తీసుకుని హాల్లోకొచ్చి కూర్చుంది. యాంత్రికంగా పత్రిక తిరగేస్తున్నదేగాని దృష్టి అక్షరాల మీద నిలవడంలేదు.

'రాత్రయ్యేక రవీంద్రతో తను గడపబోయే జీవితమెలా ఉంటుంది?' ఆ ఊహకే విద్య మనసు గుబగుబలాడింది. తనువంతా చిరుపులకలతో ప్రకంపించింది.

మధ్యాహ్నం పన్నెండుదాటేక ఇంటికొచ్చేడు. అతణ్ని చూడగానే కూర్చున్నదల్లాలేచి నిలబడింది. "సారీ... బాగా లేటయింది. నువ్వు భోజనం చేసెయ్యలేకపోయావా?" అన్నాడు.

విద్య మాట్లాడలేదు. రవీంద్ర డ్రెస్సు మార్చుకుని ముఖం కడుక్కుని డైనింగ్ రూమ్‌కొచ్చేశాడు.

రవీంద్ర టేబుల్ మీద బోర్లించి ఉన్న ప్లేటు తీసుకోబోతుంటే విద్య తనే ప్లేటందుకుని అతడి ముందుంచి అన్నం వడ్డించింది.

"నువ్వు కూడా వడ్డించుకో విద్యా!" అనగానే తను కూడా భోజనానికి కూర్చుంది. సూటిగా అతడి ముఖంలోకి చూడలేక తలదించుకుని అన్నం తిన సాగింది.

"ఏమిటంత మవునంగా ఉన్నావు? అలాబయటికెళ్ళినందుకుకోపంవచ్చిందా?" రవీంద్ర అన్నాడు.

"అదేం లేదు" చెప్పింది.

భోజనం చేశాక రవీంద్ర తన గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. విద్య వచ్చి సోఫాలో కూర్చుంది. అలసటగా ఉండటంతో వెనక్కు వాలింది. ఎప్పుడు గాఢ నిద్ర పట్టిందో ఆమెకే తెలియదు.

సాయంత్రం ఐదవుతుండగా నిద్ర లేచింది. లేచి కిచెన్‌వైపు వెళ్ళింది. అప్పటికే.రాఘవులు వంటపని చూస్తున్నాడు.విద్యనుచూడగానే-"లేచారామ్మా! అయ్యగారిందాకే కాఫీ తాగి వెళ్లారు. మీరు ముఖం కడుక్కుని వచ్చి టిఫిన్ చెయ్యండి" అన్నాడు.

"అయ్యగారెన్నింటికి వెళ్లారు?" అడిగింది విద్య.

"మూడింటికే వెళ్లారు"

"నువ్వయినా నన్ను నిద్ర లేపాల్సింది" విద్య అంది.

"అయ్యగారే వద్దన్నారమ్మా"

విద్య టిఫిన్ తిన్నాక రవీంద్ర గదిలోకొచ్చింది. అతడి మంచం మీద ఏదో ప్యాకెట్టుంది. ఆ ప్యాకెట్టు పైన చిన్న స్లిప్ పిన్ చెయ్యబడి గాలికి రెపరెపలాడుతోంది. విద్య దగ్గరగా వెళ్ళి ఆ స్లిప్ వైపు చూసింది.

"విద్యా! నేను లేచేసరికి నువ్వు గాఢ నిద్రలో వున్నావు. అందుకే నిన్ను లేపకుండానే చిన్న పనుండి బయటికెడుతున్నాను. రాత్రి నేనొచ్చేసరికి ఈ ప్యాకెట్లో ఉన్న చీరకట్టుకుని ఉండాలి సుమా! ఈ చీర నాకు చాలా నచ్చింది. నీకూ నచ్చుతుందనే అనుకుంటాను. మరోమాట...సరోజ నీకు పర్సనల్‌గా లెటర్ రాసింది. ఆ లెటర్ కూడా ఈ ప్యాకెట్టులోనే పెట్టేను ... చదువుకో. నేనొచ్చేసరికి నువ్వు విద్యలా కాకుండా




రతీదేవిలా నా కళ్ళకు కన్పించాలి''

స్లిప్ చదవడం పూర్తయ్యేసరికి విద్య పెదవులు చిర్నవ్వుతో విచ్చుకున్నాయి. బుగ్గలు ఎర్రనయ్యాయి. ప్యాకెట్టు తెరచి చీర బయటకు తీసి చూసింది. తెల్లటి పాము కుబుసంలాంటి చీర మెత్తగా చేతిలోనుండి జారిపోయింది. ఆ చీరతోపాటు సరోజ రాసిన లెటర్ కూడా మంచం మీద పడింది. కవరు చించి లెటర్ చదివింది విద్య.

"వదినా!

మీ పెళ్ళికి రాలేకపోయినందుకు నువ్వేమీ బాధపడకు. పెళ్ళంటే భూదేవంత అరుగు, ఆకాశమంత పందిరి, ఫెళ్ళున భోజనాలు, వేలమీద లాంఛనాలు అనే కుహనా మనస్తత్వం ఉన్న కుటుంబంలో పడ్డ కోడల్ని నేను. అందుకే మనసులకే ప్రాధాన్యమిచ్చే మీ పెళ్ళికి రాలేకపోయాను. కాని నా మనసు సదా మీ దగ్గరే ఉంటుంది. మీ పెళ్ళిని మనోనేత్రంతో చూడగలశక్తి నాకుంది. మీ ఇద్దరికీ ఇవే నా శుభాకాంక్షలు అందుకోండి".

సరోజ ఉత్తరాన్ని ఒకటికి రెండుసార్లు చదువుకుంది విద్య. మనసులో ఆ అన్నాచెల్లెళ్ళపట్ల మరింత గౌరవం పెరిగింది. తర్వాత టవల్ తీసుకుని బాత్‌రూమ్‌కెళ్ళింది.

* * *

ఎనిమిదవుతున్నా రవీంద్ర జాడలేదు. ఆమె ఎదురుచూపులు పువ్వుల్లా విచ్చుకుని సౌరభాలతో గుబాళిస్తున్నాయి.

'పెళ్ళయిన రోజున కూడా అంత ఊపిరి సలుపని పనులేమున్నాయో!'

గడియారంవంక అదోలా చూసి నిట్టూర్చింది. ఎక్కడా అతడొచ్చే సూచనలు కన్పించడంలేదు. కట్టుకున్న తెల్ల చీర విద్యనుచూసి వెక్కిరించింది. కళ్ళవెంట నీళ్ళు గిర్రున తిరిగాయి.

చివాల్న సోఫాలోంచి లేస్తుండగా వీధిలో స్కూటరాగింది. విద్య కోపం మంచులా కరిగిపోయింది. ఒక్కక్షణంలో మామూలు విద్యలా మారిపోయింది.

"ఇంత ఆలస్యమా? ఏం చేస్తున్నారింత సేపు" అంటూ అతన్ని అల్లుకుపోయింది.

"ఏముందీ! ఈ ఇరుకింట్లో ఎందుకని మనవాడి తోటలో ఏర్పాట్లు చేయించి వచ్చానులే...పద"

విసుక్కుంది విద్య. అయినా అది కనపడనీకుండా అతనివెంట బయల్దేరింది. పావుగంటలో తోటలో బంగళా చేరుకున్నారు.

గదిలో లైటార్పి కిటికీ దగ్గర నిలబడి తోటలోకి చూశాడు రవీంద్ర. నిండు పున్నమిరేయి! జాబిలిరేడు తన వెన్నెల కిరణాలతో జగతినంతా తెల్లదనాన్ని చిమ్మాడు. ఆ వెన్నెలను మింగి నల్లగా పరుచుకున్న చెట్లనీడలు ఆ తెల్లని వెలుపునకు మధ్యమధ్య ఒత్తిన డిజైన్లా చూడ్డానికి గమ్మత్తుగా ఉంది. మలయపవనాలు సుమసౌరభాలను మోసుకొచ్చి అపురూపంగా శరీరాల్ని స్పర్శించిపోతోంది.

"విద్యా...ఇలారా! బయటి దృశ్యం చాలా బావుంది!" అంటూ విద్యను పక్కకు పిలిచి ఆమెను ఒకచేత్తో చుట్టి తోటవైపు చూపించాడు.

"అవును చాలాబావుంది" అంది విద్య పులకించిపోతూ.

"అలా తోటలోకి వెడదాం పద"

రవీంద్ర వెనుకే బయటికొచ్చింది విద్య. ఇద్దరూ వెన్నెల్లో నడుస్తూవెళ్ళి

మెత్తటి పచ్చికలో కూర్చున్నారు. విద్య ఒడిలో రవీంద్ర తల పెట్టుకుని పడుకున్నాడు. "విద్యా! ప్రకృతి స్త్రీ, పురుషులిద్దరికీ సమాన ధర్మాన్ని నిర్దేశించింది. స్త్రీ పదార్థమయితే పురుషుడు చైతన్యం. ఇద్దరిమధ్య ఎక్కువ తక్కువన్న భేదాలు లేక విడదియ్యరాని అవినాభావ సంబంధం పెనవేసుకుంటుంది. ఇద్దరూ సంసార రథాన్ని నడపడానికి సహాయపడే చక్రాల్లాంటివారు. ఏ ఒక్క చక్రం ఇరుసు ఊడినా మొత్తం గమనమే కుంటుపడుతుంది. నువ్వు నాకు తోడుగా, నేను నీడగా ఈ జీవితకాలం కలిసి నడిచిపోదాం. మన జీవితపయనంలో కష్టాల సుడిగుండాలెదురైనా, దాటరానిఅగాథాలుకన్పించినా, కాలం చేదు మింగించినా, విధి ముళ్లు గుప్పించినా, పూలు విసిరినా అన్నిటినీ కలిసి పంచుకుని చిర్నవ్వుతో మన ప్రయాణం సాగిద్దాం. నువ్వు నా ఆత్మవి. నేను నీ ప్రాణాన్ని. నువ్వు నామనసువి, నేను నీ మనుగడను" రవి కంఠంలో ఓ విధమైన ఆర్ద్రత, భావస్ఫూర్తి, కొంచెం ఆవేశం మిళితమైనాయి.

విద్య పూర్తిగా ఆకంఠంలో తొణికిసలాడే భావాలకు చలించిపోయింది. "రవీ! ఇంక నాకేం చెప్పొద్దు. నా నిండు జీవితం నీ పాదాలముందు పరిచి నేను కలిసి ప్రయాణం చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను" అతడి తల్లో వేళ్లుంచి నిమిరింది.

రవీంద్ర కాస్త విసురుగా–"అలాంటి మాటెప్పుడూ అనకు. నీ జీవితం నా పాదాలముందు పరిస్తే నాలోని పురుషాహంకారం దానిమీదే నడిచిపొమ్మని నన్ను ప్రోత్సహించొచ్చు. అలాంటి ఆలోచనలు విడిచిపెట్టు. నీ జీవితాన్ని నాతో పెనవెయ్యి" అంటూ మృదువుగా ఆమెను తన హృదయంలో ఇముడ్చుకున్నాడు.

ఆ తరువాత విద్యకు కొన్ని గంటలసేపు కాలం ఆగినట్టయింది. ప్రాణంలేని శిలకు చైతన్యం వచ్చినట్టు, నిశ్చల సాగరంలో రాగతరంగాలు ఎగిసిపడ్డట్టు, నింగిలోని హరివిల్లు నేలమీదకు దిగినట్టు అన్పించింది.

తెలతెలవారుతుండగా పచ్చని తివాసీలాంటి పచ్చగడ్డిమీద పడుకున్న రవీంద్ర తన గుండెలమీద సర్వం మర్చి నిద్రపోయిన విద్యను మృదువుగా తట్టి లేపుతూ–"లోపలికి పోదాం పద విద్యా! పనివాళ్లు రావచ్చు" అన్నాడు.

కళ్లు తెరిచిన విద్యకు రవీంద్ర ముఖంలోకి సూటిగా కళ్ళెత్తి చూడాలంటే సిగ్గుతో కళ్లు అరమోడ్పులయ్యాయి.

* * *

రవీంద్ర వెంటే స్కూటర్ దిగి లోపలికొస్తున్న ఆ ఇద్దర్నీ క్వశ్చన్ మార్కు ముఖాలతో తెల్లబోయి చూశారు ఆఫీసు స్టాఫంతా. రవీంద్ర వాళ్ళ ఆశ్చర్యాన్ని గమనించనట్లే అందరిసమక్షంలో, "డియర్ ఫ్రెండ్స్! మన ఆఫీసులో పనిచేసే ఈ విద్యను నిన్ననే రిజిష్ట్రారు ఆఫీసులో మేరేజ్ చేసుకున్నాను. మా మేరేజ్ సందర్భంగా ఈరోజు సాయంత్రం అప్సరాలో మీ అందరికీ చిన్న పార్టీ ఇవ్వాలనుకున్నాం. మీరంతా ఆ పార్టీకి రావాలని మా ఇద్దరి తరఫునా నేను రిక్వెస్టు చేస్తున్నాను. మరో చిన్న రిక్వెస్టు. బహుమతులు ఎవరు తెచ్చినా స్వీకరించబడవు" అని రవీంద్ర చెప్పగానే అంతా ఉత్సాహంగా చప్పట్లు కొట్టారు.

రవీంద్ర ఆఫీసు రూమ్‌కు వెళ్లేట






విద్య తన సీట్లోకి వెళ్ళి కూర్చుంది. నళిని, సరళ ఆమెను చుట్టుముట్టి- "హార్టీ కంగ్రాచ్యులేషన్స్ విద్యా!" అంటూ అభినందించారు.

"థాంక్స్" విద్య చిర్నవ్వు చిలకరించింది.

"పెళ్ళయ్యాక కూడా జాబ్ చేస్తారా?" సరళ అడిగింది.

"లేదు. రిజిగ్నేషనిచ్చేస్తాను"

"నిక్షేపంలాంటి జాబ్ వదులుకోడమెందుకు? స్త్రీ ఎప్పుడూ ఆర్థికంగా తన బతుకు బతగ్గలిగితేనే పురుషుడు ఆమెకు కాస్తో కూస్తో విలువ ఇస్తాడు. నీ క్షేమం కోరి చెప్తున్నా జాబ్‌కు రిజైనివ్వకు" నళిని సలహా ఇచ్చింది.

"స్నేహితురాలిగా నా మేలుకోరి ఇచ్చిన సలహాకు కృతజ్ఞతలు. కాని నీ సలహా పాటించలేకపోతున్నందుకు మన్నించు. ఆయనకు నేను జాబ్ చెయ్యడం ఇష్టంలేదు. ఆయన అభిరుచుల కనుగుణంగా నడవాలన్నదే నా అభిప్రాయం" అంది విద్య.

"ప్రతి విషయంలో వాళ్ళ ఇష్టాలనే ఉచ్చులతో మనను బంధించి ప్రాణంలేని బొమ్మను చేసిపారేస్తారు మగాళ్ళు. అసలే నువ్వు నోరులేనిదానివి. నువ్వింకా జాగర్తపడాలి'' అంది నళిని.

"ప్లీజ్ నళినీ! అలా మాట్లాడకు. ఒకరి అభిప్రాయాలు మరొకరు మన్నించి బతకడం మంచిది. స్త్రీ వంటింటి కుందేలు కాదని, ఆమెకు స్వేచ్ఛనివ్వాలని ఈ సంఘంతో పోట్లాడింది మగాడేగదా! సతీ సహగమనం లాంటి మూర్ఖ సంప్రదాయాలను,బాల్యవివాహంలాంటి అనాచారాలను రూపుమాపి వితంతువులకు నుదుట బొట్టు

ప్రసాదించింది పురుషుడేగదా! స్త్రీల ఉనికిని సుస్థిరంచేసేది ఆర్థిక సంపత్తికాదు ఆమెలో నిండుకున్న అనురాగ సంపదే" అంది విద్య.

నళిని చిన్నబుచ్చుకుని, "నీకింత వెర్రి ఉందని నాకు తెలియదు. నీ జీవితం నీ ఇష్టం. ఎంతయినా నువ్వు తెలివైన దానివి" వ్యంగ్యంగా అంది.

విద్య అంతటితో ఊరుకుంది.

సాయంత్రం రిసెప్షన్ బాగా జరిగింది. ప్రజంటేషన్స్ తీసుకురావడానికి ఎవరూ సాహసించలేదు. నళిని వెండి కుంకుమ బరిణె, సరళ పూజదగ్గర ఊదొత్తులు వెలిగించే వెండికుందె తెస్తే ఆ రెండు కానుకలు మాత్రం కాదనలేక తీసుకుంది విద్య.

పార్టీకి భాను, సరిత, విమలకూడా వచ్చేరు. పార్టీ ముగిశాక ఒక్కొక్కరే నవదంపతుల దగ్గర వీడ్కోలు తీసుకున్నారు. భానుమూర్తి ఫేమిలీ మెంబర్సే మిగిలారు.

"రవీ! రేపంతా మీరిద్దరూ మాతో గడపాలి. లంచ్,డిన్నరుకూడా మాతోనే" విమల ఆహ్వానిస్తూ అంది.

"తప్పకుండా వస్తాం ఆంటీ!" ప్రామిస్ చేశాడు.

"అన్నయ్యా! వదిన్ని మాతో ఇప్పుడే తీసుకెడతాం. నువ్వు మాత్రం రేపు ఉదయంరా" అంది సరిత.

రవీంద్ర జాలిగా విద్యవైపు చూసి, "మీ వదిన వస్తానంటే అలాగే తీసుకెళ్లు" అన్నాడు.

"కళ్ళతో వద్దని ఆజ్ఞ జారీచేసి పైకి మాత్రం వెళ్ళమంటే తనెలావస్తుంది?" సరిత చుసరుసలాడింది.





రవీంద్ర హతాశుడయ్యాడు. వారిద్దరి తగవు చూసి విద్య నవ్వుకుంది.

"దానిమాటలకేం రవీ! ఇకమేం వెళ్లమా" అంది విమల.

"అలాగే ఆంటీ!" అని వారిని ఆటో ఎక్కించాక హోటల్లో మిగిలినపనులు పూర్తిచేసుకుని ఇంటికెళ్ళేసరికి రాత్రి ఎనిమిదయింది,

అలసటవల్ల వడిలిన గులాబీలావున్న విద్యను జాలిగా-చూసి "చాలా అలసిపోయావుకదూ" అన్నాడు.

"అదేంలేదు. మీరు వెంటవుండగా సప్తసముద్రాలు ఈదమన్నా నేను రెడీ అంటాను" విద్య నవ్వుతూ అంది.

"బాబోయ్! ఆపని నావల్లకాదు. సప్త సముద్రాలు ఎలాగూ ఈదలేను గానీ బాత్‌రూమ్‌లో కాస్త చన్నీటిలో ఈదితే ఈ బడలిక తగ్గుతుంది" అంటూ టవల్ తీసుకుని బాత్‌రూమ్‌కు వెళ్లాడు రవీంద్ర.

భోజనంచేశాక బెడ్‌రూమ్‌లోకొస్తూనే గుప్పుమన్న మల్లెల గుబాళింపుకు ఉక్కిరిబిక్కిరవుతూ గదిలో లైటు వెలిగించి అప్రతిభుడయ్యాడు.అతడి వెనుకే లోపలికొచ్చిన విద్య మంత్రించిన బొమ్మలా నిలబడ్డది. మంచం అందంగా మల్లెల మాలలతో అలంకరించివుంది. తెల్లటి దుప్పటిమీద ఒత్తుగా చల్లిన మల్లెలు అరవిరిసి మత్తును జల్లుతున్నాయి. టేబుల్‌మీదున్న కుందెలో అగరవత్తులు గుచ్చివున్నాయిగాని ఇంకా వెలిగించలేదు. రవీంద్రకి అలంకరణంతా ఎవరు చేశారో అర్థంకాలేదు. చటుక్కున బయటికొచ్చి 'రాఘవులూ' పిల్చాడు.

"అయ్యా....వస్తున్నా!" ఆ పిలుపు కోసమే ఎదురుచూస్తున్న వాడిలారాఘవులు పాలగ్లాసుతో ప్రత్యక్షమై, "తీసుకోండి" అని అందిస్తుంటే తెల్లబోతూ, "నిన్ను

పాలెవరు తెమ్మన్నారు?" అడిగాడు రవీంద్ర.

"సరితమ్మగారు" చెప్పేసి తప్పు చేసినట్టు నాలుక కొరికాడు.

"సరిత మనింటికొచ్చిందా?" అడిగాడు ఆశ్చర్యంగా.

"సరితమ్మగారు ఆళ్ళ స్నేహితుల్ని వెంటబెట్టుకుని నాలుగ్గంటలకే వచ్చారండి! ఆ గదంతా ఆళ్ళే అలంకారంచేశారు. మీరు ఇంటికొచ్చేక పాలగ్లాసు పట్టుకెళ్ళి ఇమ్మని సరితమ్మగారే చెప్పారండి"

"సరే...నువ్వెళ్ళు" పాలగ్లాసందుకుని రాఘవుల్ని పంపేసి రవీంద్ర గదిలో కొచ్చాడు. అప్పటికే విద్య కుందెలో ఉన్న అగరొత్తులు వెలిగించింది.

"సరిత ఒట్టి చిలిపిపిల్ల విద్యా!''

''కాదు. స్నేహపాత్రురాలు" విద్య అంది.

పడక మీదకు చేరినతరువాత, "విద్యా! నీకోసమని ఓ చిరుకానుక తెచ్చాను" అన్నాడు రవీంద్ర.

"మీ హృదయాన్నే నాకు కానుకగా ఇచ్చారు. ఇంక వేరే కానుక ఎందుకు" విద్య కంఠం అనురాగంగా పలికింది.

''అలా వీల్లేదు. మొదటిరోజు మన సమాగమానికి గుర్తుగా నిన్ననే ఇవ్వాలని పట్టుకొచ్చి ఇవ్వడం మర్చిపోయాను'' అంటూ జేబులోనుండి చిన్న పెట్టెతీసి అందులోనున్న ముత్యపుటుంగరం ఆమె వేలికి తొడిగాడు.

''మీ ప్రేమ వర్షంలో నన్ను పునీతం చేస్తున్నారు. ఏమిచ్చి మీ రుణం తీర్చుకో గలను" తన్మయత్వంగా అంది విద్య.

ఆమె చేతిని ముద్దు పెట్టుకుని - "నా రుణం ఎలా తీర్చాలో చెప్తాగా" అంటూ ఆమెను హత్తుకున్నాడు రవీంద్ర.

* * *

నిప్పులు చెరిగే కళ్ళతో గుమ్మంలో నిలబడ్డ మీనాక్షిని చూడగానే తన గొంతు తడారిపోయింది. అయినా చిర్నవ్వు ముఖాన పులుముకుని– ''ఇదేనా రావడం? మామయ్యకూడా వచ్చారే! రండి లోపలకు!" ఆహ్వానించింది.

"లోపలకు రమ్మనడానికైనా నీకు సిగ్గెయ్యడం లేదటే! నీ ముఖానికి పెళ్ళి, పేరంటం తక్కువొచ్చిందా అని అడగ డానికొచ్చేను" మీనాక్షి గొంతు గరగర లాడింది.

"అత్తయ్యా? బయటి అల్లరొద్దు. దయుంచి లోపలికొచ్చేక మాట్లాడు కుందాం'' ప్రాధేయతగా అంది విద్య.

"అవును మీనాక్షీ! లోపలికి నడు. బయటే ఎందుకు రభస" మీనాక్షి భర్త రామచంద్రరావు అన్నాడు. మీనాక్షి అయిష్టంగానే లోపలికొచ్చింది.

టిఫిన్, కాఫీ రెడీ చెయ్యమని రాఘవులికి చెప్పి విద్య మళ్ళీ గదిలో కొచ్చేలోపుగా మీనాక్షి చురుగ్గా ఇల్లంతా కలియచూసింది. విద్యకు పట్టిన అదృష్టానికి మీనాక్షి ఒళ్ళంతా కారం రాసుకున్నట్టు భగ్గుమంది.

"ఇప్పుడు చెప్పండి మామయ్యా! నా ఉత్తరం ఎప్పుడందింది?'' విద్య వారికెదురుగా కూర్చుని అడిగింది.

"ఉదయమే అందిందమ్మా! అది చూడగానే ఇలా బయల్దేరి వచ్చేశాం" చెప్పాడు రామచంద్రరావు.

"నువ్వు చేసినపనికి మా పరువు గంగపాలయింది. ఇక వీధిలో మేము ముఖమెత్తుకు తిరగకుండా చేశావు" మీనాక్షి అంది.

"అంత పరువుతక్కువ పని నేనేం

చేశాను? చట్టబద్ధంగా నాకు నచ్చిన వ్యక్తిని పెళ్ళిచేసుకోడం నీ దృష్టిలో పరువుతక్కువ పనిలా తోచిందా!" విద్య దెబ్బతిన్న హృదయంతో అంది.

"నువ్వు అతణ్ని మోసగించావు"

"లేదు. నా విషయమంతా ఆయనకు తెలుసు. తెలిసే నన్ను పెళ్ళిచేసుకున్నారు"

"తెలుసా...?" మీనాక్షి కళ్ళు ఆశ్చర్యంతో వెడల్పయ్యాయి. "తెలిసీ చేసుకున్నాడంటే అతడొట్టి చవటేనా అయ్యుండాలి లేదా వయసు దాటినవాడేనా అయ్యుండాలి" అంది మీనాక్షి.

"విద్యా! చాలా తొందరపడ్డావమ్మా! ముందుముందు నీ పెళ్ళివల్ల ఎన్ని సమస్యలెదురవుతాయో ఆలోచించావా?" రామచంద్రరావు అన్నాడు.

"పదేళ్ళనుండి ఏ సమస్యాలేంది ఇక ముందు ఎదురవుతాయనుకోను. అదే ధైర్యంతో కోరివచ్చిన అదృష్టాన్ని అందుకున్నాను" విద్య నిబ్బరంగా అంది.

"నీకా మనోనిబ్బరం ఉంటే ఇక మేము చెప్పేదేముందిలే" అంతటితో ఊరుకున్నాడు.

"నీ గురించి చేసిన అప్పులెలా తీరుతాయనుకుంటున్నావు?" మీనాక్షి అసలు విషయానికొచ్చింది.

విద్య తెల్లబోయింది. "నాగురించి అప్పులు చేశారా?" నమ్మలేనట్టు అంది.

"ఏం...అలా తెల్లబోతావేం! నిన్ను అప్పగించినప్పుడు మీ అబ్బ మాకు ధనరాశులిచ్చిపోలేదు. ఐదేళ్ళపిల్లని ఇంత దాన్ని చేశాను" మీనాక్షి మాటలకు విద్య మాట్లాడలేకపోయింది.

వాళ్ళు టిఫిన్ తింటుండగానే "విద్యా" అంటూ రవీంద్ర లోపలికొచ్చి గదిలోకి రాబోతూ హాల్లోనే ఆగిపోయాడు.

"రండి. మా అత్తయ్య, మామయ్యే" రవీంద్రను లోపలికి పిల్చింది విద్య.

రవీంద్ర లోపలికొచ్చి "నమస్కారమండి" నమస్కరించాడు.

రవీంద్రను చూడగానే మీనాక్షికి టిఫిన్ మింగుడు పడలేదు. 'తను ముసలాడను కుందిగాని ఇంత పడుచు కుర్రాడను కోలేదు. పైగా ఎంత అందగాడు' మీనాక్షికళ్ళముందు పెద్దల్లుడు, చిన్నల్లుడు కదిలారు. వాళ్ళిద్దరూ రవి అందం, అంతస్తు ముందు దిగదుడుపే. 'ఈ పీనుగకి ఎంత అదృష్టం పట్టింది' మీనాక్షి మనసు అసూయతో భగ్గుమంది. తన భావాలు కప్పిపుచ్చుకుంటూ - "మిమ్మల్నెలా పొగడాలో తెలియడంలేదు బాబూ! ఎంత కట్నంపోస్తే నీలాంటి అబ్బాయిని తెచ్చి మా విద్యకు పెళ్ళి చెయ్యగలం. చిన్నవాడివైనా నీకు చేతులెత్తి దణ్ణం పెట్టాలనిపిస్తుంది" అంది మీనాక్షి.

ఆమె మనస్తత్వం విద్య ఎరిగున్నదే కాబట్టి గుంభనంగా నవ్వుకుంది.

"మీరలా పొగడకూడదు. నా మనసుకు నచ్చింది చెయ్యడమే తప్ప ఎవరికోసమో నన్ను నేను వంచించుకోను. విద్య నాకు నచ్చింది. చేసుకున్నాను. ఇది నా గొప్పతనం అని నేననుకోడం లేదు" అన్నాడు మోమాటంగా.

ఆరాత్రి గదిలోనుండి విద్య, రవీంద్రల నవ్వులు విన్పిస్తుంటే మీనాక్షి హృదయం భగ్గుమంది. అయిదేళ్ళ వయసులో విద్య తల్లిని, తండ్రిని పోగొట్టుకుని తాతగారి చెయ్యిపట్టుకుని బితుకు బితుకుమంటూ మేనమామ ఇంట్లో కాలుపెట్టింది. మేనత్త పెట్టే శాపనార్థాలకు, చెప్పే పనులకు, పెట్టే అరళ్ళకు బాగా అలవాటుపడి




పోయింది. మేనమామ కూతుళ్ళవే చిరిగిన గౌనులు తొడుక్కుని కళ్ళల్లో దుఃఖాన్ని నింపుకుని దీనావస్థలో ఉండేది. 'అదేమిటో! చిన్నప్పుడుకూడా ఆ చిరిగిన బట్టల్లోను, చింపిరితలతోనూ ఉన్నా ముఖంలో చక్కటి కళ ఉండేది. తన కూతుళ్ళు మంచి బట్టల్లో, నగలు సింగారించుకున్నా దానిముందు వెలవెల పోతుండేవారు. ఆ అందం చూస్తే తన మనసు అసూయతో మండిపోయేది. అందుకే దాన్ని దురదృష్టంలో పడెయ్యాలన్నా, దాని రాతలోవున్న అదృష్టం ఇప్పటికీ రక్షిస్తూనే వుంది. అందుకే ఈనాడు ఓ ఆఫీసరు హోదాలోవున్న వాడికి, అపురూపంగా చూసుకునే మంచి మనసున్న అందగాడికి పెళ్ళామయింది' మీనాక్షి అసూయతో వేగిపోయింది.

ఈర్ష్యాసూయలు మనిషిలో అంతర్గతంగా దాగివున్న రాక్షసులు. అవిహృదయంలో జనిస్తే మనిషి తన స్థాయినుండి అధమస్థాయికి జారిపోతాడు. ఎంతటి నైచ్యానికైనా వెనుదీయడు. మీనాక్షి ప్రస్తుతం అదే స్థితిలో వుంది.

మర్నాడుదయం రవీంద్ర ఆఫీసుకు వెళ్ళాక విద్య మీనాక్షివున్న గదిలో కొచ్చింది. "అత్తయ్యా! నాకోసం అప్పులు చేశానన్నావుగా! ఇదిగో ఈ డబ్బుతో నీ అప్పులన్నీ తీర్చుకో" విద్య రెండు నోట్ల కట్టలు మీనాక్షి ఒడిలోకి విసిరింది. ఆ నోట్లు చూడగానే మీనాక్షి కళ్లు మెరిశాయి.

"ఎంతే ఇది?'' అడిగింది.

"రెండు వేలు!" మీనాక్షి ముఖం లేవనే లేదు. అది గమనించిన విద్య "చాలు! నాకోసం ఓ పదివేలో, పాతికవేలో అప్పు చేశానని నువ్వు చెప్పినా నమ్మను. నేనెలా పెరిగానో నీకు జ్ఞాపకం లేక పోవచ్చు. నాకు మాత్రం గుర్తే" అంది.

"అంటే ఏమిటే నీ ఉద్దేశం? నీ ఆలనా పాలనా నేను చూడకుండా నువ్వు గాలికి ధూళికి పెరిగావా?" మీనాక్షి అంది.

"అత్తా! ఒక్కనాడైనా నాకు కొత్త బట్టలు కుట్టించేవా? తలకుపూర్తిగా నూనె అయినా పెట్టుకోనిచ్చేదానివా? కడుపునిండా భోజనం ఎప్పుడైనా పెట్టేవా? చదువుమీద శ్రద్ధవున్నా ఖర్చుపెట్టలేనంటూ చదువు మాన్పించేవు. ఆ తరువాతయినా తాత బలవంతంమీద,మా ఇల్లు అమ్మగావచ్చిన డబ్బు నీ చేతికిస్తే, చదివించడానికి ఒప్పుకున్నావు. ఆ డబ్బయినా పూర్తిగా నా చదువుకుపయోగించావేమో గుర్తుచేసుకో! డబ్బు పంపకుండా నన్ను నానాఇబ్బందీ పెట్టేదానివి. నా లక్ష్యమంతా చదువుమీదే ఉండేదికాబట్టి ఓ పూట తిండితిన్నా చదువుని నిర్లక్ష్యం చెయ్యకుండా డిగ్రీ తెచ్చుకున్నాను. మరొకరెవరైనా అయితే నువ్వు డబ్బు పంపకుండా ఏడ్పించినందుకు చదువుకు సగంలోనే ఫుల్‌స్టాప్ పెట్టి ఇంటికి పరుగెత్తేవారేమో! ఇక ఉద్యోగం వచ్చినప్పట్నుండి మొన్నటి వరకూ నెలనెలా ఇంటిఖర్చులకు డబ్బు పంపుతూనే వున్నాను.

"ఇలా అంటున్నందుకు నిన్నేదో దెప్పి పొడుస్తున్నానని ఏయదాటేక తెప్పతగలేసే కృతఘ్నురాలినని అనుకోకు. సహనానికయినా పరిమితి ఉంటుంది. నేనూ మనిషినే కాని డబ్బుకూర్చే యంత్రాన్ని కాను. ఈ రెండు వేలు అయినా నా కష్టార్జితం కాబట్టి ఇలా ధైర్యంగా ఇవ్వగల్గుతున్నాను. నువ్విటుపైన అడిగితే నాదంటూ పైసా కూడా నాదగ్గరలేదు. ఆయన్నడిగి ఇవ్వడం నాకు ఇష్టముండదు.

నాదగ్గర అతిథిగా ఉండడానికయితే ఎప్పుడయినా రావచ్చు. మీ ఇద్దరికీ ఈ ఇంట్లో అడ్డులేదు. డబ్బుకోసమే అయితే అసలు రానక్కరలేదు" ఖండితంగా చెప్పేసింది విద్య.

మీనాక్షి ముఖం నయాపైసంతయింది. రామచంద్రరావుమాత్రం సంతోషించాడు విద్య ధైర్యం చూసి.

'దీని ఆశకు అంతులేదు' అని పెళ్లాం మీద చెప్పలేని కోపం వచ్చినా గుక్కిళ్లు మింగాడు.

సాయంత్రం వరకూ ముళ్ళమీద గడిపినట్టే గడిపి వెళ్ళిపోయారు-మీనాక్షి, రామచంద్రరావులు.

"ఇల్లు ఇంత నిశ్శబ్దంగా ఉంది మీ వాళ్ళు వెళ్ళిపోయారా?" రవీంద్ర ఇంటికి వస్తూనే విద్యనడిగాడు.

"ఆ...వెళ్లారు" ముక్తసరిగా అంది.

"అప్పుడే వెళ్లారా! రెండురోజులుండ మనకపోయావా?"

"ఎందుకు? వదిలిన రెండువేలకు వడ్డీయా?"

"అవేం మాటలు! పోనిద్దూ ఎంతయినా వాళ్లు నిన్ను పెంచి పెద్దచేశారు" రవీంద్ర అన్నాడు.

"అలాగని ఇప్పటివరకూ ఆమె ఆగడాలు సహించాను. ఇక భరించే ఓపిక నాకులేదు. ఈ బంధాన్ని ఇప్పటికయినా తెంపుకోకపోతే సంవత్సరమంతా కష్టపడి పోగుచేసిన డబ్బుకాస్తా నీళ్లొదులుకోవలసిందే. అదో ఆశాపిశాచం. పాపం, మామయ్య మంచివాడేగానీ నోరులేనివాడు" అంది విద్య.

"వింత వింత ప్రవృత్తులుగల మనుషులు మనమధ్య ఉన్నారు విద్యా!"

"మీకున్నంత సహనం నాకు లేదు. లెండి" విద్య టీ తేవడానికి లోపలికెళ్లింది.

"మీవాళ్ళ గొడవలోపడి అడగడమే మర్చిపోయాను. దేవిగారు ఎక్కడికో వెళ్ళడానికి రెడీ అయినట్టున్నారే!" విద్య చేతిలో టీకప్పు అందుకునిఆమెకట్టుకున్న చీరవంకా, చేసుకున్న అలంకరణను చూశాడు.

"ఈరోజు సరిత ఇంటికి వెడదామనుకున్నాంగా! మర్చిపోయారా?" గుర్తు చేసింది.

"పోనీవోయ్! ఈరోజు నాకెక్కడికీ వెళ్లాలని లేదు. చాలా బద్ధకంగా ఉంది. స్నానం చేసొస్తాను. ఇద్దరం కబుర్లు చెప్పుకుందాం" అన్నాడు.

"మీ ఇష్టం" అంటూ విద్య లోపలికి వెళ్ళబోతుంటే "విద్యా! చెప్పడం మర్చిపోయాను. రేపు మనం ఊరెడుతున్నాం" చెప్పాడు రవీంద్ర.

"ఏ ఊరు?"

"మా ఊరే! మీవాళ్ళు రావడం మనను చూసి వెళ్ళడం జరిగింది. ఇక మా నాన్నగారి దగ్గరకు నిన్ను తీసుకెళ్ళి 'ఇదిగో మీ కోడలు అని' చూపించి ఆశీసులందుకుని వస్తే మనకు లైసెన్సు దొరికినట్టే. ఆ తరువాతే మన హనీమూన్ ట్రిప్పు"

"హనీమూన్ ట్రిప్పా?" వింతగా చూసింది.

"అవునోయ్... హనీమూన్ ట్రిప్పే! అంతగా ఆశ్చర్యపోతావేం?"

"హాయిగా ఇంట్లోనే కాలం గడపక ఆ ప్రయాణంరద్దీ, తిప్పట ఎందుకు చెప్పండి" విద్య బతిమాలుతూ అంది.

"నీకేంయాతనలేకుండా తీసుకెడతాలే"

"యాతనమాట అటుంచి డబ్బు విషయం ఆలోచించండి. వృథాగా ఎంత డబ్బు ఖర్చవుతుందో తెలుసా?" విద్య





అడిగింది.

"అదా అసలు కారణం. ఎంతయినా ఆడబుద్ధి పోనిచ్చుకున్నావు కాదు. భవిష్యత్తేమవుతుందో, ఎలా ఉంటామో తెలియదు. నిన్న జరిగిన కాలాన్ని చేతుల్లోకి తిరిగి తెచ్చుకోలేవు. వర్తమానమే మనకు అనుభవంలో ఉండి అనుభూతి నిచ్చేది. అటువంటపుడు వర్తమానంలో ప్రతిక్షణాన్ని తియ్యనిస్మృతిగా మిగుల్చుకోవాలి. ఆ క్షణాలు గతంగా మారేక వెనుతిరిగి చూసుకుంటే మన హనీమూన్ ట్రిప్పు నీకెంత సంతోషం కలిగిస్తుందో ఏదొక రోజున నువ్వే నాకు చెప్తావు. అందుకే డబ్బు ఖర్చు అని లెక్కలు వెయ్యక నాతో పాటు బయల్దేరు. లైఫ్ ఎంజాయ్ చేద్దాం" అన్నాడు.

"అలాగే... మీరు ప్రపోజ్ చేశాక కాదనే ధైర్యం మీ విద్యకుందా"

"అదిగో అదేవద్దు. నాకోసం నువ్వు బలవంతంగా బయల్దేరక్కర్లేదు. నీకిష్టమైతేనేరా" రవీంద్ర విసురుగా లేచాడు.

"ఇదంతా కోపమేనా? అన్నమాటను ఉపసంహరించుకుంటున్నాను అంటే సరిపోతుందా, లేక అపాలజీ కూడా చెప్పాలా?" అతడి చెయ్యి పట్టి ఆపుతూ అంది విద్య.

"అపాలజీ చెప్పాల్సింది ఈ సమయంలో ఇక్కడకాదు" వెక్కిరింతగా అని రవీంద్ర బాత్‌రూమ్‌కు వెళ్ళాడు.

* * *

రవీంద్ర తండ్రి సుబ్రహ్మణ్యం విద్యను బాగానే ఆదరించాడు. తనకు పాదాభివందనం చేసిన దంపతులను నిండు మనసుతో ఆశీర్వదించాడు. అది కాస్త పాత ఇల్లే అయినా శుభ్రంగా ఉంది. సుబ్రహ్మణ్యానికి దూరపు బంధుత్వమున్న ఏకాకి అలివేలు ఇంటిని చక్కదిద్ది ఆయనకు వండిపెడుతూ మంచిచెడ్డలు చూస్తోంది.

సరోజ పెళ్ళికని అమ్మగా మిగిలిన ఆరెకరాల పొలం మీద వచ్చే ఆదాయంతో నిశ్చింతగా కాలం వెళ్ళబుచ్చుతున్నాడు సుబ్రహ్మణ్యం. ఆధ్యాత్మిక చింతనలో మునిగిన ఆయన ఇతర విషయాలేమీ పట్టించుకోడు. వేళకింత తిండి తిని భగవద్గీతో, రామాయణమో ముందేసుకుని కాలాన్ని ఇట్టే గడిపేస్తాడు. మిన్ను విరిగి మీద పడుతున్నా తనకు పట్టనట్టే నిర్వికారంగా ఉంటాడు. ఆయన వ్యక్తిత్వమే రవీంద్ర పుణికి పుచ్చుకున్నాడనిపించింది విద్యకు.

విద్య అక్కడున్న రెండురోజులూ మామగారి మంచిచెడ్డలు కనుక్కుంటూ, రవి వెంట నీడలా తిరిగి బాధ్యతల్ని పంచుకోడం చూసి ఆయన ముచ్చట పడ్డాడు. కొడుకు తగిన ఇల్లాలినే చేపట్టినందుకు మనసులో అభినందించాడు.

"మామయ్యా! మీరొక్కరూ ఇక్కడుండటం నాకేమిటో బాధగాఅన్పిస్తోంది. మీరూ మాతో వచ్చెయ్యండి" ఆయనతో అంది విద్య.

"జననీ జన్మభూమి అన్నారు. నేనిక్కడే పుట్టాను. ఇక్కడే పెరిగాను. ఇద్దరు బిడ్డల్ని కన్న నా భార్యను ఈ నేల తల్లికే అప్పగించాను. నా తనువు ఇక్కడే రాలిపోవాలిగాని నేనెక్కడికీ రాలేనమ్మా" మృదువుగా చెప్పాడు.

విద్య ముఖం చిన్నబుచ్చుకుంటూ- "చెట్టంత కొడుకు, కోడలు ఉండి కూడా ఎవరూ లేనట్టు ఇలా ఒంటరిగా ఉండటం ఎంత దుర్భరం'' అంది.

విద్య వైపు వాత్సల్యంగా చూసి

"బాధపడకమ్మా! నా చాదస్తాలతో మీ మనసుల్ని నొప్పిస్తున్నాను. సరే! ఓ మనుమణ్నివ్వు వాడికోసమైనా మీ దగ్గర కొచ్చేస్తాను'' చిర్నవ్వుతో అన్నాడు.

విద్య ముఖం పున్నమి జాబిలిలా వికసించింది. "మంచి షరతు విధించారు మామయ్యా" అంది.

మూడోరోజున ఇద్దరూ వచ్చేశారు. ఇరవైరోజులపాటు సెలవుపెట్టి హనీమూన్‌కు బయల్దేరారు. ముందుగా సింహాచలంతో ప్రారంభించి అటు అరకులోయ, శ్రీకూర్మం చూసి ఇటు నాగార్జునసాగర్‌కి బయల్దేరారు. అదయ్యేక అమరావతి గుహలు చూసి తిరిగివస్తూ విజయవాడలో ఆగి విద్య బలవంతం మీద దుర్గ దర్శనం చేసుకుని ఇంటికొచ్చేరు. ఇరవై రోజులు ఇరవై క్షణాల్లా గడిచిపోయాయి. ఈ ఇరవైరోజుల్లో తమ అనుబంధం మరింత గాఢంగా అల్లుకుపోయినట్టు తోచింది. ఈ అనుభూతిని మిగిల్చిన రవికి తనెంతో రుణపడి ఉన్నాననుకొంది.



**7**

ఇంటికొచ్చేసరికి సరోజనుండి ఉత్తరం వచ్చి ఉంది. రవీంద్ర ఉత్తరం విప్పి చదివాడు.

"అన్నయ్యా!

వదినా, నువ్వూ హనీమూన్‌కు వెడుతున్నామని రాశావు. ఈపాటికి తిరిగి వచ్చే ఉంటారనుకుంటాను. ఇటువంటి ప్రయాణాలు కొత్త దంపతులకు చాలా అవసరం. ఒకరి మనసు ఒకరు చదవడానికి, ఒకరి అభిరుచులు మరొకరు తెలుసుకుని జీవితం కొనసాగించడానికి ఆ ఏకాంతం ఎంతయినా ఉపకరిస్తుంది. మీ హనీమూన్ ట్రిప్పు మీ ఇద్దర్నీ మరింత సన్నిహితుల్ని చేసి ఉంటుందని నా నమ్మకం.

అన్నయ్యా! ఓ విశేషం చెప్పమంటావా? నీ చిన్నారిచెల్లి త్వరలోనే నీ చెవులు మెలేసే ఓ మేనల్లుణ్ని ఇవ్వతోంది. ఈ వార్తవిని నువ్వెంత పొంగిపోతావో నాకు తెలుసు. నీ చెల్లిలో ఆ సంతోషాన్ని పంచుకోవాలని పరుగెత్తుకొస్తావు. కాని నువ్విప్పుడు రావద్దు. నువ్వొచ్చి నన్ను పంపమని అడిగినా వాళ్లు పంపరు. నువ్వు చిన్నబుచ్చుకోడం నేను భరించలేను. నేను మళ్ళీ వీలుచూసుకుని లెటర్ రాస్తాను. ఆ లెటర్ చూసేకరా.

మీ ఇద్దరి దాంపత్యాన్ని కొన్నాళ్లు దగ్గరుండి తనివితీరా చూడాలని నా మనసు కొట్టుకుంటోంది. కాని కొన్ని అనుభూతులు తీర్చుకునే అదృష్టం అందరికీ లభించదు. నీ నుండి లెటర్ కోసం ఎదురుచూస్తుంటాను. వదినను అడిగానని చెప్పు"

ఆ ఉత్తరం చూసి రవీంద్ర ఎంత సంతోషించాడో అంతగానూ ఆవేదన చెందాడు. "విద్యా...ఇది విన్నావా!సరోజ త్వరలోనే మనకు మేనల్లుణ్ని అందివ్వబోతోంది" విద్యతో ఈ వార్త చెప్పేవరకూ అతడి మనసు ఆగలేదు.

"నిజంగానా! అయితే మనం రోజా దగ్గరకు వెడదాం.చూసి వెంటనేవచ్చేద్దాం" అంది విద్య.

"వద్దు విద్యా! అది రావద్దని రాసింది"




"ఎందుకని?"

"విద్యా! పారిజాతపుష్పాన్ని తెలియక వజ్రాలగని అని భ్రమపడి ముళ్ళ డొంకల్లోకి విసిరేశాను. ఆ ముళ్ళ తాకిడికి ఆసున్నితహృదయం తూట్లుపడుతోంది. మంచిగంధంలాంటి మెత్తని మనసులో ఉన్నతభావాలు ఇగిరిపోయి ఆ హృదయం శిలాసదృశమయిపోతోంది" ఆవేదనగా అన్నాడు.

సరోజంటే భర్తకు ప్రాణమని తెలుసు. ఆ ఇద్దరి అనుబంధం విద్య ఎరిగున్నదే. రవీంద్ర మాటల్లో ఆర్ద్రతకు చలించిపోయింది విద్య. "బాధపడకండి. ఆ భగవంతుడు నిర్దయుడు. మంచి మనసులకే శిక్షవిధిసాడు" ఓదార్చింది.

రోజులు శరవేగంతో గడచిపోతు న్నాయి. విద్య తనవనే ఇష్టాలు, అభి రుచులు అన్నీ మర్చిపోయింది. రవీంద్ర ఎంత చెప్తే అంత. అతడి మాట ఆమెకు వేదవాక్కు. ఈ ప్రపంచమంతా రవీంద్ర మయంగా కన్పిస్తోందామె కళ్ళకు. 'సాయంత్రం నేనొచ్చేసరికి రెడీగా ఉండని' చెప్పివెడితే 'ఎక్కడికి, ఎందుకు?' అని ప్రశ్నలువెయ్యడం ఎప్పుడో మర్చిపోయింది. అతడొచ్చేసరికి అతడి అభిరుచికి తగ్గట్టు అలంకరించు కుంటుంది. తనముందు నిలబడ్డ విద్యవైపు ప్రసన్నంగా ఓ చూపుచూసి ఆమెను వెంటబెట్టుకు వెడతాడు. ప్రతిరాత్రీ వసంతరాత్రిగా మిగిలిందంటే అది విద్యలోవున్న ప్రత్యేకత, ఆకర్షణ అని రవికి తెలుసు. జీవితాన్ని పరిపూర్ణంగా అనుభవిస్తున్న తృప్తి ఒకరి సాహ చర్యంలో మరొకరికి లభించింది. విద్యను చూసినపుడు అతడి కళ్లల్లో రాగరుచులు



పొంగుతాయి. ఆ తాకిడికి విద్యమనసు మేఘాన్నిచూసి నర్తించే మయూరమై పోతుంది.

ఆరోజు సరోజనుండి వచ్చిన ఉత్తరం రవీంద్రను కలతపరిచింది. లెటర్‌చదివేక ఆఫీసులో ఉండలేక సెలవుపెట్టి ఇంటికి వచ్చేడు. రవీంద్ర ముఖంచూడగానే ఏదో జరిగి ఉంటుందని విద్య ఊహించింది. అతన్ని హాల్లోనే వదిలి మవునంగా లోపలికెళ్ళి పాలు వేడిచేసి హార్లిక్స్ కలిపి తెచ్చి అతడి చేతికిచ్చింది. గ్లాసందుకుని మాట్లాడకుండా తాగి అలసటగా సోఫాలో వెనక్కువాలాడు రవీంద్ర.

"ఏమిటలా ఉన్నారు? ఒంట్లో బావోలేదా?" మృదువుగా అడిగింది.

"విద్యా!" చటుక్కున ఆమె ఎదలో పసివాడిలా ముఖముంచాడు రవీంద్ర. ఎంతటి ధైర్యం, నిబ్బరం ఉన్నవాడైనా కొన్ని అత్యల్ప విషయాలకు కదిలిపోయే సున్నితమనస్కుడని విద్య గ్రహించింది. ఇప్పుడతడి మనసు ఎంతగా కలవరపడు తోందో ఊహించగల్గింది.

విద్య అతని తలను ఓదార్పుగా నిమిరింది. ఆమె అందించే ఓదార్పుతో కాసేపటికి సర్దుకోగలిగాడు. "విద్యా! రెండు జతల బట్టలుసర్దు. ఊరెళతాను" చెప్పాడు రవీంద్ర.

విద్య కళవళపడుతూ– "ఏ ఊరెళ తారు?" అడిగింది.

"సరోజ దగ్గరికి వెళ్ళాలి"

"నిజం చెప్పండి! అక్కడేం జరిగింది? మీ రెండుకలా ఎక్సయిటయ్యారు?" అడిగింది విద్య.

"సరోజకు అబార్షనయ్యింది. కాదు కాదు...ఆ రాక్షసులు మానసికంగా హింసించి నా చిట్టితల్లిని ఆ స్థితికి తెచ్చి ఉంటారు" కళ్ళు రక్తాన్ని చిమ్ముతున్నాయా అన్నంత ఎరుపుతో ప్రజ్వరిల్లాయి.

"ఆవేశపడొద్దు. సరోజను ఇక్కడకు తీసుకొచ్చే ప్రయత్నంచెయ్యండి. ఆడపిల్ల నిచ్చుకున్నచోట ఆవేశం అనర్థదాయకం. కోపంలో వివేకాన్ని కోల్పోవద్దు. సౌమ్యంగా వారికి నచ్చచెప్పి సరోజను వెంటబెట్టుకురండి" విద్య హితబోధ చేసింది.

"అలాగేలే" రవీంద్ర బట్టలు మార్చు కుని బాగ్‌తీసుకుని వెళ్ళిపోయాడు. విద్య అతడు దూరమయ్యేవరకూచూసి నిట్టూర్పు వదిలి లోపలికొచ్చింది. అతడు బట్టలు మార్చేటప్పుడు జేబులో కాగితాలు డ్రెస్సింగ్ టేబుల్‌మీద పెట్టాడు. ఆ కాగితాల్లోనుండి సరోజ రాసిన లెటరు వెదికితీసి చదివింది విద్య.

"అన్నయ్యా!

కారడవిలో చిక్కుకుని దారీతెన్నూ తోచక ఆక్రోశించే పసిదానిలా ఉంది నా స్థితి. అంధకారంలో దిక్కుతెలియక అల్లాడే గుడ్డిదానిలా నువ్వందించే చల్లని చేయూతకోసం తపించిపోతున్నాను. చిన్నప్పటిలా నీ భుజంమీద వాలి కళ్ళు మూసుకుని నా గుండెలో మండే మంటను చల్లార్చుకోవాలని తహతహలాడు తున్నాను.

అన్నయ్యా! నా హృదయంలో అగ్ని పర్వతాలు బద్దలై ఆవేదన లావాలాపొంగి పొంగివస్తోంది. మనసు మంటల్లోపడి మసైపోతోంది. నువ్వు వెంటనే రా! నన్ను రాక్షసులులేని లోకానికి తీసుకెళ్ళు. ఇక్కడే కొన్నాళ్ళుంటే నీ చెల్లెలి కుసుమ కోమల హృదయంలో మృదుత్వం నశించి కఠినశిలయిపోతుంది. స్త్రీ హృదయంలో మండే కార్చిచ్చు దావానలంలా ఎన్నో




హృదయాలను శాపగ్రస్తం చేసి దహిస్తుంది. అందుకే నాలో మానవత్వం నశించకముందే వచ్చి నన్ను తీసుకెళ్ళు.

నేను దురదృష్టవంతురాల్ని. కడుపులో బిడ్డను దక్కించుకోలేకపోయాను.

నీ రోజా''

విద్య ఆ లెటర్ చదివి కదిలిపోయింది. సరోజ ఏ పరిస్థితుల్లో ఉందో ఊహించ గల్గింది. ఆమెను చూడాలని విద్య మనసు ఆరాటపడింది.

మర్నాడు సాయంత్రానికల్లా రవీంద్ర సరోజను వెంటబెట్టుకుని ఇంటికొచ్చేడు. లోతుకుపోయిన కళ్లు, దుర్బలంగా వున్న శరీరంతో దీనంగావున్న సరోజనుచూస్తే విద్య హృదయం ద్రవీభూతమయింది. "రోజా" అంటూ చేతులు చాపితే, "వదినా...." అంటూ ఆమె చేతుల్లో పసిపిల్లలా ఒదిగిపోయింది సరోజ.

ఆ ఇద్దర్నీ చూసిన రవి కళ్లు చెమ్మ గిల్లాయి. "విద్యా! రోజా చాలా నీరసంగా వుంది. వెళ్ళి వేడివేడిగా ఏదయినా తాగ డానికి పట్రా'' రవీంద్ర ఆజ్ఞాపించగానే సరోజను సోఫాలో కూర్చోమని చెప్పి విద్య లోపలికెళ్ళింది.

సరోజ వచ్చి అప్పుడే రెండు రోజు లయింది. ఈ స్వల్ప వ్యవధిలోనే ఆ ఇద్దరి సాహచర్యంలో మానసికంగా కొంతవరకూ తేరుకోగల్గింది.

"రోజా! ఈరోజు సిన్మాకు వెడదాం" రవీంద్ర ఆఫీసుకెళ్ళేక సరోజతో అంది.

"మీరెళ్ళండొదినా! నేను రాను"

"వెళ్ళాలనుకుంటున్నదే నీకోసం. నువ్వే రాకపోతే మేమెందుకు?" విద్య అలిగినట్టు పెట్టింది పోజు.

"కోపం వచ్చిందా వదినా? ఏమిటో నాకు దేనిమీదా ఆసక్తిలేకుండాపోయింది'' సరోజ నిట్టూరుస్తూ అంది.

"ఆ నిరాశావాదం ఎందుకు రోజా? ఇంత చిన్న వయసులో అంత నిరుత్సాహం తగదు" మందలించింది.

"జీవితం అందరికీ వడ్డించిన విస్తరి కాదు. కొందరికి ఆనందాన్ని ప్రసాదిస్తే కొందరికి నిరాశ నిస్పృహలను మిగిలి స్తుంది" సరోజ అంది.

''ఈ వైరాగ్యం ఏమిటమ్మా?''

"వదినా! నోరులేని ఆ పక్షినిచూడు! అది సంతోషంగా గిరికీలుకొడుతూ, గంతులువేస్తూ కొమ్మల మీద ఉయ్యాల లూగుతోంది. దానికున్నపాటి ఆనందం అష్టయిశ్వర్యాలు అనుభవిస్తున్న నాకు లేదు. అంతెందుకు మా ఇంట్లో పనిచేసి బతికే మంగికున్న సంతోషంలో వెయ్యో వంతు నా జీవితంలో లేదు. వాళ్ళ బావ, అదీ ఒకరిమీద మరొకరు మనసుపడి పెళ్లి చేసుకున్నారట. వాడు రిక్షా తొక్కు తాడు. అది నాలుగిళ్ళల్లో పనిచేస్తుంది. అయినా దాని కళ్ళల్లో ఈ ప్రపంచాన్ని జయించిన తృప్తి కన్పిస్తుంది. ఎప్పుడూ పరవళ్లు తొక్కే జలపాతంలా పాటలు పాడుతూ హుషారుగా పనిచేసుకుని పోతుంది. పాపం... దానికొక్కోపూట తిండే ఉండదుట. అయినా దాని ధోరణిలో మార్పు కన్పించదు. దాన్నిచూస్తే ఎంత ముచ్చటేస్తుందో!

వదినా! జీవితంపట్ల ఏ ఊహలూ లేని వాళ్ళు అదృష్టవంతులు. వాళ్ళెటువంటి బతుకుతోనైనా రాజీపడి ఇట్టే ఎడ్జస్టవు తారు. జీవితం గురించి అందంగా ఊహల్లుకున్న నాలాంటి పిచ్చివాళ్ళు నిజజీవితంలో దగాపడతారేమో!" అంది సరోజ.

సరోజ మాటలు విద్య అంతరంగాన్ని

కలిచివేశాయి.

కొద్ది రోజుల్లోనే సరోజ స్వాంతన పొందింది. కానీ, ఆమె మనసులో ఆవేదనేమిటో తెలుసుకోవాలని రవీంద్ర ఎంతగా ప్రయత్నించినా సాధ్యం కాలేదు. విద్య కూడా ఎన్ని విధాల ప్రశ్నించినా తేలిగ్గా నవ్వేస్తూ, "ఆ విచారంలో ఏదేదో రాశాను. దానిగురించి మీరు పట్టించుకో వద్దు. నిజంగా ఆ ఇంట్లో నాకేలోటూ లేదు. ఏదయినా లోటుందని బాధపడితే అది నా మానసిక రోగమనుకోవాలి. కాలు బయట పెడితే చాలు 'ఏటమ్మా... ఇలా వచ్చేరంటూ' నౌకర్లు నానోటివెంట వచ్చే ఆజ్ఞకోసం ఎదురుచూస్తారు. అంతకంటే స్త్రీకి వేరే ఇంకేంకావాలి?"

సరోజ మాటలో నిజమే ఉందో, వ్యంగ్యమే ఉందో భార్యా భర్తలిద్దరికీ అంతుపట్టలేదు. నిండు కుండలాంటి సరోజ అంత త్వరగా తొణకదని రవీంద్రకర్థమై మరేం ప్రశ్నించలేదు.

సరోజ వచ్చినప్పట్నుండీ సరోజ సరసనే మరో మంచం వాల్చుకుని పడు కుంటోంది విద్య. రోజూలాగే హాల్లో మంచం వాల్చుతుంటే "వదినా! రోజూ నాపక్కనే పడక వచ్చుకుంటున్నావు గాని నాకే భయమూ లేదు. వెళ్లి అన్నయ్య గదిలో పడుకో" అంది మందలింపుగా.

"అలా వెడితే మీ అన్నయ్య ఊరు కుంటారనుకుంటున్నావా- 'మా చెల్లిని వదిలిపెట్టి వచ్చేవా' అనేలా అనవ సరంగా నాకు చీవాట్లు పెట్టించకమ్మా" తమాషాగా అని లైటార్పి వచ్చి పడక మీద వాలింది.

"వదినా నువ్వెంత మంచిదానివి!" సరోజ ఆత్మీయంగా అంది.

"మీ అన్నా చెల్లెళ్లకంటేనా? నువ్వొక విషయం విన్నావో లేదో - సముద్రంలో నత్తగుల్లలన్నీ ఓచోట చేరితే ముత్యపు చిప్పలన్నీ ఓచోట చేరతాయట. మంచి మనసున్నవారే ఎదుటివారిలో ఉన్న కాస్త మంచిని కొండంతగా గుర్తించగల్గు తారు" విద్య అంది.

"వదినా! నాన్ననోసారి చూసి రావా లనుంది" సరోజ హఠాత్తుగా అంది.

"రేపు మీ అన్నయ్యనడిగి వెడదాం. నువ్వు నాతోపాటు వచ్చేస్తానంటే నీకు తోడుగా రెండు రోజులుంటాను. లేదంటే నేను ఇంటికి వచ్చేస్తాను. నువ్వు ఓ వారం రోజులుండిరా" అంది విద్య.

"వారంరోజులెందుకులే! రెండు రోజులుండి ఇద్దరం వచ్చేద్దాం. అన్నయ్యను ఉదయం అడిగి చూడు"

"అడుగుతానుగాని చాలా టైమయింది ఇక నిద్రపో" అంది విద్య.

ఉదయం ప్రయాణం సంగతి వింటూనే అప్రసన్నంగా ముఖం పెట్టి "రెండు రోజులా!" అన్నాడు.

"సరోజకోసమైనా రెండు రోజులుం డాలిగా!" అంది విద్య.

"సరే వెళ్ళు!" అయిష్టంగానే ఒప్పు కున్నాడు రవీంద్ర.

"నేనెలాగూ ఇంటిదగ్గర లేనని ఆఫీసు లోనే మకాం వెయ్యకండేం" విద్య చిలిపిగా అంది. రవీంద్ర నవ్వుకున్నాడు.

ఆఫీసుకెళ్ళేముందు "విద్యా..ఇలారా!" గదిలోనుండి పిలిచాడు రవీంద్ర. విద్య వంటింట్లోనుంచి గదిలోకి వెళ్ళింది.

"ఇదిగో ఈ డబ్బు నీ దగ్గరుంచు" జేబులోనుండి డబ్బుతీసి విద్యచేతికిచ్చాడు.

"నా దగ్గర మొన్న మీరిచ్చిన డబ్బు అలాగే వుంది"




"ఉంటేనేంలే...ఎందుకైనా మంచిది" అంటూ తనే ఆ డబ్బు విద్య బాగ్‌లో పెట్టాడు. విద్య వెళ్ళబోతుంటే చటుక్కున ఆమె వెంగుపట్టి దగ్గరగా లాక్కున్నాడు.. విద్య చెంపలు కుంకుమ అద్దినట్టు ఎర్రనయ్యాయి.

"ఇదేం కొంటెపని" అతడి స్పర్శకు పరవశురాలవుతూనే కోపాన్ని అభినయించింది.

"పోవోయి బడాయి! కళ్ళు రమ్మంటాయిగాని పెదవులు బింకాలు పలుకుతాయి. రెండురోజులపాటు దేవిదర్శనం లభించదనుకుంటే గుండెలెలా గుబగుబలాడుతున్నాయో చూడు!" మంద్రంగా చెవి దగ్గర గుసగుసలాడాడు. విద్య అతడి కౌగిట్లో గువ్వలా ఒదిగిపోయింది.

బయటికొచ్చాక "రోజా! నేనాఫీసుకు వెడుతున్నాను. మీరు భోజనం చేసి వెళ్ళండి. రెండు రోజుల్లో వచ్చెయ్యాలి సుమా!" అన్నాడు సరోజతో.

రవీంద్ర విద్య దగ్గర కళ్ళతోనే వీడ్కోలు తీసుకుని వెళ్లాడు.

* * *

అనుకోకుండా వచ్చిన కూతుర్ని, కోడల్ని చూసిన సుబ్రహ్మణ్యం ముఖం ప్రఫుల్లమయింది. "అమ్మా రోజా! బావున్నావా తల్లీ" ఆదరంగా కూతుర్ని కుశల ప్రశ్నలు వేశాడు.

"బాగానే ఉన్నాను నాన్నా! మీ ఆరోగ్యమెలా ఉంటోంది?"

"బాగానేవుంది. రవి రాలేదా విద్యా?" కోడల్ని అడిగాడు.

"రాలేదు మామయ్యా" చెప్పింది విద్య.

అలివేలు ఆ ఇద్దరికీ రెండుగ్లాసుల నిండా చిక్కటి మజ్జిగ తెచ్చిఇచ్చి ఇద్దర్నీ పలుకరించి తనపనయిపోయినట్టు లోపలికి వెళ్ళిపోయింది.

"రోజా! మామయ్యే అనుకుంటే ఈమె ఆయనకన్న మరీ మవునంగా ఉంటుందెందుకని? తన పనేదో, తానేమో తప్ప ఎవర్నీ పట్టించుకోదేం'' సరోజ దగ్గర తన సందేహాన్ని బయటపెట్టింది విద్య.

"మా చిన్నతనంనుండీ ఆమె తత్వమే అంత. కష్టాల కొలిమిలో కాగికాగి ఆమె హృదయం మూగబోయింది. ఆవిడా మూగమనిషే కాబట్టి ఈ ఇంట్లో పలుకరించే తోడులేకున్నా నెట్టుకొస్తోంది" అంది సరోజ.

"అదీ నిజమేలే"

సరోజ పెరట్లోకెళ్ళి పారిజాతచెట్టుకింద ఒక్కక్షణం నిలబడింది. మల్లెతీగను ఆత్మీయంగా స్పృశించింది. "వదినా! ఈ చెట్టునీ, మల్లెతీగనీ అమ్మ తన చేతుల్తో స్వయంగా నాటిందట. మనసుకేదైనా కష్టం కల్గితే ఈ చెట్టుకిందే కూర్చుని అమ్మ సాహచర్యం లభించినట్టు, ఆ సాహచర్యంలో స్వాంతన పొందినట్టు అనుభూతి పొందేవాళ్ళం" సరోజ చెప్తుంటే విద్య ఆసక్తిగా విన్నది.

ఆరాత్రి పిండారబోసినట్టున్న వెన్నెట్లో ఆరుబయట పక్కలు పరుచుకున్నారు.

"రోజా! నువ్వు తల్లివికాబోతున్న వార్త తెలిసినరోజున మీ అన్నయ్య ఎంతో సంతోషించారు. నీనుండి మొన్న అందిన ఉత్తరంచూసి అంతగానూ కుంగిపోయారు. అసలా లెటరు అంత బాధగా ఎందుకు రాశావో, నీ మనసులో ఉన్న వ్యధేమిటో ఇప్పుడైనా చెప్పమ్మా!" అంది విద్య.

"ఇంకా నువ్వా విషయం మర్చిపో

లేదా? అబార్షనయిందన్న బాధలో ఏదో పిచ్చిగా రాశాను. ఆ లెటర్ గురించి మర్చిపో వదినా!" అంది సరోజ.

"నీ మనసులో మాట నాతో చెప్పడం నీకిష్టంలేదు కదూ! నీ వదినగాకాదు ఓ సోదరిలా అడుగుతున్నాను...చెప్పవా!" విద్య అంది.

"వదినా!" అంతకుమించి మాట్లాడ లేదు సరోజ.

"అవునమ్మా! మనసులో బాధను నువ్వు ఒక్కదానివే భరించాలనుకోడం అమాయకత్వం. ఆత్మీయులతో ఆ బాధను పంచుకో, నీ గుండె తేలికపడుతుంది. నాకున్న ఆత్మబంధువువు మీ అన్నయ్య తర్వాత నువ్వేగా! నీ బాధను నేను పంచుకుంటాను. చెప్పు!"

విద్య మాటలకు సరోజ, "చెప్పడానికి వేరే ఏముంది వదినా! మా సుధను పెళ్ళి చేసుకోమని మావారు అడిగిన సంగతి అన్నయ్య నీతో చెప్పాడనే అనుకుంటాను. అన్నయ్య అందుకు అంగీకరించకపోయే సరికి మా ఇంట్లో నిప్పు రాజుకుంది. ఆ నిప్పుల మీద మాటల మంగలం పెట్టి అందరూ కలిసి అందులో నన్ను వేపుతున్నారు" చెప్పింది.

"మరీ అంత కసాయితనమా! ఇంట్లో వారికి బుద్ధిలేకుంటే అన్నగారికైనా మంచీ, చెడూ తోచవద్దా" విద్య అంది.

"ఎలా తోస్తుంది వదినా! ఆయన అపర శ్రీరామచంద్రుడు. ఆ ఇంట్లో ఎవరూ మా అత్తగారు గీసిన గీటు దాటరు. ఆమెఆస్త్మా పేషెంటు.మాట్లాడితే ఆయాసం. అందుకే ఆమెనెవరూ బాధపెట్టరు. మామగారే ఆమె అన్నదాని కల్లా తాళం వేస్తుంటే ఇక చిన్నవాళ్ళ మాట వేరే చెప్పాలా! వాళ్ళెన్నన్నుకున్నా నేను పట్టించుకోడం మానేశాను. నా అస్త్రం వారిపట్ల బ్రహ్మాస్త్రమయినట్టుంది. నా మూకీభావం గంగవెర్రులెత్తించింది కాబోలు. ఈమధ్య నా మీద కొత్త అస్త్రాన్ని విడిచిపెట్టారు"

"ఏమిటది?" సరోజ చెప్తున్న తీరు విద్యకు కుతూహలాన్ని కల్గించింది.

"వదినా! ఆయన నా గురించి పూర్తిగా పట్టించుకోడం మానేశారు. మూడు నెలలుగా ఆయన నాతో అసలు మాట్లాడ్డం లేదు'' సరోజ గద్గదకంఠంతో చెప్పింది.

సరోజ మనోవ్యధ విద్య మనసును చివుక్కుమన్పించింది "రోజా! ఆ మూడు నెలలు నువ్వెంత క్షోభను అనుభవించావో అర్థమవుతోంది" సరోజ చెయ్యి నిమురుతూ అంది.

సరోజ కళ్ళు తుడుచుకుని, ''వదినా! నేను గర్భవతినన్న విషయం ఆయనకు మొన్నటి వరకూ తెలియదు'' అంది.

"నువ్వు చెప్పలేదా?''

"ఎలా చెప్పను! నాకా విషయం నిర్ధారణగా తెలిసిన పదిరోజుల ముందు నుండీ నాతో మాట్లాడ్డం మానేశారు. కనీసం నా ముఖం చూడ్డానికైనా ఇష్టపడని ఆయనతో విషయం చెప్పాలనిపించలేదు"

"అక్కడే పొరబడ్డావు రోజా!ఎంతటి పాషండునికైనా పితృవాత్సల్యం ప్రదర్శించకుండా ఉండటం దుస్సాధ్యం. ముందే ఆయనతో ఈ విషయం చెప్పి ఉంటే పరిస్థితి ఇలా చెయ్యిదాటిపోయేది కాదుగదా!''

సరోజ విరక్తిగా నవ్వింది. "వదినా! ఆ విషయం అటువంటి వాతావరణంలో చెప్పుకునేదేనా? మొదటిగా మాతృత్వాన్ని రుచి చూసినప్పుడు ఏ స్త్రీకయినా

ఎంత సంతోషంగా ఉంటుందో, ఆసంతోషాన్ని భర్తతో ఎలా పంచుకోవాలనుకుంటుందో ఆ అనుభవం నువ్వు రుచి చూడకపోయినా ఒక్కసారి ఊహించి చూడు! అయినా బతుకుమీదే విరక్తి కలిగేలా ఆయన అంత కఠినంగా ప్రవర్తిస్తుంటే ఇక గర్భంలో పెరిగే పిండం మీద మమకారం మిగుల్తుందా? అందుకే నా చేతులారా నా బిడ్డను నేనే హత్య చేశాను. ఏ స్త్రీ చెయ్యలేని నేరం నేను చేశాను. నిజంగా నేను హంతకిని" సరోజ వణుకుతున్న కంఠంతో అంది.

"ఈ తప్పు నీదికాదు రోజా! నీలో మమకారాన్ని చంపేసి నిన్ను ఆవేదనకు గురిచేసిన వాళ్ళదీ తప్పు" విద్య అంది.

సరోజ మాట్లాడలేదు.

"రోజా! ఆయన నీతో మాట్లాడకపోడానికి కారణమేమిటి? అంతటి పెద్ద నేరం నువ్వేం చేశావు?" విద్యే అడిగింది.

"అన్నయ్యనేం చెయ్యలేక నా మీద పగ సాధిస్తున్నారు. నన్ను బాధిస్తే అన్నయ్యను బాధించినట్టేగా! వాళ్లు పెట్టే మానసిక హింస భరించలేక నేను అన్నయ్యతో మొర పెట్టుకుంటానని, అన్నయ్య నా బాధ చూడలేక వాళ్ళ దగ్గరకొచ్చి వాళ్ళ కాళ్ళు పట్టుకుని బతిమలాడతాడని ఆవిధంగా కొంత సంతృప్తి పొందాలని ఎదురుచూస్తున్నారు. ఈసరోజసంగతిపూర్తిగా వాళ్ళకు తెలియదు. వాళ్ళముందు ఓటమిని ఒప్పుకునేంత పిరికిదాన్ని కాను" సరోజ కసిగా అంది.

ఆ స్వరంలో విన్పించిన కసిని చూసి అదిరిపడింది విద్య. "రోజా! నాకో విషయంలో మాటివ్వగలవా?" చాలా సేపటికి అంది.

"నాకు సాధ్యపడేదయితే తప్పకుండా నెరవేర్చగలను"

"ఎటువంటి పరిస్థితులెదురైనా ఏ అఘాయిత్యం చెయ్యనని, నిబ్బరంగా వాటినెదుర్కుంటానని నాకు మాటివ్వు" విద్య చెయ్యి ముందుకు చాచింది.

"వదినా!" అంది హీనస్వరంతో.

"అవునమ్మా...నాచేతిలో చెయ్యేసి చెప్పు!"

"నామీద నాకే హక్కులేదా?" సరోజ జాలిగా అంది.

"జీవించడానికే నీకు హక్కుంది. జీవితాన్ని తుంచుకునే హక్కు నీకులేదు. ఆత్మహత్య చేసుకోడమంటే ఎవరిమీదో పగతీర్చుకోడమనుకునే నీ ఊహ పూర్తిగా తప్పు. అటువంటి పిచ్చిపని నువ్వుచేస్తే వాళ్లు బాధపడరు. పెళ్లికూతుళ్లకు మన దేశం గొడ్డుపోలేదు. మూడోరోజునే మా అమ్మాయిని చేసుకో అంటే, మా అమ్మాయిని చేసుకోమని ఆ ఇంజనీరుగారికోసం ఆడపిల్లల తండ్రులు లక్షల కట్నంతో క్యూలో నిలబడతారు. ఇక నువ్వుసాధించేదేమిటి- అతడి బాంకు బాలన్సు మరో రెండు లకారాలు పెంచడంతప్ప"

"నిజమే వదినా! ఏదో వెర్రి ఆవేశంతో అలా అన్నానేగాని నేనుపోతే వాళ్లు బాధపడరు. వాళ్ళసలే ఆశాపిశాచాలు. ఈమధ్య ఆయనకు ఫారిన్ ఛాన్సు వస్తోందట. అన్నయ్యనడిగి ఏభైవేలు తెమ్మని పోరుపెట్టినా నేనా మాటలు లెక్కచెయ్యలేదు. అడిగి అడిగి నానుండి సరయిన సమాధానం రాకపోయేసరికి నాతో మాట్లాడ్డం మానేశారు. నేనేపోతే ఈసారి కట్నంతోపాటు సొంత ఖర్చులతో ఫారిన్ పంపగల మామగార్నే వెదుక్కుంటారు" అంది సరోజ.

"అదా అసలు విషయం! ఆ సంగతి మీ అన్నయ్యతో చెప్పలేదేం?" విద్య అంది.

"నేనంత సిగ్గులేనిదాన్ని కాదు" సరోజ చిన్నబుచ్చుకుంది.

"నన్నపార్థం చేసుకోకు రోజా! సమస్యేమిటో తెలిస్తే తరుణోపాయాలు వెదకొచ్చు. నువ్వు సుఖంగా ఉంటేనే మాకూ ఆనందంగా ఉంటుంది. వెధవ డబ్బుకోసం నిన్ను బాధిస్తున్నారని తెలిస్తే మీ అన్నయ్య తట్టుకోగలరా?" అంది.

"అలా అని వాళ్ళ కోర్కెలు తీర్చ డానికి ప్రయత్నిస్తే వాటికిక అంతుండదు. ఒకటి తీర్చేలోగా మరో కొత్తకోర్కె పుడుతుంది. ఇచ్చేవారున్నారని తెలిస్తే అడిగేవాడి ఆశకు అంతముండదు. నా సుఖంకోసం ఉన్నదంతా ఊడ్చిపెట్టి అన్నయ్యను బికారిని చెయ్యమంటావా? అంతా వాళ్లు దోచేసి అన్నయ్యకేమీ మిగలకుండా చెయ్యాలన్నదే వాళ్ళ తలంపు. ఆయనకు ఫారిన్ వెళ్లాలని అంత మక్కువగాఉంటే ఆయన పిత్రా ర్జితం ఉందిగా అది ఖర్చుపెట్టుకోవచ్చుగా? అంటే వాళ్ళ ఉద్దేశం నన్ను ఏడ్పించడం ద్వారా అన్నయ్యను సాధించాలని. వాళ్ళ ఎత్తు నాకు తెలుసు కాబట్టే అన్నయ్యను డబ్బు అడగనని ఖచ్చితంగా చెప్పేశాను. ఆయన కొట్టినా, తిట్టినా నేను చలించలేదు. నా వ్యవహారంలో విసిగివేసారి నాతో మాట్లాడ్డం మానేశారు. ఆవిధంగానైనా నన్ను లొంగదియ్యా లన్నది ఆయన ఉద్దేశం" సరోజ చెప్పింది.

"ఎంతపని చేశావమ్మా! ఇప్పుడైనా మించిపోయిందిలేదు, ఈ విషయం మీ అన్నయ్యతో చెప్తాను. నువ్వు అడ్డు పెట్టకు" అంది.

"వద్దొదినా! అలా చెయ్యడంవల్ల నా మాటెలావున్నా అన్నయ్యను వాళ్లు అలుసుగా చూస్తారు. అన్నయ్యను చిన్న చూపుచూస్తే నేను భరించలేను" అంది.

"ఆడపిల్లగలవారం..వాళ్లు చిన్నచూపు చూసినా భరించాలి"

"అలా ఆలోచించడం నాకిష్టముండదు. మనమేం నేరంచేశామని వాళ్ళముందు మన ఆత్మగౌరవాన్ని భంగపర్చుకోవాలి" పరుషంగా అంది సరోజ.

"రోజా! నువ్వింకా చిన్నపిల్లవు. లోకంపోకడ నీకు తెలియదు" విద్య అనునయంగా అంది.

"మహాపెద్ద ఆరిందా బయల్దేరిందండీ! నాకంటే వయసులో ఓ సంవత్సరమో, రెండేళ్ళో పెద్దదానివేమోగాని గృహిణిగా మాత్రం నాకంటే చిన్నదానివే. నీకంటే ఓ సంవత్సరం నేనే సీనియర్ని" చిలిపిగా అంది.

"ఫో...కొంటెపిల్లా!" విద్య చిర్నవ్వు నవ్వింది.

"వదినా! అన్నయ్యకి విషయాలేవీ చెప్పకు. నాశక్తి ఉన్నంతవరకూ పరిస్థి తులతో పోరాడతాను. నేను అశక్తురాలినై నపుడు నీకు లెటర్ రాస్తాను. అప్పుడేం చెయ్యాల్సిందీ అన్నయ్యతో ఆలోచించు" అంది సరోజ.

"మీ అన్నయ్యతో ఇప్పుడే చెప్పేస్తే మంచిదేమో?" విద్య అంది.

"ఊహూ! నేను అక్కడికెళ్ళాక పరిస్థి తులు కొంతవరకు మెరుగుపడతాయనే అనుకుంటున్నాను. ఆయన అమ్మను, చెల్లెల్ని సంతోషపెట్టడానికి ఎంత కాఠిన్యం వహించినా నాకు జరిగిన అన్యాయానికి ఏమూలో లేశమైనా బాధ, పశ్చాత్తాపం ఉంటుందని, అవే మా




పరిస్థితులను చక్కదిద్దుతాయని ఆశిస్తున్నాను"

"అదే జరిగితే మాకంతకన్నా కావలసిందేముంది" విద్య అంది.

"వదినా! ఇక్కడి విషయాలు ఇప్పుడే నీ మనసులోనుండి చెరిపెయ్యి"

"అలాగే"

ఆ తరువాత ఇద్దరూ మవునం వహించారు.

* * *

తిరిగొచ్చిన విద్యను, సరోజను చూసి "హమ్మయ్య! వచ్చేశారా? ఈ రెండు రోజుల్నుండి హోటల్ భోజనం తినలేక చచ్చాను" వికసించిన ముఖంతో అన్నాడు రవీంద్ర.

"హోటల్ భోజనమేమిటి? రాఘవులు లేడా?" విద్య అడిగింది.

"మీరిలా వెళ్ళిన కాసేపటికే వాడి తాతయ్యకు సీరియస్‌గా ఉందని, వెంటనే బయల్దేరి రమ్మని టెలిగ్రాం వచ్చింది! వెంటనే వాడిని డబ్బిచ్చి పంపేను" చెప్పాడు.

"మళ్ళీ ఎప్పుడొస్తాడో ఏమయినా ఉత్తరం రాశాడా?"

"ఏదీ... మొన్ననేగా వెళ్లాడు. బహుశా రాఘవులిక రాడనుకుంటాను"

"ఎందుకు రాడు?"

"వాడి తాతకు కొద్దిపాటి ఆస్తిపాస్తులున్నాయి. అతడి అనంతరం ఆ ఆస్తికి వీడే వారసుడనుకొంటాను. ఆ ఆస్తి వీడికే సంక్రమిస్తే ఇక వంట చేసే పాట్లు దేనికి? మళ్ళీ మనం మరో వంటవాణ్ని చూసుకోవాలి. ఈరోజుల్లో అటువంటి నమ్మకస్తుడు దొరకడం చాలా కష్టం. అయినా ట్రైచేద్దాం" అన్నాడు రవీంద్ర.



"మీరటువంటి ప్రయత్నాలేవీ చెయ్యక్కరలేదు. మనిద్దరికీ వంట చెయ్యడం నాకు కష్టంకాదు" విద్య అంది.

"ఇప్పుడలాగే అంటావు. నాల్రోజులు పోతే సగటు మగాడిలా భార్యను వంటింటి కుందేల్ని చేశారంటూ నామీద దండయాత్ర మొదలుపెడతావు" రవీంద్ర నవ్వుతూ అన్నాడు.

''మీరు భయపడ్డంలో అర్థంలేక పోలేదులెండి! ఇప్పటికే చాలా విషయాల్లో మీమీద దండెత్తాను కాబట్టి స్వానుభవంతో చెప్పారా మాట'' విద్య మూతి ముడిచింది.

"కోప్పడకోయ్ గృహలక్ష్మీ! నీచేత వంటపని చేయించడం నాకే ఇష్టం లేదనుకోరాదా'' అన్నాడు.

"ఇంటి పనులు స్వయంగా చేసుకోడంలో స్త్రీకి ఎనలేని తృప్తి లభిస్తుంది. నాకంతగా విసుగుపుడితే అప్పుడు మీతో చెప్తానుగాని అంతవరకూ మళ్ళీ వంట మనిషిని చూసే ప్రయత్నాలు చెయ్యకండి''

''చిత్తం. అర్ధాంగ లక్ష్మి ఆజ్ఞాపించేక చేసేదేముంది" రవీంద్ర వినయాన్ని అభినయిస్తుంటే విద్య నవ్వుతూ లోపలికి వెళ్ళింది.

"ఏమ్మా రోజా! నాన్నగారు బావున్నారా?" చెల్లెల్ని ప్రశ్నించాడు.

''బాగానే ఉన్నారన్నయ్యా"

"చెప్పడం మరిచాను. మీరు ఊరు వెళ్లిన రోజునే ప్రకాష్‌నుండి నీకు లెటరొచ్చింది. తెస్తానుండు'' అంటూ లోపలికెళ్ళి ఓకవరు తీసుకొచ్చి చెల్లెలికిచ్చాడు.

ఏమి రాశారోనన్న కుతూహలంతో లెటర్ తెరిచింది.

"రోజా!

నీ ఆరోగ్యమెలా వుంది? ఇప్పటికి ఆ బాధనుండి శారీరకంగా, మానసికంగా కోలుకునుంటావనే అనుకుంటాను. నువ్వు లేక నాకేం తోచడంలేదు. వెళ్ళినదానివి నా విషయమే గుర్తులేనట్టు మీ అన్నయ్య దగ్గరే ఉండిపోయావు. అవున్లే! నాకంటే కూడా మీ అన్నయ్యంటేనే గౌరవం, ప్రేమ. ఈ లెటర్ చూశాకయినా వెంటనే బయల్దేరి వచ్చెయ్యి. మీ అన్నయ్యకు తీసుకురావడానికి తీరిక లేకుంటే ఎప్పుడు బయల్దేరేదీ ట్రంకాల్ చేస్తే స్టేషన్‌కొచ్చి రిసీవ్ చేసుకుంటాను.

ఉంటాను

నీ ప్రకాష్"

ఆ లెటర్ చదవగానే సరోజ ముఖం విచ్చిన అరవిందమే అయ్యింది. నాలుగు నెలల్నుండి పడుతున్న క్షోభ, ఆవేదన ఒక్క ఊపుతో తుడిచిపెట్టుకుపోయింది. భర్తమీద ప్రేమ ఎదలో ఉప్పొంగింది. త్వరగా బయల్దేరి వెళ్ళమని మనసు త్వరపెట్టింది.

చెల్లెలిలో మార్పు ఆసక్తిగా గమనిస్తున్న రవీంద్ర - "బావ ఏమని రాశారమ్మా?" అడిగాడు.

"వెంటనే రమ్మని రాశారన్నయ్యా" ముసిముసిగా నవ్వుతూ అంది సరోజ. ఆమె ముఖంలో వెన్నెలరేకలు పర్చుకోడంచూసి రవీంద్ర హృదయం ఎంతో తేలికపడింది. "ఎప్పుడు వెళ్లాలనుకుంటున్నావు?"

"రేపు మంచిదయితే వెళ్ళిపోతానన్నయ్యా!"

"రేపు శుక్రవారంగదా..ఎల్లుండి వెడితే మంచిది" కాఫీకప్పులతో అప్పుడే అక్కడికొచ్చిన విద్య అంది.

"ఎల్లుండే వెడతాను. రేపు ఆయనకు





నేను శనివారం బయల్దేరి వస్తున్నట్టు టెలిగ్రాం ఇవ్వన్నయ్యా! ఆయన నన్ను స్టేషనుకొచ్చి రిసీవు చేసుకుంటానన్నారు" చెప్పింది సరోజ.

"నాకు వీలుకుదిరితే నేనే నీకూడా వస్తాను. లేకుంటే నువ్వు ఒంటరిగా వెళ్ళాల్సిందే! ఏందుకైనా మంచిది. బావగార్ని స్టేషనుకు రమ్మని ట్రంకాల్ చేస్తాను" రవీంద్ర చెప్పాడు.

"అన్నగారు రమ్మనగానే వెళ్ళక పోతేనేం...మరో నాల్రోజులుండి వెళ్ళరాదా! నువ్వింకా పూర్తిగా కోలుకోనే లేదు" విద్య అంది.

"ఆయన వచ్చెయ్యమని రాశాక కూడా వెళ్ళకపోతే బాధపడతారు. అయినా నేనొచ్చి పదిహేనురోజులు దాటిపోయింది. వీలుంటే మేమిద్దరం ఉగాదికి వస్తాంలే" సరోజ సర్దిచెప్పింది.

"తప్పకుండా రావాలిసుమా! ఈ రకంగానైనా మా అన్నగారి పరిచయ భాగ్యం లభిస్తుంది" విద్య నవ్వుతూ అంది.

"అలాగే"

సరోజ బయల్దేరే రోజు రానేవచ్చింది.

"మీ అన్నగారు నీకోసం కొన్న చీరలు సూట్‌కేసులో పెట్టేవా లేదా?" విద్య జ్ఞాపకం చేసింది.

"పెట్టలేదు. అయినా నాకు చాలా చీరలున్నాయి వదినా! ఆ చీరలు నువ్వే అట్టిపెట్టుకో. నీ తృప్తికోసం ఒక్క చీరివ్వు. అది కట్టుకుని వెడతాను" అంది.

"ఎక్కడి ఆడపిల్లవోయ్! ఏ ఆడ పిల్లయినా పుట్టింటినుండి నాకది కావాలి, ఇది కావాలంటూ కొనిపించి కావలసిన వన్నీ పట్టుకెడుతుంది. నువ్వు అందుకు పూర్తిగా వ్యతిరేకంలా ఉన్నావు. నా మాట విని ఆ చీరలన్నీ సూట్‌కేసులో సర్దుకో. నువ్వు చీరలు పట్టుకెళ్ళలేదని తెలిస్తే ఆయన బాధపడతారు" విద్య బీరువాలో ఉన్న చీరల పాకెట్టుతీసి సరోజ పక్కనే పెట్టింది.

"వదినా! అన్నగారికితగ్గ భార్యవే దొరికావు. మీ అభిమానాలను కొలిచే కొలబద్ద ఏదీలేదు" సరోజ అంది.

"అన్నగారు ఇంజనీరేగా! అటువంటి సాధనమేదయినా బుర్ర ఉపయోగించి కనిపెట్టమను" విద్య నవ్వుతూ అంది.

సరోజ చీరలు సూట్‌కేసులో సర్దుతుండగా – "రోజా! నువ్వెళ్ళిపోతున్నావంటే నాకు చాలా బాధగావుంది" విద్య అంది.

"నీకే కాదొదినా...మిమ్మల్ని వదిలి వెళ్ళాలంటే నాకూ అసంతృప్తిగా ఉంది. ఇన్నిరోజులూ నిజమైన మనుషులున్న ప్రపంచంలో ఉన్నట్టనిపించింది. మళ్ళీ అక్కడికి వెళ్ళాలంటే అంతరంగం ససేమిరా అంగీకరించడంలేదు. కాని నా చోటు అదేగా!" సరోజ బాధగా నిట్టూర్చింది.

"రోజా! అక్కడ నీ మనసుకేదైనా కష్టంకల్గితే మీ అన్నగార్ని, నన్నూ గుర్తుపెట్టుకో" సరోజ చుబుకం పట్టుకుని అంది విద్య.

"అలాగే వదినా" సరోజ విద్య చెయ్యి నొక్కి వదిలింది.

ఇంతలో ఫోను మోగడంతో విద్య లోపలికి పరుగెత్తింది. రెండు నిముషాల్లో తిరిగొచ్చిన విద్యను–"అన్నయ్యేగా ఫోను చేశాడు" అడిగింది.

"అవును. అయినా మీ అన్నయ్యే ఫోను చేశారని ఎలా కనిపెట్టేవు!" విస్మయంగా అంది విద్య.

"నాకు దివ్యదృష్టిలేదులే! నీ ముఖం చూస్తేనే అన్నయ్యే ఫోనుచేశాడని తెలిసి పోయింది. చెంపల్లో కెంపులు పూసి, కళ్ళల్లో మల్లెలు విరిసి, మధురాధరంపై దరహాసాలు చిందాయంటే అర్థం అదే కదూ" సరోజ మాటలకు విద్య పట్టుబడ్డ దొంగలా చూసింది.

"అసాధ్యురాలివే! అవునుమరి...ఆ అన్నకు చెల్లెలివేగా" విద్య సరోజ బుగ్గ చిదుముతూ అంది.

"ఇంతకీ అన్నయ్యేం చెప్పాడొదినా? తను వస్తున్నాడటా?''

"రావడానికి కుదరలేదట. స్టేషన్ కొచ్చి నిన్ను ట్రైనెక్కించడానికి కూడా వీలుపడదట. అందుకని నిన్ను ట్రైనె క్కించే బాధ్యత నాకు అప్పగించారు" చెప్పింది విద్య.

''త్వరగా తెములు. ఇంక అరగంటే టైముంది" త్వరపెట్టింది.

"నేను పావుగంటలో రెడీ అవుతాను. నువ్వు కాస్త అన్నం పెట్టుకు తినెయ్యి" చెప్పి బాత్‌రూమ్‌కు వెళ్ళింది విద్య.

ట్రైనెక్కి సీటు వెదుక్కుని కూర్చున్నాక విద్య ప్లాట్‌ఫారమ్ మీదే నిలబడి కిటికీ దగ్గరే కూర్చున్న సరోజ చెయ్యి ఆప్యాయంగా నిమిరింది. "రోజా! ఎప్పటికప్పుడు లెటర్స్ రాస్తుంటావు కదూ?" అంది.

"తప్పక రాస్తానొదినా! నువ్వు కూడా వెంటనే సమాధానాలు రాయాలి"

"అలాగే. ఏం జరిగినా నన్ను గుర్తుంచుకో" అంది విద్య.

ట్రైన్ వెళ్ళిపోగానే బరువెక్కిన గుండెతో ప్లాట్‌ఫారమ్ దాటి బయటి కొచ్చింది విద్య. దూరంగా నిలబెట్టివున్న రిక్షాల దగ్గరకు వెళ్ళబోతుండగా వెనుక నుండి ఎవరిదో బలమైన చెయ్యి కఠినంగా గుచ్చి పట్టుకుని వెనక్కు తిప్పడంతో విద్య తుళ్ళిపడుతూ వెనుతిరిగి చూసింది.




"నువ్వు...నువ్వు విద్యవు కదూ?" అతడి కంఠం పులి గాండ్రింపులా విన్పించింది. అతణ్ని చూడగానే విద్య ముఖంలో కత్తివేటుకు నెత్తురు చుక్కలేనట్టు తెల్లగా పాలిపోయింది.

"ఎవర్నువ్వు? ఏమిటీ దౌర్జన్యం?'' ధైర్యం కూడగట్టుకుని గట్టిగా అరవాలనుకున్నా చాలా మెల్లగా విన్పించిందామె స్వరం.

"నేనెవరో నీకు నిజంగా తెలియదూ? తెలిసుండీ నటిస్తున్నావా? తెలియకపోతే ఎవరినో చెప్పడానికి అభ్యంతరంలేదు. తెలిసీ నటించావంటే నిజం కక్కించడానికి నిముషంపట్టదు" ఆ గొంతులో కర్కశత్వం, పరిహాసం రెండూ పోటీ పడుతూ విన్పించాయి.

''నిజంగా నువ్వెవరో నాకు తెలియదు. నా పేరుకూడా నువ్వు పిలిచినట్టు విద్య కాదు...నా పేరు విశాలి" అంది విద్య.

"అలాగా! విద్యవో,విశాలివో ఒకసారి మీనాక్షమ్మను తీసుకొచ్చానంటే రంగు బయటపడుతుంది" అతడలా అంటుంటే విద్యకు స్పృహ తప్పినంతపనయింది.

"నీఇష్టం వచ్చినట్టు చేసుకో'' అని విద్య విసుగ్గా దూసుకుంటూ ముందుకు




పోయి సమీపంలోవున్న టాక్సీని ఎక్కి "పోనియ్యవోయ్" అంది.

పరిస్థితి గ్రహించినట్టు అతడు టాక్సీని స్టార్టుచేస్తూ, "ఎక్కడకు పోవాలో చెప్పండి" అన్నాడు డ్రైవరు.

"చెప్తాగా. ముందుపోనియ్యి" విద్య వెనక్కు వెనక్కుచూస్తూ అంది.

టాక్సీ టర్నింగ్ తిరుగుతుండగా వెనుకనుండి అతడెక్కిన మరో టాక్సీ తమ టాక్సీని ఓవర్‌టేక్ చేస్తూ రావడం కన్పించింది. విద్యకు ప్రాణాలు పైనే పోయాయి. 'వాడు తనవివరాలు తెలుసుకోడానికే వెంబడించి వస్తున్నట్టున్నాడు. వాడి కన్నుకప్పి ఇంటికెలా చేరుకోవాలి? తన ఇంటి అడ్రసు తెలిస్తే వాడు తనని వదిలిపెట్టడు. వాణ్ని తెలివిగా పక్కదారి పట్టించి ఇంటికి చేరుకోవాలి. ఎలా?' విద్య మెదడు తీవ్రంగా ఆలోచిస్తోంది.

"ఎక్కడికెళ్ళాలో చెప్పండమ్మా?" డ్రయివరు పలుకరించగానే విద్య ఉలికి పడుతూ వెనక్కు చూసింది. అతడు ఎక్కిన టాక్సీ వందగజాల దూరంలో తమ టాక్సీని ఫాలోఅయి వస్తోంది. నిస్పృహగా చూపులు తిప్పబోతున్న విద్య ఎదురుగా కన్పిస్తున్న బోర్డునిచూసి ఏదో ఆలోచన తోచగా "ఆ ఆ... ఇక్కడే ఆపెయ్యి. నేను దిగిపోతాను" అంటూ 'లూథరన్ మిషనరీ హాస్పిటల్' అన్న బోర్డు చూపింది.

అతడు టాక్సీ ఆపగానే ఇరవై రూపాయల నోటు అతడి ఒళ్ళోకి విసిరి డోర్‌తీసి చటుక్కున దిగిపోయి గేట్లో నుండి దూసుకుంటూ హాస్పిటల్‌వేపు పరుగుతీసింది విద్య.

వెయిటింగ్ హాల్లోకి వెళ్ళి గేట్లోకి చూసింది. అతడు కూడా టాక్సీదిగి ఫేర్ చెల్లించి గేటుకెదురుగా అటువేపు రోడ్ మీదున్న చెట్లనీడలో నిలబడి ఇటే చూస్తున్నాడు. అక్కడతణ్ని చూడగానే విద్య గుండెలు వేగంగా స్పందించాయి. 'భగవాన్! ఈ శనినుండి తప్పించుకోడం సాధ్యం కాదేమో' నీరసంగా అనుకుంది.

ఇంతలో ఇద్దరు సిస్టర్స్ ఏదో మాట్లాడుకుంటూ అటువేపు రావడంచూసి, "సిస్టర్! సరస్వతీ సిస్టర్ ఈరోజు డ్యూటీలో ఉందా?" అడిగింది విద్య.

"సరస్వతికీరోజు నైట్‌డ్యూటీ అనుకుంటా! హాస్టల్‌వేపు వెళ్ళి కనుక్కోండి. డ్యూటీలేకుంటే హాస్టల్లోనే ఉంటుంది" చెప్పి వెళ్ళిపోతుంటే "థాంక్యూ" కృతజ్ఞతలు చెప్పి విద్య హాస్పిటల్‌కు దూరంగా ఉన్న హాస్టల్‌వేపు వెళ్ళింది.

సరస్వతి దూరంనుండి విద్యను చూసి "హాయ్ లవ్లీ!" అంటూ విద్యను చుట్టేసి ఉక్కిరి బిక్కిరి చేసింది.

"ఇదంతా ప్రేమేనా? ఇంత ప్రేమ ఉండబట్టే నా పెళ్ళికి రమ్మనగానే వచ్చేవు" విద్య కినుకగా అంది.

"కోపం చాలించవే సఖీ! నామీద నిందలుమోపేముందు నిన్ను నువ్వు శోధించుకోవాలి. ఈ ఊరొచ్చిన రెండు సంవత్సరాల్లో నన్ను చూడ్డానికి నువ్వెన్ని సార్లు వచ్చేవో లెక్కవేసి చెప్పు" అంది.

"చెల్లుకుచెల్లు. ఇక లెక్కలుఅడక్కు సరసూ!" విద్య అంది.

"అలా రా దారికి. పద... నా రూమ్‌కి పోయి కాస్త కాఫీ తాగుదాం" అంటూ విద్య చెయ్యి పట్టుకుని మేడమీదకు తీసుకెళ్ళింది సరస్వతి.

గదిలోకెళ్ళాక "ఏమిటివేళ నామీదింత దయకల్గింది?" అడిగింది సరస్వతి.

"నా పెళ్ళికెందుకు రాలేదో నిలదీసి

అడగాలని వచ్చేను"

"సారీ విద్యా! ఆరోజు నాలుగు ఆపరేషన్లున్నాయి. నేనెంత ప్రయత్నించినా మా సూపరింటెండెంటుగారు పర్మిషనివ్వలేదు. అందుకే రాలేకపోయాను" సరస్వతి నొచ్చుకుంటూ అంది.

"పోనీ ఆ తరువాతయినా మా ఇంటికి రావొచ్చుగా?" విద్య అంది.

"మీ ఇల్లు నాకు తెలియదుగా. అందుకే రాలేదు."

"అవునుకదూ! అడ్రసు చెప్తాను... రేపు సండే తప్పకుండా రావాలి. నిన్ను మావారికి పరిచయం చేస్తాను"

"తప్పకుండా వస్తాను. అన్నట్టు విద్యా! ఈ ప్రశ్న నిన్ను వెయ్యొచ్చో లేదో తెలియదుగాని బాల్యస్నేహితురాలిగా చనువుతో అడుగుతున్నా...మీవారు నిన్ను ప్రేమగా చూస్తారా?" అడిగింది సరస్వతి.

రవీంద్రను తలుచుకోగానే విద్యముఖం వికసించింది. "ఆయన నన్ను తన ప్రాణంతో సమంగా చూస్తారు. ఈ విద్యకింత అదృష్టం దక్కుతుందని ఆయన తాళికట్టేవరకూ ఊహించలేదు సరసూ" అంది.

"విద్యా! నాకిప్పుడెంతో తృప్తిగా ఉంది. నీ జీవితం ఒడ్డుకు చేరింది. మీవారిని ఓసారి తప్పకుండా చూసితీరాలి" కాఫీ కప్పులో పోసి విద్యకిస్తూ అంది సరస్వతి.

ఓ పావుగంట కూర్చుని ఇద్దరూ కబుర్లు చెప్పుకున్నారు. "అన్నట్టు సరసూ! ఇదివరలో మనిద్దరం ఓ ముచ్చట తీర్చుకోవాలనుకున్నాం కదూ, గుర్తుందా?" గుర్తు చేసింది విద్య.

"ఏమిటది? నాకు జ్ఞాపకం లేదు"

"నర్సు డ్రస్సులో ఇద్దరం కలిసి ఫొటో తీయించుకోవాలనుకున్నాం. ఇప్పటికైనా గుర్తొచ్చిందా?"

"ఆ....అవును గుర్తొచ్చింది"

"పద. ఈరోజు స్టూడియోకు వెళదాం"

"ఈరోజేనా?"

"నీకు డే డ్యూటీ లేదుగా! ఖాళీయే కాబట్టి వార్డెన్ను పర్మిషనడిగి పోదాం పద. ఒక్కగంటలో తిరిగి వచ్చెయ్యొచ్చు. మళ్లీ ఇటువంటి అవకాశం వస్తుందో లేదో" విద్య అంటుంటే కాదనలేకపోయింది సరస్వతి.

"ఆ రాక్షసి పర్మిషనిస్తుందో లేదో! నీకు తెలుసుగా ఇక్కడి రూల్సెంత కఠినంగా ఉంటాయో? పర్మిషనిస్తే వస్తాను. నేను వెళ్లి అడిగివస్తాను. ఈలోగా నువ్వు ముఖం కడుక్కుని చీర మార్చి ఈ డ్రస్సు వేసుకో" అంటూ సూట్‌కేస్‌లో నుంచి ఇద్దరికీ డ్రస్సు బయటకు తీసింది సరస్వతి.

విద్య డ్రస్సు వేసుకున్నాక ఆమె జడ విప్పేసి తలనంతటినీ ముడిలా చుట్టి కేప్ పెడుతూ, "విద్యా! ఈ డ్రస్సులో నువ్వెంత అందంగా ఉన్నావో తెలుసా! నిన్ను చూస్తే నాకే ముద్దెట్టుకోవాలనిపిస్తోంది" అంది సరస్వతి.

విద్య నవ్వి ఊరుకుంది. గాజులూ, మెళ్లోతాడూ, నల్లపూసలు అన్నీ తీసేసి సరస్వతి పర్సులో పెట్టింది విద్య. బొట్టులేని నుదురు, బోసిగా ఉన్న మెడను చూస్తుంటే విద్య హృదయం తప్పు చేసినట్టు మథనపడింది.

"నడు విద్యా! ఆలస్యంగా వస్తే ఆ మారెమ్మ ఊరుకోదు" అంటూ విద్యను తొందరపెట్టి బయటకు తీసుకొచ్చింది సరస్వతి.





హాస్పిటల్ మెట్లుదిగుతూ చూసీ చూడనట్టు గేట్లోంచి బయటకు చూసింది. అతడక్కడే నిలబడి ఇటే చూస్తున్నాడు.

అడుగులు తడబడకుండా జాగ్రత్త పడుతూ ఎదురెండ ముఖానికి తగలకుండా అడ్డుపెట్టుకున్నట్టుగా వెంట తెచ్చిన పుస్తకాన్ని అడ్డంపెట్టుకుని సరస్వతి చెప్పేకబుర్లకు అనాసక్తంగా ఊకొడుతూ ఆమె పక్కనే నడిచి వెళ్లింది విద్య.

గేటుదాటి రోడ్డెక్కి కొంత దూరం వెళ్ళేక సరస్వతి ఎదురుగా వస్తున్న రిక్షానాపి ఎక్కింది. విద్యకూడా రిక్షా ఎక్కుతూ క్రీగంట చెట్టుకింద నిలబడ్డ అతడివైపు చూసింది.

అతడింకా అక్కడే నిలబడి హాస్పిటల్ వైపే చూస్తున్నాడు.

రిక్షా కదిలి ముందుకుపోగానే విద్య ఫ్రీగా కూర్చుని తేలిగ్గా ఊపిరి వదిలి సరస్వతితో ఉత్సాహంగా కబుర్లు చెప్పసాగింది.

• • •

విద్య సరస్వతితో విడిపోయి ఇంటి కొచ్చిన అరగంటకే రవీంద్ర ఇంటి కొచ్చేడు. భోజనం చేస్తున్నపుడు, "ట్రైన్ లేటా ఏమిటి?" అడిగాడు విద్యను.

"లేదు. టైముకే వచ్చింది" విద్య చెప్పగానే మవునంగా భోజనం చెయ్య సాగాడు. "ఎందుకలా అడిగేవు?" విద్య ఉండబట్టలేక అడిగింది.

"రెండుసార్లు ఇంటికి ఫోన్‌చేశాను. రెండుసార్లు సమాధానం లేదు. అందుకే అడిగాను" చెప్పాడు రవీంద్ర.

"నేను స్టేషన్నుండి వస్తుండగా నా బాల్యస్నేహితురాలు కన్పించింది. అది ఆహ్వానించిన మీదట కాదనలేక ఆమె పని చేస్తున్న హాస్పిటల్‌కు వెళ్లాను. దాంతో మాట్లాడుతూ కూర్చుంచే టైమే తెలియలేదు" చెప్పింది విద్య.

"ఓహో! ఈ ఊళ్లో నీకో బాల్య స్నేహితురాలుకూడా ఉందన్నమాట"

"ఉంది. ఇక్కడ మిషనరీ హాస్పిటల్లో స్టాఫ్‌నర్స్‌గా పనిచేస్తోంది. పేరు సరస్వతి" చెప్పింది.

"ఆమెను మనింటికి రమ్మనక పోయావా?"

"ఆహ్వానించాను. సండే తప్పకుండా వస్తానంది" చెప్పింది.

మళ్ళీ ఆఫీసుకెళ్ళేముందు రవీంద్ర, "విద్యా! సాయంత్రం నేను వచ్చేసరికి రెడీగా ఉండు. ఈరోజు ఎగ్జిబిషన్‌కు వెడదాం" చెప్పాడు.

"ఈరోజు నేనెక్కడికీ రాలేను. రెండురోజులు పోయేక వెడదాం" విద్య అనడంతో "నీయిష్టం" అని వెళ్ళిపోయాడు రవీంద్ర.

అతడు వెళ్ళగానే తలుపులు బిగించి పడకమీద వాలిపోయింది. ఆలోచనలు తరంగాల్లా ఆమెలో ఎగిసిపడ్డాయి. ఇన్నేళ్ళ తరువాత మళ్ళీ అతడిక్కడికి ఎందుకొచ్చినట్టు? జైలునుండి ఎప్పుడు విడుదలయ్యాడో? యాదృచ్ఛికంగా ఇక్కడికొచ్చాడో, తనను వెదుక్కుంటూ వచ్చాడో తెలిస్తే బావుండును. తనను సులువుగానే గుర్తుపట్టేడు. తను అబద్ధమాడినా నమ్మలేదు. పైగా తనను వెంటాడుతూ వచ్చేడు. ఎందుకలా వెంటబడ్డాడు? తననేం చెయ్యాలని అతడి ఉద్దేశం? అతడి ముఖం చూస్తే ఎటువంటి క్రూరమైన పనికైనా వెనుదీయ్యనట్టు వున్నాడు. అతడి రాక తన జీవితంపై ఎటువంటి ప్రభావం చూపబోతోంది. ప్రస్తుతానికి వాడిబారినుండి తప్పించు

కున్నా వాడు తనసంత తేలిగ్గా వదిలి పెడతాడన్న నమ్మకం లేదు' విద్య పరిపరివిధాల ఆలోచిస్తూనే ఎప్పటికో నిద్రలోకి ఒరిగింది.

* * *

"విద్యా"

"ఊ..."

"ఏదీ ఇలా చూడు! ఈమధ్య ఎందుకలా దల్‌గా ఉంటున్నావు?" తన పక్కనే పడుకున్న విద్య చుబుకం ఎత్తి పట్టి ఆమె కళ్ళలోకి చూస్తూ అడిగాడు.

"అబ్బే...అదేంలేదు'' తప్పించుకోబోయింది.

"ఏమీ లేదంటే నేను నమ్మను. దేని గురించో మథనపడుతున్నావు. నువ్వు మనసారా నవ్వడం లేదు. నాకోసం నవ్వు తెచ్చుకుంటున్నావు. మనిద్దరం కలిసి బయటకెళ్ళి ఎన్నిరోజులయిందో చెప్పు. ప్రతిరోజూ నేను రమ్మంటున్నా ఏదో సాకు చెప్పి తప్పించుకుంటున్నావు. నేను నిన్ను దగ్గరకు తీసుకున్నప్పుడైనా నాకోసం ఉత్సాహం తెచ్చుకుంటున్నావు. ఎందుకిలా మారిపోతున్నావు?"

ఆ క్షణంలో తన ప్రాణంలో ప్రాణమైన రవీంద్రముందు విద్య తన హృదయావేదనంతా విప్పి చెప్పి తేలిక పడాలనుకుంది. మరు నిమిషంలో వివేకం మేల్కొంది. 'ఈ వారం రోజులూ ఏ గొడవా లేకుండా కాలం దొర్లిపోయినప్పుడు నీ మనసులో సృష్టించుకున్న అర్థంలేని ఆలోచనలను, భయాలను అతడి ముందుపెట్టడం అనుచితం' అంతరాత్మ హెచ్చరించగానే విద్య మనసుకు తెరకప్పేసింది. "ఏ సమస్యాలేనప్పుడు మీతో ఏం చెప్పగలను? మీ సాహచర్యంలో కాలం రోజులు నిమిషాల్లా గడిచిపోతున్నాయి. మీరన్నట్టు నాకిదివరలోలా దేనిమీదా ఆసక్తి ఉండటంలేదు. ఎందుకో కారణం నాకూ అంతుపట్టడం లేదు. అలా అని శారీరకంగా నాకే బాధాలేదు"

రవీంద్ర తల పంకించి – "అయితే ఓసారి డాక్టరు దగ్గరకు వెడదాంరా! చెకప్ చేయిస్తాను" అన్నాడు.

"అలాగే తప్పకుండా వస్తాను"

"ఈ రోజయినా బయటికొస్తావా లేదా?" రవీంద్ర అడిగాడు.

"వస్తాను" విద్య అంది.

''మొన్న భాను, సరితా కన్పించారు. నిన్ను తీసుకు రానందుకు నామీద నిష్ఠూరం వేశారు. ఈరోజు వాళ్ళింటికి వెడదాం" చెప్పాడు.

మరో వారం రోజులు గడిచేసరికి విద్యలో భయాలన్నీ దూరమయిపోయాయి. మునుపటిలా ఆమెలో ఉత్సాహం ఉరకలేసింది. విద్య మళ్ళీ మామూలు మనిషి కావడం చూసి రవీంద్ర సంతోషించాడు. మునుపట్లా ఇద్దరూ సిన్మాలు, షికార్లు సాగించారు.

ఓరోజు మధ్యాహ్నం రవీంద్ర ఆఫీసు నుండి వచ్చి భోజనం చేశాక పడకమీద వాలుతూ, "విద్యా! చెప్పడం మరిచేను. సరోజ దగ్గర్నుండి లెటరొచ్చింది. నా షర్టు జేబులో ఉంటుంది. తీసి చదువుకో" విద్యను పిలిచి చెప్పేడు. సరోజ దగ్గర్నుండి లెటరొచ్చిందని వినగానే విద్యకు ఎక్కడలేని హుషారు వచ్చింది. గబగబ షర్టు జేబులోనుండి లెటరు తీసి రవీంద్ర పక్కనే మంచంమీద కూర్చుని లెటరు ఆత్రంగా చదివింది. అంతా చదివేక చిర్నవ్వు నవ్వుతూ రవీంద్ర వైపు చూసింది.



"ఏమని రాసింది?"

"మీరు చదివారుగా..ఇక నేను చెప్పడ మెందుకు'' అంది.

"నాకసలు అర్థంకాలేదు. మీరిద్దరూ తోడుదొంగలు. నాకు తెలియని రహస్యాలు కూడా మీ ఇద్దరి మధ్య ఉన్నట్టున్నాయి" రవీంద్ర అన్నాడు.

"ప్లీజ్! అలా అనుకోకండి. మీకేం చెప్పాలన్నా సరోజ ఆజ్ఞ లేదు. ఏమయినా ఇప్పుడు ఏ కలతలూ లేవనేగా సరోజ రాసింది. ఈ లెటర్‌నుబట్టి ఆమె సంతోషంగా ఉందనే అర్థమవుతోంది. ఇక ఆ పీడకలలాంటి విషయాలు మర్చిపోదాం" అంది విద్య.

"విద్యా! సాయంత్రం నా ఫ్రెండ్ భాస్కర్,వాళ్ళ మిసెస్ మనింటికొస్తారు. వాళ్లొచ్చేసరికి నేనింటికి వచ్చేస్తే గొడవ లేదు. లేకపోతే నేనొచ్చేవరకూ కూర్చోబెట్టు"

"ఏమిటి విశేషం?"

''భాస్కర్‌కు పెళ్ళయిన సంవత్సరానికే కొడుకు పుట్టేడు. వాడికి రేపటితో సంవత్సరం నిండుతుంది. బర్త్‌డే ఫంక్షన్‌కు ఘనంగా ఏర్పాట్లు చేస్తున్నాడట. ఆ ఫంక్షనుకు మనని ఆహ్వానించడానికి దంపతులిద్దరూ వస్తున్నారు" చెప్పాడు.

రవీంద్ర ఆఫీసుకెళ్ళాక వీధి తలుపు బోల్టు బిగించిపడకమీద వాలింది. విద్యకు పగటి నిద్ర అలవాటు లేకపోడంవల్ల కాసేపు ఏదో వారపత్రిక అటూ ఇటూ తిరగేసి చదవాలన్న ఇంట్రస్టు కలగక పోవడంతో పుస్తకం టేబుల్ మీదకు విసిరి బద్ధకంగా ఒళ్లువిరుచుకుని టైంపీసువైపు చూసింది. టైము మూడున్నర చూపుతోంది. టిఫిన్ తయారు చెయ్యాలని

లేవాలనుకుంటుండగానే కాలింగ్ బజర్ మోగింది.

విద్య లేచివెళ్ళి తలుపుతెరిచి గుమ్మంలో నిలబడ్డ వ్యక్తిని చూస్తూనే కొయ్యబారి పోయింది.

"ఏమిటలా నిలువుగుడ్లువేసి నిల బడ్డావు? ఇంటికొచ్చిన అతిథిని ఆహ్వా నించే మర్యాదకూడా తెలియదా?" ఆ వ్యక్తి నవ్వుతుంటే ఆ నవ్వు విద్య నర నరాన రక్తాన్ని గడ్డకట్టుకుపోయేలా చేసింది. విద్య స్పృహలోకొచ్చి ధవాల్న తలు పెయ్యబోతుండగా అతడు విసురుగా తలుపు నెట్టుకుని లోపలికొచ్చి గడియ పెట్టేడు.

విద్య గడగడ వణికిపోయింది. "తలుపెందుకు వేస్తున్నావు? ముందా తలుపు తియ్యి" అరిచింది విద్య.

"తలుపేసినంతలో నిన్నేదో చేస్తా నన్న భయం అక్కర్లేదు. నిన్ను నేనేం చెయ్యను. నిన్నేదో చెయ్యడంవల్ల నాకు ఒరిగేదేమిటి? అహ! అలా అంటే నేను ప్రవరాఖ్యుణ్ని కానుగాని కొద్దిక్షణాల ఆనందంకోసం బంగారు బాతులాంటి నిన్ను చంపుకునేంత తెలివిహీనుణ్ని కాను. నిన్నేదైనాచేస్తే పవిత్రభారతంలో పుట్టిన ఆడపిల్లవు... పవిత్రత మంటగలి సిందని వెంటనే ఉరిపోసుకుంటావు. అది నాకిష్టంలేదు. కాబట్టి ధైర్యంగావుండు. అవును..ఏమిటలా నిలబడేవున్నావు. ఇలా వచ్చి కూర్చో" అంటూ సోఫాలో తన పక్కనే చోటు చూపాడు.

విద్యకు అప్పటికే ప్రాణాలన్నీ లాగేసి నట్టు నిస్సత్తువగా ఉంది. పైగా అతడి మాటలు, చేష్టలు ఆమెకు వణుకు పుట్టేలా వున్నాయి.

"నీ ఖర్మ ... అలా నిలబడేవుండు. మొన్న నన్ను బోల్తా కొట్టించి భలే పారిపోయావు. నాకే టోపీ వేశానను కున్నావుకదూ!" అన్నాడతడు.

"అసలు నువ్వెవరో నాకు తెలియదని మొత్తుకున్నా వినవేం! నన్నిలా వెంబడిస్తూ నామీద అధికారం చెలాయించే హక్కు నీకెవరిచ్చారు?" తీవ్రంగా అంది విద్య.

నవ్వుతున్న అతడి ముఖంలో రంగులు మారాయి. "నేనెవరో నీకు నిజంగా తెలియదా?" అడిగాడు.

"తెలియదు... తెలియదు...తెలియదు" గట్టిగా అరిచింది.

"తెలియదూ?" లేచి ఆమె దగ్గరగా వచ్చి ఆమె చేతిని తన గుప్పిట బిగించి ఆమె కళ్ళలోకి క్రూరంగా చూశాడు. విద్య కెవ్వుమంది.

"వదులు...వదులు" చెయ్యి లాక్కో బోయింది విద్య.

"నా పట్టునుండి విడిపించుకోడం అంత సులభంకాదు. నిజం చెప్పేవరకూ పట్టువదలను. చెప్పకపోయేవంటే నీ చేతి నరాలు చచ్చుపడతాయి. చెప్పు....నేనెవరో నీకు తెలియదూ?" రాక్షసానందంతో పరిహాసంగా అడుగుతున్నాడు.

విద్య కళ్ళనుండి నీరు ధారాపాతంగా వర్షిస్తోంది. బాధ ఓర్చుకోడం సాధ్యం కావడంలేదు. అప్పటికే చేతి నరాలన్నీ పచ్చగా ఉబ్బిపోయాయి.

"నువ్వు ... నువ్వు దుర్గాప్రసాద్‌వి. నాకు తెలుసు" అంది.

"గుడ్! పేరుకూడా బాగా గుర్తుంది కదూ! సరే!" చెయ్యివదిలి సోఫాలో కూర్చున్నాడు.

విద్య చేతివంక బాధగా చూసుకుని కళ్లు తుడుచుకుంది.

"చూడు.నాకాకలిగావుంది. టిఫినేదైనా




వుంటే పెట్టు" అన్నాడు.

"టిఫిన్ లేదు" విద్య అంది.

"నో డియర్! ఏదడిగినా లేదు అనే మాట ఈ దుర్గాప్రసాద్ ముందెప్పుడూ విన్పించకూడదు. వెళ్ళి పావుగంటలో టిఫిన్ రెడీ చెయ్యి" ఆజ్ఞాపించాడు.

"నువ్వు నన్నెందుకిలా హింసిస్తున్నావు? నీకు నమస్కారిస్తాను వెళ్ళిపో! నిన్నిలా చూస్తే ఆయన నన్ను శంకిస్తారు. నా సంసారంలో నిప్పులు పొయ్యకు" విద్య నమస్కరిస్తూ అంది.

"ఆ భయం నీకక్కర్లేదు. ఆడాళ్ళు అబద్ధమాడితే కాంక్రీటుతో గోడ కట్టినంత స్ట్రాంగ్‌గా వుంటుంది. మీ ఆయనొచ్చి వీడు ఎవరని అడిగితే మీ అన్ననో, బావననో చెప్పు. ఆ కాసేపు నటించడానికి నాకభ్యంతరంలేదు. వెళ్ళి టిఫిన్ చేసి పట్రా. ఈలోగా మీ ఇల్లంతా చూస్తాను" అంటూ లేవగానే విద్య నెమ్మదిగా కదిలి లోపలికెళ్ళింది.

త్వరగా పూర్తవుతుందని కాస్త రవ్వతో ఉప్మాచేసి ప్లేటులోపెట్టి హాల్లోకొచ్చింది విద్య. అతడు హాల్లో కన్పించకపోయేసరికి బెడ్‌రూమ్‌లోకి తొంగిచూసింది. బెడ్‌రూమ్‌లో డ్రెస్సింగ్ టేబుల్ ముందున్న కుర్చీలో కూర్చున్న అతణ్ని చూస్తే ఒళ్ళంతా కంపరమెత్తింది. తన అసహ్యాన్ని అణచుకుని బల్లమీద టిఫిన్ ప్లేటుంచి ఆ బల్లను కుర్చీదగ్గరకు లాగి వెళ్ళబోతుంటే "విద్యా! నా అదృష్టంకొద్దీ మంచి ఆఫీసర్నే పెళ్లాడేవు. అందుకు నాకు సంతోషంగా వుంది. నీ ఇంట్లో ఫోనుకూడా వుంది కాబట్టి నాకు మరింత సులువు. అవసరమన్పిస్తే ఎప్పుడైనా ఫోను చేస్తుంటాను" అన్నాడు.

"మా ఇంటికి నువ్వు రానక్కర్లేదు, ఫోను చెయ్యక్కర్లేదు" కటువుగా అంది.

''అలా అంటే ఎలా డియర్! తెంపుకుంటే తెగే బంధమా మనది'' దుర్గాప్రసాద్ వెటకారంగా అడుగుతున్నాడు.

"బంధం....అదీ ఓ బంధమేనా? విద్య అంది.

"తప్పు తప్పు! ఈ పుణ్యభూమిలో పుట్టిన ఆడపిల్ల అనవగ్గ మాటకాదది''

"నిజమే. అలా చెప్పే నీలాంటి స్వార్థపరులు స్త్రీల జీవితాలకు అన్నివైపుల నుండి సంకెళ్లు బిగిస్తున్నారు" అంది ఆవేశంగా.

విద్య మాటలకు సమాధానమివ్వకుండా టిఫిన్ ప్లేటందుకుని టిఫిన్ తినసాగాడు. విద్య లోపలికెళ్లి టీ కలిపి గ్లాసులోపోసి తీసుకొచ్చింది. అతను టిఫిన్ తిని టీ తాగేవరకూ అసహనంగా హాలు గుమ్మం దగ్గరే నిలబడింది.

"ఇక ఇప్పుడైనా వెళ్ళిపో! ఎవరైనా వస్తే నా బతుకు నాశనమవుతుంది" దీనంగా అంది విద్య.

"టిఫిన్, టీ శ్రమపడి నిన్ను వెదుకుతూవచ్చినందుకు పుచ్చుకున్న కొద్దిపాటి ఫీజు మాత్రమే. నా పనింకా పూర్తికానిదే ఎలా వెళ్ళడం?"

"ఏమిటి నీఉద్దేశం?" విద్య అడిగింది.

"ఏంలేదు డియర్! నాకు జ్ఞాపకం వచ్చినపుడల్లా ఇలా వస్తూ పోతూ వుంటాను. రాగానే నేనడిగినంతా ఇచ్చేస్తే ఏ గొడవలేకుండా వెంటనే వెళ్ళిపోతాను. కాదంటావా..మనిద్దరి సంగతి నీ మొగుడికి ఈ ప్రపంచానికి చాటి నీ బతుకు నవ్వులపాలు చేస్తాను" అన్నాడు.

"అంటే నన్ను బెదిరిస్తున్నావా? ఆయనకు నా గురించి పూర్తిగా ముందే తెలుసు. అన్ని విషయాలూ తెలిసుండే

నన్ను పెళ్లిచేసుకున్నారు. ఇక లోకానికి గొంతెత్తి అరిచి చెప్పినా నేను భయపడను. నీఇష్టం వచ్చినట్టు చేసుకో" విద్య అంది.

"ఓహో! అన్నీ తెలిసుండే నిన్ను పెళ్ళిచేసుకున్నాడంటే అతగాడో ఫూలయి ఉండాలి. ఇప్పుడు నా పని మరీ సులువయిందన్నమాటే" తాపీగా అన్నాడు.

"ఎలా?"

"మీ ఆయన గవర్నమెంటు ఉద్యోగి. ఒకసారి పెళ్ళయిన స్త్రీ ఆమెను పెళ్లాడిన భర్తకు విడాకులివ్వకుండా ఆ స్త్రీని మరో వివాహంచేసుకోడం చట్టవిరుద్ధం. మీ ఆయనమీద నేనిప్పుడు కోర్టులో కేసు వెయ్యొచ్చు. అప్పుడు మొట్టమొదటగా మీ ఆయన ఉద్యోగం ఊడుతుంది. ఆ తరువాత మీ ఇద్దరిమధ్య కలతలు చెలరేగి అవి చిలికి చిలికి గాలివానై మీ సంసారం విచ్ఛిన్నమవ్వొచ్చు. జాబ్ పోడానికి నువ్వే కారకురాలివంటూ అతడు మాటలో నిన్ను క్షణం క్షణం రంపపు కోత కొయ్యొచ్చు. ఆ మాటలు భరించలేక నువ్వు..."

"ఇక ఆపు" విద్య విసలేనట్టంది. విద్య ముఖంలో భావాలుచూసి వికటంగా నవ్వాడు. "అర్థమైందా డియర్! అందుకే నాతో పేచీలుపడక నేచెప్పినట్టు విను" అంటూ డ్రాయరు సొరుగులాగి పర్సులో వున్నడబ్బులెక్క పెట్టి, "చూడు! ఈసారికి ఈ ఐదొందలలో సరిపెట్టుకుంటాన్లే. మళ్ళీ సారికి ఎక్కువే అవసరమవుతుంది. జాగర్తపెట్టి వుంచు. ఓకే...వస్తా" ఆ డబ్బు జేబులో పెట్టుకుని అతడు వెడుతుంటే విద్య స్థాణువులా అతడివైపు చూస్తుండిపోయింది.

అతడు వెళ్ళేక నీరసంగా కదిలివెళ్ళి వీధి తలుపు బిగించి వచ్చి పడకమీద వాలింది. ఒక్కసారిగా ఆమెలో పేరుకున్న దుఃఖం కట్టలు తెంచుకుని ప్రవహించసాగింది.

* * *

"తాతయ్యా! నాకు పెళ్ళొద్దు" పద మూడేళ్ళ వయసులో విచ్చీవిచ్చని మొగ్గ లాగున్న విద్య తాతగారి గుండెలో తలదాచుకుని అంది...ఆనాడు!

"ఏమిటి తల్లీ అంటున్నావు" విద్య తల నిమురుతూ అడిగాడా వృద్ధుడు.

"నాకిప్పుడప్పుడే పెళ్ళొద్దు.నేనుచదువు కుంటాను తాతయ్యా!అత్తతో చెప్పు"విద్య బేలగా చూసింది. ఆ కళ్ళల్లో పసితనం, ముగ్ధత్వం అతడిని కరిగించింది. గాఢంగా నిట్టూర్చి, "నేను చెప్తేమాత్రం ఆ రాక్షసి వింటుందా! నువ్వు దురదృష్టవంతురాలివి కాబట్టి,నీతల్లీ తండ్రీ దూరమై ఇలా పరుల పంచనచేరి బలిచెయ్యబడుతున్నావు"తాత కళ్ళల్లో ఉబికిన నీరు విద్యను మరింత దుఃఖంలో ముంచింది.

"తాతయ్యా! మనం ఈ ఊరొదిలి ఎక్కడికైనా వెళ్ళిపోదాం" విద్య రహస్యంగాచెప్పింది. ఆ వృద్ధుడి ఎండిపోయిన పెదవులమీద మలినమైన మందహాసం నిల్చింది. "ఎక్కడికి పోతాం? ఎలా బతుకుతాం? నా ఒంట్లో ఏమాత్రం సత్తువున్నా నిన్నీ రాక్షసులమధ్య ఉండనిచ్చేవాడినా? నేను అశక్తుణ్ణిపాపా"తన అసహాయతను తల్చుకుని అశ్రువులు రాల్చాడు.

ఆ రాత్రే మీనాక్షితో విద్య విషయం చర్చించాడు రామచంద్రరావు. "చూడు మీనా! వాడు పెళ్లి ఖర్చులకు ఉంచండి అంటూ నీ చేతికి ఐదువేలిచ్చాడంటే నాకేదో అనుమానంగా ఉంది" అన్నాడు మెల్లగా.





"అనుమానం లేదు పాడూలేదు. ఆ వచ్చిచ్చిన విషయం మర్చిపోయి మాట్లాడకుండా పడుకోండి'' విసుక్కుంది మీనాక్షి.

''అదికాదే..నేను చెప్పేది కాస్త విను" బతిమాలాడు.

'''ఏమిటి మీ గోల" చికాగ్గా ముఖం పెట్టింది.

"వాడు చేసేది కమీషన్ వ్యాపారమని, నెలకు ఆదాయం వెయ్యికి పైనే ఉందని చెప్తే ఆ మాట నమ్మి దాని గొంతు కోస్తున్నట్లున్నాం! ఈరోజుల్లో దొంగ వేషాలు వేసి అడ్డమైన వ్యాపారాలు చేసే పింజారీ వెధవలు వేషంలో డాబుగా దొరబాబుల్లానే ఉంటారు. మన విద్య కుందనపుబొమ్మలా ఉంది కాబట్టి పెళ్ళి తతంగం నడిపి తీరా పెళ్లిచేసుకున్నాక దీన్ని తీసుకెళ్లి ఏ వ్యభిచార గృహానికో అమ్మేశాడనుకో. పాపం! దాని బతుకేమవుతుందో ఆలోచించు. దాని ఉసురు మనకు కొడుతుంది. మనకూ పిల్లలున్నారు" అనునయంగా చెప్పేడు.

''ఏమిటీ...ఇదంతా మీ మట్టిబుర్రకే తట్టిందా? ఆ ముసలాడు నూరిపోశాడా? ఒకవేళ అలా జరిగినా మనకేం నష్టం. ఎవరి ఖర్మకు వాళ్లు పోతారు. కాళ్ళ దగ్గర కొచ్చిన బేరం వదులుకుంటే ఆ తరువాత దానికి మనం పెళ్లిచెయ్యగలమా?

"నన్నడిగితే దానిబరువు బాధ్యతలు ఎంత త్వరగా వదుల్చుకుంటే అంత మంచిది. ఇంట్లో మనకూ ఇద్దరాడపిల్లలు ఎదిగారు. అదే ఇంట్లో ఉంటే మన పిల్లల కోసమని వచ్చే పెళ్ళికొడుకులు మన పిల్లల్ని కాదని దాన్ని చేసుకోడానికి సిద్దపడతారు. అప్పుడు మన పిల్లలకు పెళ్ళిళ్ళయ్యేదెట్టా?''

మీనాక్షి చెప్తుంటే అదీ నిజమేనేలే అనిపించి బుర్ర తాటించాడు రామచంద్రరావు.

"అందుకే నామాట విని ఈ విషయంలో మీనాన్న ఎన్నన్నా మీరు కలగజేసుకోకండి. డబ్బు విషయం ఎక్కడైనా నోరు జారితే ప్రమాదం. జరిగేదంతా చూస్తుండండి" చెప్పేదేదో చెప్పేసి మీనాక్షి నిద్రకుపక్రమించింది.

భార్య తెలివితేటల మీద సెంట్ పర్సెంట్ నమ్మకమున్న ఆ మగాడు నిశ్చింతగా నిద్రపోయాడు.

ఇంట్లో రెండు ప్రాణాలు తిండి, నీరు ముట్టకుండా, కంటికి మంటికి ఒక్కలా ఏడుస్తున్నా పట్టించుకోకుండా మీనాక్షి పెళ్లిపనులు ఉత్సాహంగా చేయించింది. మేనకోడలి కోసం తీసిన పట్టుచీర, బట్టలు ఇంటికొచ్చినవారందరికీ రోజులో పదిసార్లు చూపిస్తూనే ఉంది. పెళ్లికొడుకు గొప్పతనం గురించి డప్పు వాయించి మరీ చాటుతూనే ఉంది. నమ్మినవారు ఆమె మాటలు నమ్మారు. నమ్మనివారు మీనాక్షి విశాల హృదయాన్ని శంకించి "ఏదో కథ ఉందని" తేల్చేశారు.

తిండి తినకపోడం వల్ల, మానసిక అశాంతివల్ల పెళ్ళినాటికి విద్య జ్వరంతో మూసినకన్ను తెరవకుండా మంచమెక్కింది.అయినా ఆ జ్వరం పెళ్లికి అడ్డు రాలేదు. ఎలాగోలా విద్యను పెళ్ళి పీటల మీద కూర్చోబెట్టి పడిపోకుండా పట్టుకుని మరీ ఆమె మెళ్ళో మూడు ముళ్ళూ వేయించింది.

ఆ తరువాత రెండురోజులు ఇంట్లో తిష్టవేసిన పెళ్ళికొడుకుతో- శోభనం

వేడుక ఇప్పుడు జరిపించటం కుదరదని, జ్వరంతగ్గేక ముహూర్తంపెట్టి కబురు పంపిస్తానని చెప్పి చల్లగా అతణ్ని పంపించేసింది. జ్వరం తగ్గిన వెంటనే కబురు పంపమని చెప్పి ఆ పెళ్ళికొడుకు వెళ్ళిపోయాడు.

విద్య జ్వరం టైఫాయిడ్‌లోకి దింపి నెలరోజులు పీల్చిపిప్పిచేసి వదిలింది. విద్య తేరుకోడానికి మరో రెండునెలలు పట్టింది.

మూడునెల్లు గడిచేక-మిగిలిన వేడుక చేసుకుని విద్యను కాపురానికి తీసుకెళ్ళ మని అతగాడికి రెండుత్తరాలు రాయించినా సమాధానం రాలేదు. అతడూ రాకపోయే సరికి అతగాడి దగ్గరకు వెళ్ళిరమ్మని భర్తను అతడున్న ఊరు పంపించింది మీనాక్షి.

వెళ్ళిన మర్నాడు సాయంత్రానికే ముఖం వేళ్లాడేసుకుని వచ్చేడు రామ చంద్రరావు. "ఆ అబ్బాయి రాలేదా?" మీనాక్షి భర్త ముఖంవేపు చూసి ఏదో అనుమానంతోనే అడిగింది.

"ఆ భ్రష్టుడు లేడు"

"ఎక్కడికెళ్లాడట? ఆ పక్కవారినడిగి తెలుసుకోవలసింది'' అంది.

"తెలుసుకున్నాను. శ్రీకృష్ణజన్మ స్థానంలో కటకటాలు లెక్కపెడుతు న్నాడట'' వ్యంగ్యంగా చెప్పాడు.

"నిజమేనా?''

"అబద్ధమాడాల్సిన ఖర్మ నాకేం! ఆరోజు మేమంతా చెప్తే విన్నావా? ఇప్పుడు కూర్చుని ఏడు"

"అలా శాపనార్థాలు పెట్టకుంటే జరిగిందేమిటో చెప్పొచ్చుగా" అంది మీనాక్షి.

"ఏం చెప్పమంటావు? వాడు పక్కా గూండా. అమ్మాయిల్ని గల్ఫ్ దేశాలకు సరఫరాచేసే ముఠాతో వీడికి సంబంధ ముందట. ఒకటి రెండు హత్యకేసుల్లో కూడా వీడున్నాడట. పాపంపండి ఇంత కాలానికి పట్టుబడ్డాడు. పదేళ్లు శిక్షవిధించి సెంట్రల్‌జైలుకు అతిథిగా పంపించారు" చెప్పాడు.

మీనాక్షి నిలువునా నీరుకారిపోయింది. ఈ విషయం పక్కగదిలోంచి విన్న విద్య అక్కడే కూలబడి వెక్కివెక్కి ఏడ్వసాగింది.

"నువ్వెందుకేడుస్తావు? నేను ఏడ్వాలి. పెళ్ళన్నది మొదలు ఒకటే ఏడుపు. దరిద్రం ముఖమా... ఫో అపర కాళిలా విరుచుకుపడింది మీనాక్షి.

విద్య తాత ఒడిలో వాలి ఘొల్లుమంది. విషయం తెలుసుకుని ముసలాయన కూడా ఏడుపు నిగ్రహించుకోలేక పోయాడు. "అయ్యో తల్లీ! ఆ మీనాక్షి తల్లి నీ నుదుటిరాతను ఎంత కసాయిగా మార్చేసింది. నీ నూరేళ్ళ బతుకును మంట గలిపింది" ఏడుస్తూ అన్నాడు.

ఆ తరువాత విద్యను మళ్ళీ చదివించ మని పట్టుబట్టాడు తాత. విద్య తల్లి దండ్రులంతరపున మిగిలినచిన్న పెంకుటిల్లు అమ్మి ఆ డబ్బుతెచ్చి రామచంద్రరావు చేతుల్లోపెట్టి- విద్య చదువుకు విని యోగించమని, దాని బతుకు తీర్చిదిద్దు కునేంతవరకూ చదువు చెప్పించమని చెప్పి కన్నుమూశాడా వృద్ధుడు. రామ చంద్రరావు మీనాక్షి ఎన్ని అడ్డుపుల్లలు వెయ్యాలని ప్రయత్నించినా అంతిమ ఘడియల్లో తండ్రికిచ్చినమాట నిలబెట్టుకో వాలనుకున్నాడు. విద్య అంటే మొదటి నుంచీ అతడికి జాలి, సానుభూతివున్నా మీనాక్షి భయంవల్ల బయటకేమీ అనలేక పోయాడు. విద్యకు చదువు చెప్పించే





విషయంలో మాత్రం ఆ భయాన్ని అధిగమించాడు.




కాలింగ్ బజర్ అదేపనిగా మోగుతుంటే విద్య ఆలోచనలనుండి తేరుకుని వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా రవీంద్ర నిలబడి "దేవిగారు పగటికలలు కంటున్నారా? ఎంత పిల్చినా తలుపు తియ్యడం లేదు" అన్నాడు. విద్య మాట్లాడలేదు.

"విద్యా! భాస్కర్ వాళ్లు రాలేదుకదూ"

"లేదు" పొడిగా అంది.

"వాళ్లావిడకు రావడం పడలేదట. వాడాఫీసుకొచ్చి చెప్పాడు. త్వరగా కాఫీ ఇవ్వు. బజారుకెళ్ళి ఏదైనా గిఫ్ట్ కొని తెస్తాను" లోపలికొస్తూనే అన్నాడు రవీంద్ర.

"అయిదు నిమిషాల్లో తెస్తాను" చెప్పి విద్య కిచెన్ వైపు వెళ్ళింది.

విద్య టిఫిన్, టీ తెచ్చేటప్పటికి రవీంద్ర "విద్యా" అని పిలుస్తున్నాడు.

"వస్తున్నా" అంటూ విద్య లోపలికి వెళ్ళి డ్రాయరుముందు నిలబడ్డ అతన్ని చూసి తొట్రుపడింది.

"మొన్న పనుండి బ్యాంకునుండి అయిదొందలు డ్రాచేసి తెచ్చి ఈ పర్సులో పెట్టాను. పర్సులో చూస్తే డబ్బు లేదు. నువ్వు తీశావేమోనని పిలిచాను"

"ఆ... అవును. నేనే తీశాను" తడబడుతూ చెప్పింది.

"నువ్వు తీశావా?" విచిత్రంగా చూశాడామెవైపు.

"ఏం... తియ్యకూడదా?" ఆమె బుర్రలో ఆలోచనలు సుడితిరుగుతున్నా పైకిమాత్రం మూతి ముడిచింది.

"అబ్బే! అలా అని నేనన్నానా? అంత అవసరం ఏమొచ్చిందా అని" అన్నాడు రవీంద్ర.

"నిన్న సాయంత్రం మామయ్య ఊర్నుండి వచ్చేడు. అత్తయ్యకు ఒంట్లో బావోలేదట. 'వైద్యం చేయించడానికి డబ్బేమైనా ఉంటే ఇమ్మని' అడిగాడు. నాకు చాలా కోపంవచ్చింది. 'మీరడిగినప్పుడల్లా ఇవ్వడానికి నా దగ్గరేమైనా నిధి ఉందా' అని విసుక్కున్నాను. 'అది కాదు విద్యా! నిన్ను చిన్నప్పట్నుండీ పెంచి పెద్దచేశాం...' అంటూ ఏదో సోది చెప్పబోయాడు. నేనా మాటలు లక్ష్యపెట్టలేదు. 'మీరెప్పుడో ఏదో చేశారని ఇలా చీటికీమాటికీ వచ్చి డబ్బడగడం మర్యాదకాదు' అన్నాను. 'నువ్విప్పుడు డబ్బివ్వకపోతే మీ అత్తయ్య నాకు దక్కదు' అంటూ కాళ్లావేళ్లా పడేసరికి జాలేసింది. డ్రాయర్లో వెతికితే పర్సులో డబ్బు కన్పించింది. వెంటనే అదిచ్చి పంపేశాను" చెప్పింది విద్య.

ఆమె చెప్తున్నంతసేపూ రవీంద్ర ఆమె వంకే చూస్తున్నాడు.

"ఏమిటలా చూస్తున్నారు? నేను .... నేను తప్పుచేశానా?" అంది.

"ఊహు! కాదు. అవసరముండి ఆయన నడిగితే ఇంత పిసినారివి ఎప్పుడయ్యావా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు.

"మీరలాగే అంటారు. అడిగిన వెంటనే ఇచ్చేస్తే అవసరాలు మళ్ళీ మళ్ళీ

పుట్టుకొస్తూనే వుంటాయి. ఇప్పుడే చెప్తున్నా..అవసరానికి మించి ఒక్క పైసా కూడా ఇంట్లో ఉంచొద్దు. బ్యాంకులో దాచండి. మళ్ళీ మామయ్యా ఎప్పుడైనా వస్తే డబ్బు లేదని చెప్పి పంపించే అవకాశ ముంటుంది" అంది.

"ఆహా.. ఏమి తెలివితేటలోయ్ భార్యా మణీ! బంధువులు, ఆత్మీయులన్నాక అవసరంలో పరస్పరం ఆదుకోకుంటే ఇక ఆ మాటకర్థమేముంది? నువ్వు మంచి పనిచేశావు. ఎప్పుడైనా డబ్బు అవసరమని మీ మామయ్యా వస్తే ఉత్తి చేతుల్తో పంపించక చేతనైనంత సాయంచెయ్యి" రవీంద్ర చెబుతుంటే విద్య కుంచించుకు పోయింది.

'అమృతహృదయుడైన భర్తను నీ తెలివితో మోసగిస్తున్నావు. ఇది అన్యాయం' అంటూ అంతరాత్మ ఆక్రోశించింది.

'నాకీ వంచన, ఆత్మవంచన తప్పదు. జీవితంలో ఈక్షణం తటస్థపడుతుందని, నా బతుకును ఆ రాహువు పట్టి పీడిస్తాడని ఊహించలేదు. ఇలా అనుక్షణం అసత్యాలమధ్య కత్తి అంచుమీద ఎంత కాలం నడవాలో' అనుకుంది విద్య ఆవేదనగా.

* * *

హాల్లోవున్న టెలిఫోన్ గణగణలాడ గానే విద్యబెడ్‌రూమ్‌లోనుండి డ్రాయింగ్ రూమ్‌కెళ్ళి ఫోనుతీసింది. "హలో! నేను విద్యను మాట్లాడుతున్నాను. మీరు..."

"నేనే... అంటే ఎవరో తెలిసిందను కుంటాను" ఆ గొంతు ఎవరిదో విద్య గ్రహించింది. తిరిగి సమాధానం చెప్పాలన్నా ఆమెకు గొంతు పెగల్లేదు.

"పాపం! నోట మాట రావడం లేదు కదూ! సాయంత్రం వస్తున్నాను. రెండు వేల రూపాయలు జాగర్త పెట్టి ఉంచు" అధికారికంగా అన్నాడు.

"రెండు వేలా?"

"చాలా తక్కువే" పరిహాసంగా అన్నాడు.

"నా దగ్గర పైసా కూడా లేదు. నువ్వు రావడం అనవసరం" అంది.

"తప్పు డియర్! లేదు అనేమాట ఈ దుర్గ దగ్గర ఎప్పుడూ విన్పించకూడదు"

"నీకేం? నువ్వెన్నయినా చెప్తావు. అంత డబ్బు నాదగ్గరెలా ఉంటుందను కుంటున్నావు? నేను డబ్బుకూర్చే యంత్రాన్ని కాను" ఆవేశంగా అంది.

"ఎందుక్కాదూ! వేలకు వేలు సంపాదించగలిగే అందం నీ సొంతం. నువ్వు 'ఊ' అంటే డబ్బొచ్చే ఉపాయం, మార్గం నేనే చూపిస్తాను. ఏమంటావు?" దుర్గాప్రసాద్ మాటలు విద్యకు కంపరాన్ని కల్గించాయి. "షటప్" అంది. బదులుగా అతడు వికటంగా నవ్వుతుండగా చటుక్కున ఫోను పెట్టేసింది.

ఆ ఫోన్‌కాల్ వచ్చినప్పట్నుండీ విద్యకు తన ప్రాణాలెవరో లాగేసినట్టయింది. నిర్జీవంగా సోఫాలో వాలిపోయింది. 'రెండు వేలంటే తనకెలా వస్తాయి? మొన్న పట్టుకెళ్ళిన ఐదొందలకే రవీంద్రకు సమాధానం చెప్పలేక, అబద్ధం ఆడలేక సతమతమయింది. మళ్ళీ ఈ రెండు వేలు ఎలా సర్దుబాటు చెయ్యాలి? అయినా ఇలా ఇవ్వడానికి అంతమెప్పుడు ఈరోజు రెండు వేలన్నవాడు మరోరోజు నాలుగు వేలు, ఆ తరువాత ఓ పదివేలు ఇలా అడుగుతూ పోతే తనేం చెయ్యగలదు అసలివ్వక పోతే అతడేం చేస్తాడో చూడాలి' విద్య నిర్ణయానికొచ్చింది.

ఆ రోజంతా అదిరే గుండెల్తో దుర్గా ప్రసాద్ ఎప్పుడు పిడుగులా వచ్చి పడతాడోనన్న బెదురుతోనే గడిపింది. అదృష్టంకొద్దీ అతడారోజు రానేలేదు.

మర్నాడుదయం రవీంద్ర ఆఫీసుకి వెళ్ళేక వంటపని ముగించి గదిలో డ్రెస్సింగ్ టేబుల్ముందు కూర్చుని తల చిక్కులు తీస్తూ టేబుల్ మీద ఫొటో స్టాండులో ఉన్న రవీంద్ర ఫొటోవైపే చూస్తుండిపోయింది 'విద్యా! అలా నీలాకాశంలోకిచూడు. బంగారు కాంతులీనే చంద్రుడెలా ఉన్నాడో చెప్పనా? సముద్రంలోని స్వర్ణకలశంలా ఉన్నాడు ఈ వెన్నెల వెలుగులో సముద్రపు తరగల నురుగులా మెరిసే నీ సోయగాన్ని చూడ్డమంటే నాకెంత ఇష్టమో తెలుసా!' అతడు తన చెవిలో గుసగుసగా అన్నట్లు భ్రమ కలగగానే విద్య ముఖం పూచిన చెంగలువయ్యింది. చిలిపిగా ఆ ఫొటో వైపు చూస్తూ-'నీ ప్రేమకంటే ఆ వెన్నెల స్వచ్ఛమైనదికాదు'స్వగతంగా అనుకుని 'ఏమిటా కొంటెచూపు! అలా నా ప్రాణాలు తీసేలా చూడకు రవీ' మూతి ముడుస్తూ అని అంతలోనే తన అభినయానికి చిన్నగా నవ్వుకుంది.

ఇంతలో కాలింగ్ బజర్ మోగింది. విద్య గుండె ఝల్లుమంది. ఆ శబ్దం ఆమె చెవులకు మృత్యు సంకేతంలా వినిపించింది. అదేపనిగా బెల్ మోగుతుంటే లేచి తలుపు దగ్గరకెళ్లి "ఎవరూ?" అంది మెల్లగా.



"నేనే... తలుపు తియ్యి" దుర్గా ప్రసాద్ గొంతు పిడుగుపడుతున్నట్టు పెళ పెళలాడింది.

విద్య భయంతో బిగుసుకుపోతూ, "నేను తియ్యను. నన్నిలా వేధించడం నీకు ధర్మంకాదు. దయుంచి వెళ్లిపో" అంది ప్రాధేయతగా.

"ముందు తలుపు తియ్యి. నువ్వు తియ్యకపోతే నలుగుర్ని పిల్చి నువ్వు లోపల ఆత్మహత్య చేసుకునే ప్రయత్నంలో ఉన్నావని అల్లరి చేస్తాను. వాళ్ళంతాతలుపులు బలవంతంగా బద్దలుకొట్టి లోపలికొస్తారు. అలా అల్లరి పడ్డానికి సిద్ధపడితే తలుపు తియ్యకు" అన్నాడు.

విద్య వాడన్నంత పని చేస్తాడన్న భయంతో తలుపు తీసింది. దుర్గ విజయ గర్వంతో నవ్వుతూ లోపలికొచ్చి సోఫాలో కూర్చున్నాడు.

"మంచి పిల్లవి! ఆకలిగా ఉంది టిఫినుంటే పట్రా" అంటూ అతడు ఆజ్ఞ జారీచేస్తుంటే వాడి పీక పట్టుకుని నులమాలన్నంత కోపమొచ్చింది. అతడి వంక మాడ్చి మసిచేసేలా చూసింది.

"ఏమిటలా చూస్తున్నావు? నీ చూపులకు నేను మాడిపోనుగాని వెళ్ళి టిఫిన్ తే" సిగరెట్ తీసి వెలిగించి గట్టిగా ఓ దమ్ము పీల్చి పొగ విలాసంగా వదుల్తూ అన్నాడు.

విద్య లోపలికెళ్ళింది.

"డబ్బు రెడీచేశావా?" టిఫిన్ తినబోతూ అడిగాడు.

"లేదు"

''లేదా? ఈ దుర్గముందు పరిహాసాలు పనికిరావు" కఠినంగా అన్నాడు.

"పరిహాసంకాదు. అంత డబ్బు నా దగ్గరెలా ఉంటుందనుకున్నావు? నువ్వు ఐదొందలు పట్టుకెళ్ళి ఇంకా వారంరోజులు కాలేదు. దాని గురించి అడిగితే ఆయనకు సర్దిచెప్పలేక అవస్థపడ్డాను" అంది.

పకపకా నవ్వాడు. ''మొత్తానికి సర్ది చెప్పేవుగా. ఆడపిల్ల..అందులోనూ అందమైన ఆడపిల్ల అబద్ధమాడినా నిజంలాగే ఉంటుంది" అన్నాడు.

"నాకు ప్రాణసంకటంలాంటి సమస్యలు నీకు పరిహాసంగా వున్నాయా? నన్నెందుకిలా బాధిస్తావు? ఇలా హింసించే బదులు ఒక్కసారి ప్రాణం తీసెయ్యి. నీకు ప్రాణం తియ్యడం పెద్ద కష్టంకాదు" రుద్ధ కంఠంతో అంది.

ఆమె శోకాన్ని చూసి వికటంగా నవ్వాడు. "నీ ప్రాణాలు తీస్తే నాకు వచ్చే లాభమేముంది. నిన్నెందుకు పెళ్ళి చేసుకున్నానో తెలుసా? నీ అందం ఎరగా చూపి నా అవసరాలకు సరిపడే డబ్బు సంపాదించాలనుకున్నాను. అందుకే మీ పిసినారి అత్తకు ఐదువేలుకూడా ఇచ్చేను. ఆ డబ్బిచ్చాకే నిన్ను నాకిచ్చి చెయ్యడానికి అంగీకరించింది మీ అత్త. నా కోసమని వండి వడ్డించుకున్న సిద్ధాన్నం మరొకడు గద్దలా తన్నుకుపోతే చూస్తూ ఊరుకోడం మగతనంకాదు. కాబట్టి నేనడిగినప్పుడల్లా డబ్బయినా ఇయ్యి...లేదంటే నేను చెప్పినట్టు విను. నేనూ నీ మొగుణ్నేగా. మన భారతీయ సంస్కృతి భార్య భర్త మాట అక్షలారా పాటించాలనేగా గోల పెడుతుంది. నేను చెప్పినట్టు చెయ్యడంవల్ల నీ పాతివ్రత్యానికి భంగం రాదులే'' అన్నాడు.

"నువ్వు చెప్పబోయేదేమిటో నాకు తెలుసు. నీమాట వినేకంటే ఆత్మహత్య చేసుకోడం ఉత్తమం. నీక్కావలసింది డబ్బేగా! ఇదిగో ఈ గాజులు పట్టుకెళ్ళి




అమ్ముకో" అంటూ కుడిచేతినున్న బంగారు గాజులు తీసి దుర్గాప్రసాద్ ఒళ్ళోకి విసిరింది.

"గుడ్! మళ్ళీ ఇదే రోజొస్తాను. ఈలోగా బాగా ఆలోచించుకో. నీకున్నవి రెండే మార్గాలు. నేనడిగినంతా డబ్బిచ్చి పంపడం...లేదంటే నేను నిర్ణయించిన వెలకు నీ అందాన్ని అమ్మడం. గుర్తుంటుందిగా" దుర్గాప్రసాద్ గాజులు జేబులో వేసుకున్నాడు.

"ఆగు! నువ్వు నన్నెంత హింసించినా నువ్వు చెప్పిన మార్గంలో నేను నడవలేను. ఇంతటితో తృప్తిపడి వెళ్ళిపో. ఇక మళ్ళీ నా ఇంటికి రాకు" అంది విద్య.

"నువ్వు రావద్దంటే మానేసే వెర్రివాడ్ని కాను. నాకు రావాలని ఉన్నపుడల్లా వస్తాను. మర్చిపోకు" చెప్పి వెళ్ళిపోయాడు

విద్య అతడు వెళ్ళగానే సోఫాలో కూలబడింది. అలా ఎంతసేపుందో ఆమెకే తెలీదు.

"ఏమిటోయ్ ఆ పరధ్యానం! దేని గురించలా దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?" రవీంద్ర పలుకరించేసరికి అప్పటివరకూ ఏమీ తెలీకుండా కూర్చున్న విద్య ఉలికిపాటుగాచూసి "మీరేనా! ఈవేళ చాలా త్వరగా వచ్చేసినట్టున్నారే?" చిర్నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అంది.

"ఇప్పుడు టైమెంత అయిందో చూడు" అంటూ చేతిని ఆమె ముందుకు చాపి "సమయమెంతయిందో కూడా తెలుసుకోలేనంత దీర్ఘాలోచనలో మునిగివున్నావన్నమాట. ఏమిటి నీ ముఖం అలా, వాడినట్టుందే?" విద్య ముఖంలోకి పరిశీలనగా చూస్తూ అన్నాడు.

"ఏంలేదు. ఏదో చిన్ననాటి సంఘటనలు జ్ఞాపకానికొస్తే అలా కూర్చుండిపోయాను. పదండి ... భోజనంచేద్దాం" అంది

రవీంద్ర సోఫాకటువైపున్న సిగరెట్టు పీకను యాష్‌నుచూసి భృకుటి ముడిచి "ఈరోజెవరైనా మనింటికొచ్చేరా?" మామూలుగా అడిగినట్టు అడిగాడు.

విద్య కళవళపడింది. అతడి చూపులు తన అణువణువును సూదులుచేసి గుచ్చినట్టు అనుభూతిపొందింది. "ఎవరూ రాలేదు. మనింటికొచ్చేవాళ్ళెవరున్నారు?" నవ్వబోతూ అంది.

"ఎవరూ రాలేదా! మరి ఈ సిగరెట్ పీక, యాష్ ఇక్కడికెలా వచ్చాయి" రవీంద్ర అడుగుతుంటే విద్య నోరు తడారిపోయింది.

"ఓ...అదా! మనంటిగలాయన వారి కాబోయే అల్లుణ్ని మీకు చూపించాలని మనింటికి తీసుకొచ్చేరు. మీరప్పటికే ఆఫీసుకెళ్ళిపోయారు. ఎలాగూ వచ్చేరుగదా బావుండదని లోపలికిపిల్చి ఆ ఇద్దరికీ కాఫీ పెట్టేను. కాఫీ తాగేక వాళ్ళ అల్లుడు సిగరెట్టు ముట్టించాడు. నాకు చిరాకేసినా పైకి అనడం సభ్యతకాదని ఆ కాసేపూ ముక్కు మూసుక్కూర్చున్నాను" చెప్పింది.

రవీంద్ర మాట్లాడకుండా లోపలికెళ్ళి డ్రస్సు మార్చుకున్నాక "హమ్మయ్య" అనుకుని తేలికపడ్డమనసుతో లోపలికెళ్ళింది విద్య.

గడియారం పన్నెండుసార్లు మూలిగి ఊరుకుంది. అప్పటివరకూ గోడవైపు తిరిగి నిద్ర నటిస్తున్న విద్య మెల్లగా ఇటు తిరిగి రవీంద్ర వైపు చూసింది. అతడు గుండెలమీద చేతులుంచి ప్రశాంతంగా నిద్రపోతున్నాడు. గాఢనిద్రలో ఏ అనుభూతులు కలలరూపంలో దాచు

కున్నాడో తెలియదుగాని చిన్నగా నవ్వాడు. అతన్ని తదేకంగా చూస్తున్న విద్య అప్రయత్నంగా నిట్టూర్చింది. 'ఎంత నిశ్చింతగా నిద్రపోతున్నారు? తన హృదయమే అశాంతికి నిలయంగా కంటికి నిద్రే కరువై బడబానలంలో వేగి పోతోంది. తను పొందిన అదృష్టం మూడునాళ్ళ ముచ్చటగా ఇగిరిపోతుందా?' మోకాళ్ళలో తలదూర్చి ఎగసివస్తున్న దుఃఖాన్ని అదిమిపెడుతోంది.

కాసేపటికి విద్య తలమీద రవీంద్ర చెయ్యి పడేసరికి విద్య ఉలికిపడుతూ నిశ్శబ్దంగా కళ్ళొత్తుకుంటుంటే రవీంద్ర లేచి ఆమెను తనవైపు తిప్పుకుంటూ- "విద్యా! ఎందుకేడుస్తున్నావు?" అడిగాడు. అతడలా అడిగేసరికి విద్య బేలయి పోయింది. అతడి గుండెలమీద తలవాల్చి జలజల కన్నీరు రాల్చింది.

"ఈమధ్య నిన్ను నేను గమనిస్తు న్నాను. దేనిగురించో బాధపడుతూ హృదయాన్ని అశాంతికి నిలయంగా చేసుకుంటు న్నావు. నా దగ్గర కూడా నీకు సంకోచ మేనా? నీ మనోవేదనేమిటో విప్పి చెప్పు" ఆమె తల నిమురుతూ అన్నాడు.

ఒక్కక్షణం తన హృదయంలో బాధంతా అతడితో చెప్పుకోవాలనిపించినా విద్యకు ధైర్యం సరిపోలేదు.

"ఏంలేదు. కలతనిద్రలో పీడ కలొ చ్చింది. అబ్బ! దాన్ని తల్చుకుంటే ఒళ్ళు జలదరిస్తోంది. మీరు వింటానంటే చెప్తాను" అంది.

"చెప్పు ... వింటాను" రవీంద్ర వినడానికుద్యుక్తుడయ్యాడు.

విద్య చిన్న కథనాన్ని సృష్టించి చెప్పి చివరగా "మీరు నన్నుమానించి మీకు దూరంగా వెళ్ళిపొమ్మని శాసించారు. మీ ఆజ్ఞ శిరసావహించి మీకు దూరంగా వెళ్ళిపోయాను. ఆ భావం నిద్రలో కూడా నన్ను దుఃఖవివశను చేసింది. ఏమండీ! ఎప్పుడూ మీ ప్రేమకు నన్ను దూరం కానివ్వనని ఏ పరిస్థితులోనూ నన్ను మీనుండి వేరుచెయ్యనని నాకు మాటివ్వగలరా?" విద్య రుద్ధ కంఠంతో బేలగా అంటుంటే రవీంద్ర విచలితుడయ్యాడు.

"ఒట్టి కలకే ఇంతగా కదిలిపోయే పిచ్చిపిల్లను నిన్నే చూస్తున్నాను. ఏ వ్యాపకమూలేక ఇలాంటి పిచ్చి కలలు కంటూ అవి జీవితానికి అన్వయించుకొని మథనపడ్డం పిరికివాళ్ళు చేసేపని. తెలిసిందా! నీకేదయినా చేతినిండా పనికల్పించి ఈ ఒంటరితనాన్ని దూరంచేస్తేగాని నీకి పిచ్చి పోదు" చిరుకోపంగా అన్నాడు.

"ఏ పని చెప్తారో సెలవియ్యండి! మీ ఆజ్ఞ మీరకుండా ఆ పని బాధ్యతగా నిర్వర్తిస్తాను" విద్య నవ్వుతూ అంది.

"బాధ్యతగా చేస్తావా?" వెక్కిరింతగా అన్నాడు.

"నామీద అపనమ్మకమా?"

"అయితే చెప్పేస్తున్నాను విను. మరో తొమ్మిది నెలల్లో ఓ బాబును కనివ్వు. నీ సిన్సియారిటీకి బహుమతి కూడా ఇస్తాను" సీరియస్‌గా అన్నాడు.

విద్య సిగ్గుతో అతడి గుండెలో తల దాచుకుని, "అది నా చేతుల్లో పనికాదని మీకు మాత్రం తెలియదేమిటి" గోముగా అంది.

"నిజమేలే. అన్నట్టు ఆఫీసు స్టాఫులో కొందరు ప్లాట్సు తీసుకుంటుంటే నేనూ ఓ ప్లాటుకి డబ్బు కట్టేను. త్వరలోనే రిజిస్ట్రేషనవుతుంది. మనకు సొంత ఇల్లంటూ ఏర్పడబోతోంది. ఆ ఇల్లెలా

ఉండాలో గృహరాణీగారు చెప్తే దాని ప్రకారం ప్లాను వేయించి ఇల్లుకట్టించు కోవచ్చు" రవీంద్ర చెబుతుంటే విద్య తన ఊహలో ఇల్లెలా ఉండాలో వివరించి చెప్పసాగింది. బెడ్‌రూమ్ ఎలా ఉండాలో దాన్నెలా డెకరేట్ చెయ్యాలో విద్య వర్ణించి చెబుతుంటే ఆమె చేష్టకు నవ్వు కుంటూ ఆమె మాట్లాడుతుండగానే నిద్ర లోకి జారాడు. విద్యకూడా అతడి చుట్టూ చెయ్యేసి హత్తుకుని పడుకుంది.

అతడి లాలనలో, సాహచర్యంలో పోయిన మానసిక బలం చేకూరినట్టయింది.

* * *

డ్రాయింగ్‌రూమ్‌లో ఫోను అదే పనిగా మోగుతుంటే విద్య గబగబ వచ్చి ఫోనెత్తింది. పమిట చెంగును మౌత్‌పీస్‌పై వుంచి కాస్త గొంతు మార్చి "హలో... ఎవరూ?" బొంగురుగా మాట్లాడింది.

"మీరెవరు?" అవతల్నుండి దుర్గాప్రసాద్ అడిగాడు.

"నాపేరు సరోజ! మీరెవరో చెప్తే..." అదే రీతిలో అడిగింది.

"సారీ..రాంగ్‌నెంబర్" అంటూ ఫోను పెట్టేశాడు. విద్య అనుకోకుండా తోచిన తన ఐడియాకు హాట్సాఫ్ చెప్పుకుంది. అంతలోనే ఆమెలో చెప్పలేని దిగులు చోటు చేసుకుంది. 'ఈ క్షణంలో వాడి బారినుండి తప్పించుకున్నా నేరుగా ఇంటి కొచ్చి వాడికవసరమయ్యే డబ్బిమ్మని జలగలా పీడించక మానడు. ఒంటి మీదున్న కొద్దిపాటి బంగారంవాడి చేతుల్లో పోసినా వాడి ఆశకు అంతముంటుందన్న ఆశలేదు. ఏదోలా పతనం చేసి తనను వాడిదారికి తీసుకెళ్ళాలన్నదే వాడి దృక్పథం. తనకీ పరిస్థితుల్లో ఉన్నది ఒక్కటే దారి. ఆత్మహత్య చేసుకోడం. తానంటూ ఈ లోకంనుండి నిష్క్రమించిన రోజునే వాడి ఆటకడుతుంది

విద్య క్షణాల్లో ఓ నిర్ణయానికొచ్చింది. అంతలోనే రవీంద్రను తల్చుకుని బేలయిపోయింది. 'తనే లేకపోతే రవి పిచ్చివాడయిపోతాడు. ఆ అమృతమూర్తికి తను అన్యాయం చెయ్యలేదు. ఆ హృదయంలో ప్రేమను పూర్తిగా పొందకుండా చావడమంటే ఈ జన్మకు సాఫల్యం పొందనట్టే. తను చావకూడదు. అసలెందుకు చావాలి? ఒక చీడ పురుగుకు వెరిచి తన నూరేళ్ళ జీవితాన్ని ఎందుకు నాశనం చేసుకోవాలి? నేను చావను...రవి హృదయంలోని ప్రేమ నీడలో నిండు నూరేళ్ల జీవితాన్ని పండించుకుంటాను' విద్యలో త్వరితగతిని నిర్ణయాలు మారాయి.

ఆమె ఆలోచనలకు తుదిరూపం లభించేసరికి మళ్ళీ ఫోను మోగింది. ఖచ్చితంగా దుర్గాప్రసాదే అయివుంటాడని ఫోనెత్తలేదు. వాగివాగి కాసేపటికి నోర్మూసుకుంది. పది నిమిషాలు గడిచాయో లేదో మళ్ళీ ఫోను గణగణలాడింది. ఈసారి కూడా విద్య ఫోను తియ్యలేదు.

ఓ అరగంట గడిచేక కాలింగ్ బజర్ మోగింది. విద్య మనసు భయంతో రెపరెపలాడింది. 'రాక్షసుడు వేధించుకు తినడానికి ఇంటికొచ్చినట్టున్నాడు. అయ్యో! వాడింట్లోకి రాకముందే నా ప్రాణాలు పోతే ఎంత బావుండును' అనుకుంది. కాలింగ్‌బజర్ అదేపనిగా మోగుతుంటే కాళ్ళీడ్చుకుంటూ వెళ్లి తలుపు తీసింది.

"ఏమిటోయ్! ఎంత పిల్చినా తలుపు తియ్యడంలేదేమిటి?" అంటూ రవీంద్ర లోపలికొస్తుంటే విద్య హృదయం తేలిక పడింది.

"రెండుసార్లు ఫోన్ చేసినా ఫోనెత్త లేదని నేనే ఇంటికొచ్చేను. నువ్వు ఎక్కడికైనా వెళ్ళేవేమో అనుకుని కంగారు పడ్డాను. అయితే ఇంట్లోనే ఉండి ఫోనెత్త లేదన్న మాట" అన్నాడు.

"క్షమించండి. మీరు ఫోన్ చేసే ముందే మరో ఫోన్ కాల్ వస్తే ఫోనెత్తి 'హలో ఎవరూ' అనగానే రాంగ్ నెంబరంటూ ఫోను పెట్టేశారు. ఫోను పెట్టిన ఐదు నిమిషాలకే మళ్ళీ ఫోను మోగితే ఆ ఆకతాయే ఫోన్ చేసి ఉంటాడని ఫోను తియ్యలేదు. మళ్ళీ పదినిమిషాలకే మరోసారి ఫోన్ మోగే సరికి నా అనుమానం నిజమేననిపించి కావాలనే ఫోను తియ్యలేదు" అంది విద్య.

"నిజమేలే. ఈ రాంగ్ నెంబర్ కాల్స్‌తో అప్పుడప్పుడూ హెడేక్ కూడా వస్తుంది" రవీంద్ర అన్నాడు.

"మీరు ఫోన్ చేశారంటే ఏదో కారణం ఉండేవుంటుంది. ఏమిటి విషయం?" అడిగింది విద్య.

"సరితకు ఈరోజు నిశ్చయ తాంబూలాలు తీసుకుంటున్నారట. ఆంటీకి సాయంగా నిన్ను పంపించమని భాను ఆఫీసుకొచ్చి చెప్పాడు. ఆ విషయం నీకు చెప్పి, వెళ్ళమందామనే ఫోను చేశాను. ఇక ఎలాగూ ఆఫీసునుండి వచ్చాను కాబట్టి ఓ పావుగంటలో రెడీ అయితే ఇద్దరం కలిసే వెళ్ళొచ్చు" చెప్పాడు.

"అలాగే... ముందు కాస్త టీ కలిపి తెస్తాను. తాగి వెడదాం" అంది విద్య.

* * *

నిశ్చితార్థం తీసుకున్నాక అతిథులు వెళ్ళిపోయారు.

సాయంత్రం అందరూ కలిసి పిక్చరుకు వెళ్లారు. పిక్చరు చూశాక హోటల్లో భోజనం చేసి రవీంద్ర, విద్య భాను వాళ్ళకు చెప్పి ఇంటికి వచ్చేశారు.

విద్యకు ఇంటికి రాగానే స్వర్గంనుండి నరకంలోకి వచ్చినట్టనిపించింది. భాను ఇంట్లో అందరి మధ్య గడపటంవల్ల రోజంతా తన సమస్యల్ని మరచి తుళ్లింత లాడుతూ కాలాన్ని గడిపేసినా ఇంటి కొచ్చేసరికి విద్య మళ్ళీ మామూలు విద్యలా మారిపోయింది. ఏక్షణాన ఆ రాక్షసుడు ఉరమని పిడుగులా ఫోన్ చేస్తాడో తెలియదు. ఏ నిమిషాన మేఘంలేని వర్షంలా ఇంటికొస్తాడో తెలియదు. హిమం కురిసే తావునే అగ్నిగుండం మండుతోంది. అమృతం చెంతనే హాలాహలం పేరుకుపోయింది.

"విద్యా! ఏమిటా పరధ్యానం? నా మాట విన్పించిందా?" రవీంద్ర పలకరింపుతో ఉలికిపడుతూ, "ఏమన్నారూ" అంది. విద్యవైపు విస్మయంగా చూశాడు రవీంద్ర. ఆ చూపుల తాకిడికి తట్టుకోలేనట్టు తలవాల్చింది విద్య.

"చూడు విద్యా! నేను నిజాన్ని ప్రేమిస్తాను. అబద్ధాలు చెప్పేవారంటే నాకసహ్యం. నేనెంత అడిగినా మనసు విప్పి మాట్లాడ్డంలేదు. నీ మనసులో ఏమీ లేదంటే నేను నమ్మను. ఆ కళ్ళవెనుక భయాల నీడలు, ముఖంలో అశాంతి ఛాయలు నేను పసిగట్టగలను. నీ కంటి చుట్టూ ఏర్పడ్డ నీలిఛాయ నీ హృదయంలో వ్యథకు అద్దంపట్టి మరీ చూపుతోంది. ఉదయం భాను ఇంటికి వెళ్ళినప్పట్నుండీ తుళ్ళింతలాడుతూ కన్పించావు. అప్పటి నీ నవ్వులో స్వచ్ఛత ఉంది" రవీంద్ర అంటుంటే విద్య మాట్లాడలేకపోయింది. ఆమె కళ్ళనుండి ముత్యాల్లా నీటి బిందువులు జలజలరాలాయి.




రవీంద్ర మనసు చివుక్కుమంది. "అర్థమైంది విద్యా! బలవంతంగా నీచేత చెప్పించడం నా అభిమతంకాదు. ఇక ఈ విషయంలో నిన్నసలు ప్రశ్నించి విసిగించను. ఒక్కటి మాత్రం గుర్తుంచుకో. కొండంత సంతోషాన్ని ఒక్కరమే భరించగలం. కాని గోరంత దుఃఖాన్ని ఒంటరిగా మొయ్యలేం. నీ బాధ ఎంతటిదైనా అది పంచుకోడానికి నేనున్నానన్న విషయం మాత్రం మర్చిపోకు" చెప్పి రవీంద్ర డ్రస్సు మార్చుకుని పడకమీదకు చేరాడు.

రాత్రంతా విద్యను పట్టించుకోనట్టే ముభావంగా ఉన్నా ఉదయం బాగానే మాట్లాడాడు. అతడు మామూలుగా మాట్లాడ్డం చూసి విద్యలో భయాలన్నీ దూదిపింజల్లా ఎగిరిపోయాయి.

"అన్నట్టు నీకో శుభవార్త" అన్నాడు రవీంద్ర.

"ఏమిటో చెప్పండి"

"అసలదేమిటో నువ్వు ఊహించి చూడు" ఊరించాడు.

"అబ్బ...సస్పెన్సా...సరే చెప్తున్నా మీకిక్కడనుండి ట్రాన్స్ఫరయింది"

"ట్రాన్స్ఫర్ శుభవార్తెలాఅవుతుంది? ఇంతమంది స్నేహితుల్ని వదిలి దూరంగా వెళ్లాలంటే కష్టంగా ఉందదూ! అదికాదు గాని మరో ఛాన్సిస్తాను...చెప్పు"

"అది కాదా? ఆ! మీకు ప్రమోషనొచ్చింటుంది" అంది.

"ఒట్టి ట్యూబ్‌లైట్. ప్రమోషన్ మరో సంవత్సరం పోతేకాని రాదు. అదేం కోదు గాని నేనే చెప్పేస్తున్నా. మనింటికి త్వరలోనే ఓ అతిథి రాబోతున్నాడు" అన్నాడు రవీంద్ర.

"నిజం చెప్పండి...రోజా వస్తోంది కదూ" రవీంద్ర భుజాలు పట్టి ఊపుతూ అంది విద్య.

"హమ్మయ్య! ఇప్పటికి బల్బు వెలిగింది. నిన్న ఉదయమే సరోజనుండి లెటరొచ్చింది. నా ఫేంట్ జేబులో ఉంటుంది. తీసి చదువుకో" చెప్పి టవల్ తీసుకుని స్నానం చెయ్యడానికి వెళ్లాడు రవీంద్ర.

* * *

సరోజను స్టేషనుకువెళ్లి రిసీవ్‌చేసుకుని ఇంటికి తీసుకొచ్చేడు రవీంద్ర. సరోజ కాస్త లావెక్కి చూడ్డానికి అందంగా వుంది.

"రోజా" సరోజను దగ్గరగా తీసుకుంది విద్య.

"వదినా" ఆమె ఆత్మీయతలో కరిగిపోయింది విద్య.

"నువ్వు తల్లివి కాబోతున్నావు కదూ?" విద్య నెమ్మదిగా అడిగింది. సరోజ కొంచెం సిగ్గుపడుతూనే తలూపింది.

"అమ్మదొంగా! ఎంత తియ్యటి వార్తను దాచుకున్నావు" అంది విద్య.

"నీకు చెప్పాలనే వదినా...అందర్నీ ఒప్పించిమరీ ఇప్పుడొచ్చేను" అంది సరోజ.

"ఆయనకీ విషయం తెలుసా?" విద్యే అనుమానంగా అడిగింది.

"తెలుసు" ముసిముసిగా నవ్వుతూ అంది.

"ఆ వార్త వినగానే ఈ రోజా పువ్వును గుండెలో దాచుకోలేదూ?"

"అంత రసహృదయం ఆ ఇంజనీరు మహాశయులకు లేదులే" అంటూ లోపలికి వెళ్ళింది సరోజ.

సరోజవున్న పదిరోజులూ నిమిషాల్లా గడిచిపోయాయి. విద్య తన హృదయంలో అశాంతిని ఆ కొద్దిరోజులూ మరిచి

పోయింది.

ఇక సరోజ రెండు రోజుల్లో వెళ్ళిపోతుందనగా ఓ రోజు ఉదయం దుర్గాప్రసాద్ ఫోన్‌చేశాడు. దైవికంగా విద్య ఫోనెత్తింది.

"విద్యా! సాయంత్రం వస్తాను. నాకు అర్జంటుగా అయిదువేలు కావాలి" చెప్పాడు.

"వద్దొద్దు. ఇంట్లో అతిథులున్నారు. వాళ్ళముందునన్ను అపరాధిని చెయ్యకు... ప్లీజ్!" ప్రాధేయతగా అంది.

"అయితే ఓపని చెయ్యి. మధ్యాహ్నం మూడింటికల్లా హోటల్ బసంతికి ఓసారి రా! రూమ్ నెంబర్ త్రిబుల్‌వన్‌లో ఉంటాను. వచ్చి నన్ను కలుసుకో" అన్నాడు.

"హోటల్‌కి నేను రాలేను"

"రాకతప్పదు. నువ్వు రాకుంటే మూడింటివరకూచూసి ఓఅరగంట గడిచేక నేనే మీ ఇంటికొస్తాను. నువ్వు వస్తావో నన్ను రమ్మంటావో నువ్వే తేల్చుకో" అని ఫోను పెట్టేశాడు.

ఫోన్‌దగ్గరే అన్యమనస్కంగా నిలబడ్డ విద్యను, "ఎవరొదినా ఫోన్ చేశారు?" సరోజ అడిగింది.

"మా స్నేహితురాలు రోజా! అది ఈ ఊరొచ్చిందట. మళ్ళీ వెంటనే వెళ్ళిపోవాలట. ఇంటికి రావడం పడదని ఓసారి నన్నొచ్చి కలుసుకోమని ఫోనులో చెప్పింది" విద్య సమయానికి తట్టిందేదో చెప్పింది.

"పోనీ ఓసారి వెళ్ళి కలుసుకుని వచ్చేస్తేసరి" సరోజ అంది.

"చూద్దాంలే" అనేసి విద్య లోపలి కెళ్ళినా ఆమె మెదడు ఆలోచనలతో వేగిపోయింది.

సరిగా మూడయ్యేక సరోజతో చెప్పి హోటల్ బసంతికి బయల్దేరింది విద్య.

రూమ్ నెంబర్ త్రిబుల్‌వన్ దారి తెలుసుకుని పరధ్యానంగా మేడ మెట్లెక్కి వెడుతుండగా మేడమీదనుండి దిగుతున్న ఓ వ్యక్తి చూసుకోకుండా ఆమెకు డాష్ ఇచ్చాడు. వెనక్కు తూలబోయిన ఆమె భుజాలు పట్టుకుని పడిపోకుండా ఆపి "సారీ మేడమ్" అన్నాడు ఆ వ్యక్తి.

విద్య అదేం పట్టించుకోకుండా పరపురుషుడు తనను తాకినందుకు లజ్జితురాలవుతూ తలవాల్చి అతణ్ని తప్పించుకుని చకచక మెట్లెక్కి వెళ్ళిపోయింది.

ఆ వ్యక్తి ఖుషీగానవ్వుకుంటూ కిందకు వెళ్ళిపోయాడు.

"ఎందుకు పిల్చావు?" విద్య అసహనంగా అతడిముందు నిలబడి అడిగింది.

"చెప్తాను...అలా కుర్చీలో కూర్చో" అంటూ స్విచ్ నొక్కాడు దుర్గ.

బోయ్‌లోపలకురాగానే టిఫిన్ ఆర్డరివ్వబోతుంటే "నాకు టిఫినొద్దు. ఒట్టి కాఫీ చాలు" అంది విద్య.

బోయ్ వెళ్ళిపోయాడు. కాఫీ తాగే వరకు దుర్గాప్రసాద్ మాట్లాడలేదు. విద్య కూడా తలొంచుకుని మౌనంగాకూర్చుంది.

"విద్యా! చిటపటలాడకుండా నేను చెప్పేది శాంతంగా విను" అన్నాడు.

"చెప్పు" అంది.

"విద్యా! నీ గురించి నువ్వేమనుకుంటున్నావో తెలియదుగాని నన్నడిగితే నువ్వు జీవితాన్ని వేస్ట్ చేసుకుంటున్నావన్పిస్తోంది" అన్నాడు.

"అదెలాగో విడమర్చి చెప్పు" విద్య అంది.

"ఈ ప్రపంచంలో అన్నిటికంటే విలువైందేమిటో చెప్పు" అడిగాడు.






"ఈ అర్థంలేని ప్రశ్నలెందుకు? నాకేమన్నా టెస్టు పెడుతున్నావా?'' విసుగ్గా అంది.

''విసుక్కోకు డియర్! అడిగిందానికి సమాధానం చెప్పు"

''నా దృష్టిలో నిర్మలంగా, ఆనందంగా గడపగలిగే జీవితం అన్నిటికంటే విలువైంది"

"నీ ఆన్సర్ తప్పు. ఏ వ్యక్తినయినా అడుగు...డబ్బు విలువైందని చెప్తాడు. కాని నేనయితే ఆడదానికి అందమే అపురూప వరమని చెప్తాను'' అన్నాడు. అతడు సంభాషణను ఎటునరుక్కు వెడుతున్నాడో అర్థమైంది. "నీ అమూల్యాభిప్రాయానికి నమోవాకాలు. ఇది చెప్పడానికే పిలిచినట్టున్నావు..వస్తా" అంటూ లేచి వెళ్ళబోతుంటే 'విద్యా' పిలిచాడు కఠినంగా.

''సిడౌన్!'' పులి గాండ్రింపులా ఉన్న ఆ కంఠధ్వని విద్యను కూర్చునేలా చేసింది.

"చూడు విద్యా! అందమైన ఆడపిల్లకు దాసోహం కాని బలహీనుడెవడూ ఉండడు అలా అంటే 'నువ్వున్నావుగా' అని నువ్వు నన్ను పరిహసించొచ్చు. నిన్ను చూసినప్పుడల్లా ముద్దముద్దగా చేసి మింగెయ్యాలనుకుంటాను. అహ! కోపగించకు. నేను ప్రవరాఖ్యుణ్ని కాను. పక్కా నాటునుండి ఫారిన్ లిక్కరు వరకూ కొట్టేసేవాణ్ని. నీ అందాన్ని

తాగకుండా ఉండటం నా శక్తికి మించిన పని. కాని, ఈ దుర్గ ఉపయోగం లేకుండా ఏ పనీచెయ్యడు. షోకేసులో ఉన్న అందమైన బొమ్మకు విలువైన చీరకడతారు. ఎవరో వస్తారు. ఆచీర అందాలనే చూస్తారో, ఆ బొమ్మ అందాల్లో ఆ చీరనే చూస్తారో తెలియదుగాని వెల చెల్లించి ఆ చీరను కొనుక్కుపోతారు. మళ్ళీ ఆ షాపు వాడు మరో చీరను ఆ బొమ్మకు చుట్టబెడతాడు. బొమ్మకు కట్టిన చీరనల్లా షాపు వాడు తీసుకోవాలనుకోడు. అది బిజినెస్ టాక్టిక్స్" చెప్తుంటే విద్య చకితయై వింటోంది.

"ఇంతకీ చెప్పేదేమంటే స్త్రీ అందానికి ఈ ప్రపంచం దాసోహమంటుంది. మగవాణ్ని చిత్తు చెయ్యగల అందం నీకుంది. నాకు తెల్సిన లక్షాధికారులున్నారు. తమకు నచ్చిన అందాన్ని వేలు గుమ్మరించయినా కొనుక్కోడానికి సిద్ధపడే వెర్రి వెధవలు వాళ్ళంతా. నీ కంటికొసచూపు వాళ్ళమీద పడ్డదంటే వాళ్ళంతా నీ పాదాలముందు మోకరిల్లడానికైనా సిద్ధపడతారు. నీముందు కనక వర్షం కురుస్తుంది. హైక్లాస్ సొసైటీలో ఇదేం నీచంకాదు. నీ కాపురానికి వచ్చే ముప్పుకూడా ఉండబోదు. మీ ఆయన ఆఫీసుకెళ్ళాక ఓ గంట నాతోపాటు, బయటికొస్తేచాలు. పదవులకోసం, ప్రమోషన్లకోసం చాలామంది మగాళ్ళు వాళ్ళ భార్యలనే ఎరలుగా ఉపయోగించడం నాకు తెలుసు. వాళ్ళకు అంటని పాపం మనకేనా అంటేది. జాగర్తగా ఆలోచించు. మూడో మనిషికి ఈ వ్యవహారం తెలియనంత చాకచక్యంగా నేను నడిపిస్తాను"

దుర్గాప్రసాద్ చెప్తుంటే విద్య దెబ్బ తిన్న ఆడ పులిలా లేచినిలబడింది! "నువ్వు మనిషివికాదు. ఆ రూపానవున్న రాక్షసుడివి. ఎప్పటికీ నీ మాట వినను. నీ బెదిరింపులకు లొంగను. నీ ఇష్టం వచ్చింది చేసుకో ఐ డోంట్ కేర్ మళ్ళీ నా ఇంటికి రావాలని ప్రయత్నించకు" చెప్పి విస విసా బయటికెళ్ళిపోయింది. •

విద్య వెడుతుంటే దుర్గాప్రసాద్ పకపకమని నవ్వాడు.

* * *

సరోజ వెళ్ళిపోయాక విద్య మళ్ళీ ఒంటరిదయింది. ఏ నిమిషంలో ఎట్నుండి ఏ అపశ్రుతి విన్పించి తన జీవితం ఛిద్రమవుతుందో తెలియదు. కాలం ఏ క్షణంలో దుర్గాప్రసాద్ రూపంలో వచ్చి తనను కాటేస్తుందో తెలియదు.

ఆ రోజు విద్య బర్త్‌డే. ఆ విషయం రవికి ముందుగా చెప్పనేలేదు. కిందటి పుట్టినరోజున రవి తనకు ప్రజంటు చేసిన చీరనే కట్టుకుంది. అది అతడి దృష్టిలో పడనే పడింది. "ఏమిటి సంగతి దేవిగారు ఈరోజు ఈ చీరను ప్రత్యేకించి కట్టుకున్నారు?'' కళ్ళెగరేస్తూ అడిగాడు.

"ఈరోజు ప్రత్యేకంగా గుర్తుపెట్టుకోవాల్సిన రోజు కాబట్టి కట్టుకున్నాను'' అంది.

"అంటే ఈవేళ నీపుట్టిన రోజన్నమాట. మరి నాకు ముందే ఎందుకు చెప్పలేదు?"

"ఆఫీసరుగారి జ్ఞాపకశక్తి ఎంతవరకు ఉందో పరీక్షించాలనే చెప్పలేదు''

"మనం మొదటిసారి పెళ్ళి విషయం మాట్లాడుకున్న రోజేదో అడుగు చెప్తాను. నాకోసం ఈ ఇంటికి మొట్టమొదటిగా వచ్చిన డేట్ అడుగు చెప్పగలను. ఇక మారేజ్ డే, ఫస్ట్‌నైట్ నిద్రలోలేపి అడిగినా చెప్పొచ్చు. ఈ సంవత్సరం పోతే నెక్స్టియర్ నీ బర్త్‌డే కూడా నేనే గుర్తు




చేస్తాను. ఈరోజు ముందుగా చెప్పక పోవడం నీ తప్పు కాబట్టి ఈ తప్పుకు శిక్షేమిటో తెలుసా?''

''చెప్పండి'' నవ్వుతూ అంది.

''సాయంత్రం త్వరగా ఇంటికొస్తాను. నేను వచ్చేటప్పటికి వంట అదీ ఇదీ అని హైరానాపడక ట్రిమ్‌గా తయారై వుండాలి. ఈరోజంతా నేను చెప్పినట్టు వినాలి'' అన్నాడు రవీంద్ర.

''అలాగే'' విద్య బుద్ధిగా తలూపింది.

మూడవుతుండగా కాలింగ్ బజర్ మోగింది. గబగబ బొట్టు దిద్దుకుని వెళ్ళి తలుపుతీసిన విద్య సంతోషం గుప్పున ఊదేసినట్టయింది.

''నువ్వా?'' అంది.

''నేనే''

''ఎందుకొచ్చేవు?''

''ఎందుకొస్తానో నీకూ తెలుసు''

''అదే విషయం మాట్లాడ్డానికయితే మా ఇంటికి రానక్కర్లేదని అప్పుడే చెప్పానుగా'' కరుగ్గా అంది.

''నువ్వెన్నిసార్లు చెప్పినా అనుకున్నది నెరవేరేదాకా పట్టినపట్టు విడవడం నా జీవితంలోలేదు'' దుర్గాప్రసాద్ లోపలికొచ్చి తలుపువేశాడు.

''అలాగా! ఈ విద్యకిష్టంలేని పనిని ఆ బ్రహ్మదేవుడుకూడా చేయించలేడు'' విద్య హేళనగా అంది.

దుర్గాప్రసాద్ డబ్బారేకుమీద దడదడ కొట్టినట్టు నవ్వి ''పూర్‌విద్యా! ఆబ్రహ్మదేవుడు చేయించలేడేమోగాని ఈమానవుడు తల్చుకుంటే అసాధ్యమైనదేదీ లేదు'' అన్నాడు.

''అంటే ఏమిటి నీ ఉద్దేశం?'' కోపాన్ని దిగమింగి అంది.

''ఇది చూడు...నీకే తెలుస్తుంది'' తెల్లటి కవరులో నుండి ఓ కాప్డ సైజు ఫొటోతీసి ఆమె చేతికిచ్చాడు.

అది చూసి బ్రాన్పడిపోయింది. తన కళ్ళముందున్న ప్రపంచం గిర్రున తిరిగినట్టయింది. ''ఏమిటిది?'' నీరసంగా పలికింది.

''అదా! విద్య అనే ఓ అందాలరాశి మొగుడి కన్నుగప్పి తను ప్రేమించిన ప్రియుడి చేతుల్లో స్వర్గలోకాలు చవిచూస్తున్న కన్నులపండువైన దృశ్యం అది. ఆమె కళ్ళల్లో కన్పించే ఆసిగ్గు ఆమె పాతివ్రత్యానికి మచ్చుతునక'' దుర్గ వెటకారంగా అంటుంటే విద్య హిస్టీరియా వచ్చినట్టు ఊగిపోతూ ''నో నో...ఇది అన్యాయం'' గట్టిగా అరిచింది.

''ష్...అరవకు! ఆ ఫొటోకు సంబంధించిన యధార్థ కథనం నాకు తెలుసు. నువ్వు నామాట వినకుంటే పైన చెప్పిన కథనం ఈ ఫొటోతోసహా పేపర్లో పడుతుంది. అదిచూసి నీప్రాణనాథుడు నిన్నసహ్యించుకుని వదిలేసిపోతాడు. నలుగురూ నీ ముఖాన పతిత అని ముద్రవేసి దుమ్మెత్తిపోస్తారు. నీచమైన ఆ బతుకు గడపటం ఎంత దుర్భరమో ఊహించు. దానికంటే నేను చెప్పిన మార్గమే నీకు యోగ్యం. అచ్చమైన భారతస్త్రీగా, ఆదర్శ ఇల్లాలుగా మెప్పులూ అందుకోవచ్చు, కావలసినంత డబ్బూ సంపాదించొచ్చు'' అన్నాడు.

''ఆరోజు హోటల్‌కిందుకేనా రప్పించావు? ఎంత వంచన! పరధ్యానంగా వస్తున్న నాకు డాష్ ఇచ్చేలాచేసి పక్కనుండి ఫొటో తీశావన్నమాట. అంటే అతడు కూడా...''

''నా బెస్ట్ ఫ్రెండ్. ఇటువంటి పుణ్యకార్యాల్లో నాకు రైట్‌హేండ్. ఈ ఫొటో

మీ ఆయన చేతికిస్తే పర్యవసానం ఎలా వుంటుందో ఒక్కసారి ఊహించు'' విలాసంగా ఆ ఫోటో ముందుకు చాపి అటు ఇటూ ఊపుతుంటే విద్యలో క్రోధం కట్టలు తెంచుకుని ఉరకలేసింది.

''యూ బ్లడీ రాస్కెల్! ఓ ఆడపిల్ల జీవితంతో ఆటలాడుకుంటావా? ఇదేనట్రా నీ మగతనం'' దుర్గాప్రసాద్‌మీద విరుచుకుపడి వాడి పీక పట్టుకోబోయింది. ఆమె పట్టునుండి తప్పించుకుని విద్య రెండు భుజాలూ వడిసిపట్టి నొక్కెయ్య సాగాడు. ఆమె సున్నితమైన భుజాలు నలిగిపోతుంటే భరించలేక కెవ్వుమంది. మెత్తని ఆమె స్పర్శతో దుర్గాప్రసాద్ ఇంతకాలం తెచ్చిపెట్టుకున్న నిగ్రహం సడలిపోయింది. అతడిలో దానవుడు పూర్తిగా మేల్కొన్నాడు.

విద్యకు పరిస్థితి తెలిసేటప్పటికే అతడి కౌగిట్లో ఆమె శరీరం నలిగిపోసాగింది. ''ఛీ! వదులు వదులు'' అంటూ విద్య గింజుకుంటూ (?) గిలగిల్లాడుతుంటే ఆమెను సోఫాలోకి నెట్టాడు. విద్య ఎంత పెనుగులాడినా వాడి పశుబలంముందు ఆమె అబలత్వం వీగిపోయింది. తన నిస్సహాయతకు ఆమె కళ్ళనుండి కన్నీరు జారింది. ఏదో చెయ్యాలన్న ఆవేశం ఆమెకు పిచ్చి బలాన్ని ప్రసాదించింది. వాడి శరీరంకింద ఆమె తనువు నలిగిపోతుంటే ఆ స్పర్శ భరించలేక రెండు చేతులు అతడి మెడ చుట్టూ పెనవేసి బిగించసాగింది. దుర్గాప్రసాద్ ఊపిరందక ఆమె పట్టునుండి విడిపించుకోవాలని పెనుగులాడుతున్నా విద్యకు ఇంకా ఇంకా తన సత్తువను పెంచుకుంటూ అపరకాళిలా విజృంభించింది.



విద్య ప్రాణభయంతో, అభిమానాన్ని దాచుకోవాలన్న వెర్రి తపనలో తనేం చేసిందీ తెలియదు. కాసేపటికి ఆమె చేతుల్లో బలం ఉడిగి ఒక్కసారి నిస్సత్తువ ఆవరించడంతో చేతులు తోటకూరకాడల్లా కిందకు వాలిపోయాయి. దుర్గాప్రసాద్ శరీరం దబ్బున కింద పడినప్పుడు అప్పుడు కళ్ళు విప్పార్చి చూసింది విద్య. నాలుక, కనుగుడ్లు వెలుపలికొచ్చి వికృతాకారంతో విగత జీవిలా వెల్లికిలాపడున్న అతణ్ని చూసి భయంతో కెవ్వుమంది. వణికిపోతూ కళ్లు గట్టిగా మూసుకుంది. ఆమె మస్తిష్కం మొద్దుబారిపోయింది.

సరిగ్గా అప్పుడే రవీంద్ర దగ్గరగా వేసి ఉన్న తలుపుతోసి లోపలికడుగుపెట్టి కిందపడున్న పురుషాకారాన్ని, సోఫాలో కూర్చున్న విద్యనుచూసినిశ్చేష్టుడయ్యాడు. ఆ షాక్‌నుండి తేరుకుని దుర్గ ముఖంవైపు తదేకంగా చూసిన రవీంద్రకు భయంతో ఒళ్లు జలదరించింది. దగ్గరగా వెళ్ళి పల్స్ చూశాడు. అప్పటికే శరీరం చల్లబడసాగింది. ''మైగాడ్! హి ఈజ్ డెడ్'' రవీంద్ర అనుకున్నాడు.

"విద్యా" పిల్చాడు.

విద్య తుళ్ళిపడి కళ్ళెత్తి భయంభయంగా భర్తవైపు చూసింది.

"ఏమిటిది?" దుర్గ డెడ్ బాడీని చూపిస్తూ అడిగాడు.

"ఈ బ్రాహ్మణ్ని నేనే చంపేశాను. నా చేతుల్తో యమసదనానికి పంపించేశాను. నాకిప్పుడెంతో తృప్తిగావుంది. నా జీవితాన్ని పట్టిపీడించే శని వదిలిపోయింది''వికటంగా నవ్వుతూ చెప్తుంటే-

"షటప్" విద్య చెంప ఛెళ్లు మన్పించాడు. విద్య దోసిట్లో ముఖముంచి ఏడవసాగింది.

"విద్యా! ఏడవకు. అసలేం జరిగిందో చెప్పు. ఎవరితడు? అతణ్ని చంపాల్సిన అవసరం ఏమొచ్చింది?'' విద్య దగ్గరగా వెళ్ళి అనునయంగా అన్నాడు.

"నో నో! ఐకాంట్ సే'' విద్య తల అడ్డంగా ఊపుతూ అంది.

"ప్లీజ్...విషయమేమిటో ఇప్పుడైనా నాతో చెప్పు విద్యా! మనమెంత ప్రమాదంలో ఉన్నామో నువ్వు ఊహించడం లేదు. ఈ విషయం ముందుగా పోలీసులకు తెలియజెయ్యాలి. నీమీద కేసుపెట్టి నిన్ను అరెస్టుచేస్తారు. కోర్టులో నిన్ను దోషిగా నిలబెట్టినప్పుడైనా నిన్ను రక్షించు కోవలసిన బాధ్యత నామీద వుందిగా! నిజానిజాలు నాకైనాతెలిస్తే నిన్ను రక్షించడానికి అవకాశం ఉంటుంది. ఎంత డబ్బు ఖర్చయినా సరే మంచి ప్లీడరును పెట్టి వాదించి నీకు శిక్షపడకుండా చూస్తాను. చెప్పు విద్యా! అసలేం జరిగింది?" రవీంద్ర అడిగాడు.

విద్య కళ్ళు తుడుచుకుని తన పదమూడేళ్ళ వయసులో దుర్గాప్రసాద్‌తో తన వివాహం జరిగినప్పట్నుండీ ఈనాటి వరకూ జరిగిన సంఘటనలన్నీ రవీంద్రతో వివరంగా చెప్పింది. అంతా విని రవీంద్ర నిట్టూర్పు విడుస్తూ-"ఎంత పని జరిగింది. ఇంత బడబానలాన్ని నీలో ఇముడ్చుకుని అశాంతితో వేగిపోయావా? ఎన్నిసార్లు అడిగినా ఒక్కసారయినా ఈ విషయాలు నాతో చెప్పలేదెందుకు? నన్నో కసాయివాడిగా ఊహించావు కదూ" బాధగా అన్నాడు.

"లేదు. చెప్తే ఇంతవరకూ నామీద మీకున్న ప్రేమ ఇంకిపోతుందని భయపడ్డాను. మీరు ద్వేషిస్తే భరించలేను. అందుకే చెప్పలేదు" ఏడుస్తూ అంది.

"నన్నర్థం చేసుకోడంలో పూర్తిగా పొరబడ్డావు విద్యా! నీ అవివేకంతో నాకెంత శిక్ష విధించావో నీకు తెలియడం లేదు. కాలం క్రూరంగా మనను విడదీస్తోంది. నాకు ఒంటరితనాన్ని, అవమానాన్ని మిగిల్చావు. ఒక్కసారయినా మనసు విప్పి నాతో నీ వ్యధను చెప్పివుంటే ఇంత అనర్థం జరిగేదికాదు" రవీంద్ర బాధగా అంటుంటే విద్య కన్నీటితో అతడి పాదాలు తడపడం తప్ప ఒక్కమాటయినా మాట్లాడలేదు.

"అయ్యో! ఇప్పుడేం చెయ్యడం? పోలీసులకు ఫోన్ చెయ్యకుంటే చట్టరీత్యా మనం నేరస్థులమవుతాం. ఫోనుచేస్తే నిన్ను నానుండి కర్కశంగా విడదీస్తారు" రవీంద్ర మథనపడుతుంటే, "ఫరవాలేదు ఫోన్‌చెయ్యండి. నేనీ పని చేసినందుకు బాధపడ్డంలేదు. వీడొక్కడిని చంపడం వల్ల నాలాంటి యువతులెందరో ఇటువంటి నరరూప రాక్షసుడి క్రూరహస్తాలమధ్య నలిగి నాశనమవకుండా రక్షింపబడతారు. ఇటువంటివాళ్ళకు తగినశిక్ష అదే'' విద్య అంది.

ఐదు నిమిషాలసేపు రవీంద్ర పిచ్చివాడిలా నిస్తేజంగా కూర్చుండి పోయాడు. ఆ తరువాత ఫోన్ దగ్గర కెళ్లాడు.

* * *

ఈ హత్య విషయం క్షణాలమీద ఊరంతా గుప్పుమంది. విద్యను ఎరుగున్నవారు "విద్య హత్య చేసిందా? మేము నమ్మం. ఆమె చాలా నెమ్మదస్తురాలు'' అని విస్మయాన్ని ప్రకటిస్తే, మరికొందరు "అమ్మో! ఆడది మగాణ్ని చంపేసిందా? ఆడెంత రాక్షసో'' అంటూ బుగ్గలు నొక్కుకున్నారు.

''దానికీ పీడికీ మధ్యవున్న సంబంధ మేమిటో? ఏకథా కమామిషూ లేకుండా ఈ ఘోరం ఎలా జరుగుతుంది?'' అంటూ కొందరు వింత వింత కథలల్లి ప్రచారం చేశారు.

రవీంద్రను ఎరుగున్నవారు కొందరు అతణ్ని చూసి సానుభూతి కురిపిస్తే, మరి కొందరు అసమర్థుడన్న భావంతో వెక్కిరింతగా చూశారు. అన్ని అవమానాలను రవీంద్ర హాలాహలంలా దిగమింగాడు. ఈ స్థితినుండి విద్యనెలాగైనా బయట పడెయ్యాలన్న పట్టుదలతో మనస్థయిర్యాన్ని కూర్చుకుని విద్య తరఫున వాదించడానికి మంచి ప్లీడర్ని సంప్రదించాడు.

ఫర్వాలేదన్నాడాయన!

ముద్దాయి చెప్పిన కథనాన్ని బట్టి, సాక్షులిచ్చిన ఆధారాలను బట్టి, హతుడి చరిత్ర మంచిది కాకపోవడంవల్ల, అతడింతకుముందే నేరస్తునిగా రికార్డుల్లో ఎక్కడంవల్ల విద్యకు పెద్దగా శిక్ష పడలేదు. ఐదేళ్ళ జైలుశిక్షను విధించారు.




గతస్మృతులనుండి తేరుకున్న విద్యకు కన్నీటితో చెంపలు తడిశాయి. కన్నీరు తుడుచుకుని అలిసిపోయినట్టుగా కళ్ల మూసుకుంది.

విద్యకు మళ్ళీ మెలకువొచ్చేసరికి బాగా చీకటిపడింది. మొదట తనెక్కడున్నదీ అర్థంకాలేదు. పరిసరాలను చూసేక తనెక్కడున్నదీ గుర్తొచ్చింది. లేచి గదిలో లైటువేసి బయటికొచ్చింది. విద్యను చూడగానే సూర్యావతి నవ్వుతూ, "ఇప్పటికి లేచారా! మీ గదిలోకి ఎన్నిసార్లు తొంగిచూసినా మీరు నిద్రపోతూనే కనిపించారు" అంది.

ఈ ఐదేళ్ళ కాలంలో ఇలా ఒళ్లుమరిచి నిద్రపోగల్గిందీ ఒక్కరోజే – అనుకుంది విద్య. "ఏమిటో....అలా మత్తుగా నిద్ర పట్టేసింది. అన్నట్టు అయ్యగారింటికొచ్చేరా?" అడిగింది విద్య.

"ఇందాకే వచ్చి స్నానంచేసి మళ్ళీ బయటికెళ్ళేరు". చెప్పింది.

''తేజ ఏంచేస్తోందో?'' అడిగింది విద్య.

''మేడమీద ప్రైవేటు చెప్పించుకుంటోంది. అమ్మా! మీరు స్నానంచేసివస్తే భోజనం పెడతాను'' అంది సూర్యావతి.

''ఇప్పుడప్పుడే భోజనంవద్దు. ముందు ఓ కప్పు టీ చేసివ్వు. తలపగిలిపోతోంది'' చెప్పి విద్య స్నానం చెయ్యడానికి వెళ్ళింది.

రాత్రి పదకొండు గంటలయ్యింది. తొమ్మిదింటికే రవీంద్ర ఇంటికొచ్చి భోజనంచేసి మేడమీదకెళ్లాడని సూర్యావతి చెప్పింది. తేజ భోజనంచేసి కాసేపు తనదగ్గరే కూర్చుని కథలు చెప్పించుకుని నిద్రపోయింది. రవీంద్ర వచ్చేక సూర్యావతి పడుకున్న తేజను ఎత్తుకుని వెళ్ళి మేడమీద పడుకోబెట్టి వచ్చి, ఆమెకూడా భోజనంచేసి వంటిల్లు సర్దేసి లైట్లార్పివెళ్ళి ఔట్‌హౌస్‌లో పడుకుంది.

విద్యకు నిద్ర పట్టనేలేదు. తనగదిలో లైటార్పి వెళ్ళి కిటికీదగ్గర నిలబడింది.




'రవీంద్ర పిలిపించగానే తనతో ఏదో మాట్లాడతాడన్న ఆశతోనే లోపలి కొచ్చింది. అతడు తనతో మాట్లాడలేదు సరికదా తనకెదురు పడనైనాలేదు. అతడు తనను ఆదరిస్తాడనే ఆశకూడా చెదిరిపోయింది. తను హంతకిగా ముద్ర వేయించుకోగానే అతడు తనను మరిచి మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడు. బిడ్డను కన్నాడు. ఇప్పుడిక తనకెలా న్యాయం చెయ్యగలడు? తను అతడింట స్థానం అడగడంలో కూడా అర్థం లేదు. ఇప్పటికే అతడు రెండో పెళ్లి వల్ల కూడా సుఖపడ్డం లేదన్నది వాస్తవం. ఈ పరిస్థితుల్లో తను మళ్ళీ అతడి జీవితంలో ప్రవేశిస్తే ఈపాటి శాంతిని కూడా తుడిచి పెట్టినట్టవుతుంది. తనెలానూ అన్ని విధాలా దురదృష్టవంతురాలే. తన దురదృష్టాన్ని అతడికిపంచిబాధపెట్టకూడదు" విద్య క్షణాలమీద ఓ నిర్ణయానికొచ్చింది.

గదిలో మూలగానున్న టేబుల్‌ను గది మధ్యగా లాగింది. దానిమీద చిన్న స్టూలు వేసింది. కట్టుకున్న చీర విప్పి టేబుల్ మీదున్న బల్ల మీదకెక్కి పైనున్న సీలింగ్ ఫేన్‌కు చీరముడేసి మరో కొసను మెడ మీదికి ముడి వేసుకుంది. తను నిలబడ్డ బల్లను కిందకు నెట్టాలని ప్రయత్నిస్తుండగా తలుపులు తెరుచుకున్నాయి. లోపల దృశ్యాన్ని చూసి " విద్యా" ఒక్క కేక వేశాడు రవీంద్ర. ఒక్కంగలో టేబిల్ మీదికి



ఎగిరి ఆమె మెడకు వేసుకున్న ముడి విప్పి కిందకు దింపాడు. మరుక్షణం చాచి చెంపకాయ వేశాడు రవీంద్ర.

ఆ దెబ్బకు విద్య అదిరిపోయింది. దుఃఖం సుళ్ళు తిరుగుతూ పొంగివచ్చింది. రెండు చేతుల్లో ముఖం పెట్టి వెక్కి వెక్కి ఏడుస్తున్న విద్యను విసురుగా కౌగిట్లోకి లాక్కున్నాడు. ఒక చేత్తో ఆమెను తనలోకి పొదువుకుని మరో చేతిని ఆమె తలమీద పెట్టి సున్నితంగా నిమిరాడు.

విద్యకిది కలో నిజమో అర్థంకాలేదు. అతడి కౌగిట్లో గువ్వలా ఒదిగిపోయింది. ఇద్దరికీ మాటలు రావటం లేదు. ఆమె కన్నీరు అతడి ఎదను తడిపేస్తుంటే అతడి కన్నీరు ఆమె చేతుల మీద జారి పడింది.

"విద్యా! ఈ ఐదేళ్లూ విధించిన శిక్ష చాల్లేదా?? ఇంకా నన్ను శిక్షించాలను కున్నావా?" బొంగురు బోతున్న కంఠంతో అన్నాడు రవీంద్ర.

"ఏమండీ" బేలగా చూసిందతడి వైపు.

"అవును. నీకోసం ఈ ఐదేళ్లు నిరీక్షిం చాను. నువ్వు తిరిగి నా ఇంటికి వస్తావని, మళ్ళీ మన జీవితంలో వెన్నెల కురుస్తుందని ఎదురుచూశాను. వచ్చినట్టే వచ్చి నన్నిలా శిక్షించి నా జీవితంలో సుఖశాంతుల్ని దూరం చెయ్యాలను కున్నావా?" నిష్టూరంగా అన్నాడు.

"నేనలా అనుకోలేదు. మీ జీవితంలో సుఖశాంతులు నా రాకవల్ల దూరం కాకూడదనుకున్నాను. అందుకే..." ఆపై మాట్లాడలేకపోయింది.

"నువ్వుత్త ఫూల్‌వి" కోపంతో పళ్ల బిగిస్తూ అన్నాడు. విద్య అతడి ముఖం లోకి అపురూపంగా చూసింది.

"నువ్వసలు ఏనాడూ నన్నర్థం చేసు కోడానికి ప్రయత్నించలేదు. నువ్వు నన్ను నిజంగా అర్థం చేసుకుని ఉంటే మన జీవితాలు అస్తవ్యస్తమయ్యేవి కావు" రవీంద్ర మాటలకు దోషిలా తలవాల్చింది విద్య.

"నిజమే. ఆనాడే మీకు నిజం చెప్పి ఉంటే ఐదేళ్ళకాలం మన చేతుల్లోనుండి నిస్సారంగా జారిపోయేదికాదు" విద్య అంది.

"పద.. మేడమీదకి వెడదాం" అంటూ రవీంద్ర విద్యను మేడమీదకు తీసుకెళ్ళి, 'మనిల్లు చూడు' అంటూ అన్ని గదులూ తిప్పి చూసి ఓ గది ముందాగి తలుపు తెరిచి ట్యూబ్‌లైట్ వెలిగించి "రా లోపలికి" అన్నాడు.

విద్య ఒకసారి లోపలికి తొంగిచూసి సంకోచంగా బయటే ఆగిపోయింది.

"అలా సంకోచిస్తున్నావెందుకు? ఇదే మన బెడ్‌రూమ్. లోపలికొచ్చి చూడు" విద్య చెయ్యి పట్టి లోపలికి నడిపించాడు. గది మధ్య నిలబడి గదిఅలంకరణను విస్మయంగా చూస్తూ నిలబడ్డది.

"ఏమిటలా ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డావు! నీకెటువంటి డిజైన్లో ఇల్లు కావాలో, ఇంటికెటువంటి హంగులు వుండాలో, ముఖ్యంగా మన బెడ్‌రూమెలా ఉండాలో ఓసారి వర్ణించి చెప్పావుగా! మనిల్లు అలాగే ఉంది కదూ?" రవీంద్ర కళ్లల్లో చిలిపితనం తొంగి చూస్తుండగా అన్నాడు.

విద్య తన పట్ల రవీంద్రకున్న ప్రేమకు విచలితురాలయింది. ఆనందా శ్రువులు నిండుకోగా చిత్తరువులా నిలబడి పోయింది. రవీంద్ర ఆమె దగ్గరగా వచ్చి





ఆమె భుజం చుట్టూ చెయ్యేసి ఆమె కన్నీరు ఒత్తుతూ, "ఎందుకీ కన్నీరు? ఇక నీ కళ్ళల్లో కన్నీరు చిందకూడదు. ఆ దురదృష్ట క్షణాలు దాటి వచ్చేశాం" మృదువుగా అన్నాడు.

"నన్ను మీరు క్షమిస్తున్నారా?" అడిగింది బేలగా.

"నీ మనసెటువంటిదో నాకు తెలుసు. నీ మీద నాకెటువంటి అపోహలూ లేవు" రవీంద్ర నిర్మలంగా అన్నాడు.

"ఎటువంటి అపోహలూ లేకపోతే నా మొహం కూడా చూడక నన్నెందుకింతవరకూ శిక్షించారు" చిరుకోపంగా అడిగింది.

సమాధానంగా రవీంద్ర విద్యను నడిపించి మంచంమీద కూర్చోబెట్టి తనూ ఆమె పక్కనే కూర్చున్నాడు. "విద్యా! మొదట్లో నువ్వు నానుంచి రహస్యాలు దాచావన్న కోపం ఉండేది. ఆ కోపం చల్లారక నీ దగ్గరకు రావాలన్నా ఊహించని పరిస్థితులు నన్ను ఉక్కిరిబిక్కిరి చేశాయి. వాటిని ఒంటరిగా ఎదుర్కోలేక సతమతమయ్యాను. ఒకవంక మన సంసారం గురించి జనం రకరకాల కథల్లి ప్రచారంలోకి తెచ్చారు. మరో పక్క సరోజ ఆత్మహత్య చేసుకోవడంతో తేజ బాధ్యత నామీద పడింది" రవీంద్ర చెప్పింది విని విద్య దిగ్భ్రాంతురాలయింది.

"రోజా చనిపోయిందా?" అంది వణికి పోతూ.

"అవును విద్యా! అవి నా జీవితంలో విషమ ఘడియలు. రోజా తన భర్త మూర్ఖత్వానికి శిక్షవేస్తున్నాననుకొని ఈ అన్నను దారుణంగా శిక్షించింది. కన్నబిడ్డపై మమకారమైనా రోజాకు సంకెళ్లు వెయ్యలేకపోయింది" రవీంద్ర బాధపడుతూ చెప్తుంటే విద్య మనసు ద్రవించింది. రోజా అంటే రవికెంత ప్రాణమో తెలుసు. ఆమె మరణం అతడిని బాగా కృంగదీసి ఉంటుందని ఊహించింది.

చటుక్కున అతణ్ణి ఒడిలోకి లాక్కుని, "బాధపడకండి. అంత శోకాన్ని మీరొక్కరూ భరించారన్న ఆలోచనే నాకుభయంకరంగా అన్పిస్తోంది" అతని తల నిమురుతూ అంది.

"నిజమే. అప్పుడు నీ సాహచర్యం కోసం, నీ చల్లని ఓదార్పు కోసం తపించిపోయాను. రోజా మరణానికి కారకుడైన ఆ కసాయివాడి దగ్గర పాపను వదిలిపెట్టడం ఇష్టంలేక ఆర్నెల్ల పాపగావున్న తేజను నా ఇంటికి తెచ్చుకుని ఆమె పోషణా భారం నేను తీసుకున్నాను" చెప్పాడు.

ఉదయం తేజను ఆ ఇంట్లో చూసి రవీంద్ర వ్యక్తిత్వాన్ని శంకించి తనెలా మధనపడిందీ విద్య రవీంద్రతో చెప్తుంటే అతడు నొచ్చుకుంటూ- "విద్యా! నాకు వున్నది ఒకే మనసు. అందులో నీకేనాడో స్థానమిచ్చాను. నీ ప్రేమ నిష్కల్మషమైనదని నాకు తెలుసు. అందుకే శిక్షాకాలం పూర్తవగానే నా ఇంటికొస్తావని ఎదురు చూస్తూ ఈ ఐదేళ్ళ కాలాన్ని గడిపేశాను" చెప్తుంటే విద్య హృదయం నిండా అతడి పట్ల ప్రేమభావం ఉప్పొంగింది.

"విద్యా! ఎన్నో వెన్నెల రాత్రులు నా జీవితంలో గడిచినా ప్రతిరాత్రీ నాకు అంధకారమే వరంగా మిగిలింది. మన జీవితంలో నిజమైన వెన్నెల కురిసినరేయి ఇదే విద్యా! నాకు తృప్తి శాంతి అన్నీ నీ ఒడిలోనే లభిస్తాయి" విద్యను దగ్గరగా తీసుకుంటూ అన్నాడు రవీంద్ర.



FORM IV [See Rule 8]

Statement about ownership and other particulars of CHATURA

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India? | : | Yes |
| If Foreigner, state the country of origin | : | ---- |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482. |
| 4. Publisher's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India? | : | Yes |
| If foreigner, state the country of origin | : | ---- |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482. |
| 5. Editor's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India? | : | Yes |
| If foreigner, state the country of origin | : | ---- |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482. |
| 6. Names and addresses of Individuals who own the news paper and partners or share holders holding more than one percent of the total capital. | : | VASUNDHARA PUBLICATIONS 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

for VASUNDHARA PUBLICATIONS.

Date : March 1, 1986.

Sd/- RAMOJI RAO
Publisher.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly Eenadu Compound, Hyderabad - 500 482.

# నాతో మాట్లాడటమే ఒక ఎడ్యుకేషన్!
# నా మాట వింటే డబ్బుల్ ప్రమోషన్!!



మైడియర్
వెంకటేశం!
నీకీరోజు పొదుపు
వేదం గురించి
గొప్పలెక్చరిస్తానోయ్!

జాసమిన్ను వైటటా
ఫుల్లు మూను లైటటా
మల్లికన్న మూనుకన్న
* ఎన్నెస్సెస్ స్వీటటా...
టాటాటా...

*అనగా నేషనల్ సేవింగు
సర్టిఫికెట్లండి...



## జాతీయ పొదుపు సంస్థ




కమీషనర్ స్మాల్ సేవింగ్స్
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.

**రేపుని చూసేకళ్ళు బంగారు భవితకు వాకిళ్ళు**





ప్ర. ఈమధ్య జాతీయ పొదుపు సంస్థవారి ప్రకటనలు కొంచెం విరివిగా వచ్చాయి. అసలు జాతీయ పొదుపు సంస్థ అంటే ఏమిటి? ఆ సంస్థకార్యక్రమాన్ని రాష్ట్ర ప్రభుత్వం ఎందుకు చేపడుతుంది? దానివల్ల రాష్ట్రానికి ఎటువంటి లాభాలు చేకూరతాయి? కొంచెం వివరంగా చెపుతారా?

జ. మన రాష్ట్రప్రభుత్వం గత ఆర్థిక సంవత్సరంలో చివరి 3 నెలలు చిన్నతరహా పొదుపు కార్యక్రమాల ప్రకటనల్ని ఇంతకుముందెన్నడు చేయని పద్ధతులలో పత్రికల ద్వారా, రేడియో ద్వారా, ఒక వారం రోజులు టి. వి. ద్వారా కూడా ప్రసారం చేసినమాట వాస్తవమే.

దేశవ్యాప్తంగా పిల్లలనుండి పెద్దవారి వరకుపొదుపు అనే మంచి అలవాటును వివిధ పద్ధతులద్వారా కలిగించాలనేదే ఈ కార్యక్రమం ముఖ్యోద్దేశమని చెప్పవచ్చును. పొదుపు అనేది అసలు ఒక సృష్టి లక్షణం. సృష్టిలో అనవసరమైనది, దుబారా అనిపించేది ఎక్కడా కనిపించదు. చీమ దగ్గర నుండి ఏనుగు వరకు వాటి జీవితాల్లో ఒక నిర్దిష్టమైన పొదుపును పాటిస్తాయి. మానవుడికి, మిగతా జీవరాశికి గల విశిష్టమైన తేడా ఏమిటంటే మనిషి నవ్వగలడు. ఇది మానవ జన్మకున్న ఒక ప్రత్యేకత. ఎప్పుడూ నవ్వుతూ వుండాలంటే మానవునికి పొదుపు అనేది నా దృష్టిలో తిండి, బట్ట, వసతి కంటే ముఖ్యమైన కనీస అవసరం. ఆ అవసరం తీర్చడం కోసమే ప్రభుత్వంవారు ఎంతో ఆకర్షణీయంగా వివిధ పథకాలను ఈ స్మాల్ సేవింగ్స్ డిపార్టుమెంటులో ఏర్పాటుచేశారు. ఉదాహరణకి ఈ పథకాల ద్వారా మన రాష్ట్రంలో ఒక ఆర్థిక సంవత్సరంలో 100 కోట్ల రూపాయలు సమీకరించామనుకోండి. అప్పుడు కేంద్ర ప్రభుత్వంవారు ఆ 100 కోట్ల రూపాయలనుండి, 66 కోట్ల రూపాయలు తక్కువ వడ్డీతో 20 సంవత్సరాలలో తీర్చేటట్లు మనకు అప్పుగా పంపిణీచేస్తారు.

ఈవిధంగా పొదుపు పథకాలు మన రాష్ట్రాభివృద్ధికి వనరుల్ని సేకరించడంలో ఎంతో ఉపయోగపడతాయన్న మాట.

ప్ర : పిల్లలనుంచి పెద్దలదాకా పొదుపు పథకాలున్నాయన్నారు కదా! వాటి వివరాలు చెబుతారా? మీరేమీ అనుకోకపోతే మరో ప్రశ్న. మన దేశంలో నూటికి 80 మంది గ్రామాల్లో నివసిస్తున్నారుకదా? మరి వారికోసం ఎటువంటి పొదుపు పథకాలున్నాయో వివరిస్తారా?

జ తప్పకుండానండీ.చిన్నకారు,సన్నకారు రైతులకు, వ్యవసాయ కూలీలకు నెలసరి ఆదాయమంటూ వుండదని మనందరికీ తెలిసిన విషయమే. వాతావరణం అనుకూలంగావుండి పంటలు బాగా పండితే, ఆ సంవత్సరం లాభాలొస్తాయి. లేనినాడు కటకటగా వుంటుంది. పట్టణాలలోవున్నట్లు వారికి జీవితభీమా పథకాలు కూడా అంతంత మాత్రమే. ఒకవేళ జీవితభీమా పథకాల్లో చేరినా, ప్రతిమూడునెలలకో, ఆరునెలలకో,సంవత్సరానికో, క్రమం తప్పకుండా ప్రీమియం కడితేనేగాని ఆ భీమా పథకాన్ని వారు చేపట్టలేరు. అంతేగాక అటువంటి ప్రీమియాలు కట్టటానికి వారికి క్రమం తప్పని ఆదాయం, నికరమైన ఆదాయం గ్రామాల్లో వుండదు. ఇవన్నీ ఆలోచించే గ్రామాల్లోని రైతులకు, ప్రజలకు ఎంతో అనుకూలంగావుండే, ఉపయోగపడే సాంఘిక భద్రతా సర్టిఫికెట్లను ప్రవేశపెట్టాం. దీనిలో ముఖ్యమైన విషయాలు ఏమిటంటే ఎవరైనా 500 రూపాయల సర్టిఫికెట్ కొన్నట్లయితే, 10 సంవత్సరాల తర్వాత వారు కొన్న మొత్తానికి మూడు రెట్లు అంటే 1500 రూపాయలు వారికి లభిస్తాయి. ఏ బ్యాంకులో వేసినా ఇటువంటి లాభం రాదు. ఐతే ఈ పదేళ్ళ లోపు ఆ సర్టిఫికెట్ కొన్నవారు మరణిస్తే, మరణించిన మరునాడే వారు పొదుపు చేసిన డబ్బుకి మూడురెట్లు, మరణించినవారి కుటుంబానికి పోస్టాఫీసు ద్వారా అందజేస్తారు. ఇటువంటి భీమా పథకం మీరు వినియుండరనే అనుకుంటాను.

ప్ర. నిజమేనండీ! జీవితభీమాతో పాటు, ఇటువంటి మంచి పొదుపు పథకం ఉన్నట్లు రైతులకు,వ్యవసాయకూలీలకు తెలియదనుకుంటాను. ఇది



ఎవరైనా కొనవచ్చుంటారా? కొనే పద్ధతి ఏమిటి?

జ : ఈ సర్టిఫికెట్ 18 సంవత్సరాల వయస్సునుండి 45 సంవత్సరాల వయస్సు లోపున్నవారెవరైనా సరే పోస్టాఫీసుకి వెళ్ళి వారి పేరు, వయసు తెలిపి, వారి ఆరోగ్యం బాగుందని చెబితే, అప్పటికప్పుడు పోస్టాఫీసువారు ఆ సర్టిఫికెట్ ఇస్తారు.

అంతేకాదు-ఈ సర్టిఫికెట్లను సమిష్టి పేర్లతో తీసుకుని, తరువాత అవసరమైతే మరొకరి పేరు మీదకు




మార్చుకునే అవకాశం ఉంది. మైనారిటీ దాటని పిల్లల పేరు మీద కూడా ఈ సర్టిఫికెట్లను కొనే వీలుంది.

ప్ర. నిజంగా ఇంత సులభమాండీ?

జ. ఇంతేకాదండీ! సర్టిఫికెట్ కొంటున్నప్పుడు, కొన్న వ్యక్తి తనకు మరణం సంభవిస్తే వచ్చే డబ్బుని ఎవరికి అందజేయాలో కొంటున్నపుడే చెప్పాలి. ఇది ఎంత మంచి పథకం అంటే, మనం పొదుపుచేసిన డబ్బుకి మూడురెట్లు రావడమేగాక, జీవిత భీమా కూడా ఇందులో చేర్చబడింది.

ప్రతి గ్రామంలో ఒక పోస్టాఫీసు వుంది కాబట్టి గ్రామాల్లోవుండే ప్రజలంతా ఈ పథకాన్ని చేపట్టాలనేదే మా కోరిక. దీనివల్ల పొదుపు చేసిన వ్యక్తులు బాగుపడటమేగాక, రాష్ట్రాభివృద్ధికి వనరుల్ని సమీకరించడంలో తోడ్పడిన వారౌతారు.

ప్ర. పేదవారికి, నెలసరి ఆదాయమున్నవారికి మీ పథకాలు బాగున్నాయి. మరికొంచెం పై తరగతుల వారికి ఎటువంటి పథకాలున్నాయో చెబుతారా?

జ. సంపన్నులకోసం మా దగ్గర సి.టి.డి (Cumulative Time Deposit) అని పదేళ్ళ పథకం, పబ్లిక్ ప్రావిడెంట్ ఫండ్ (P.P.F) అని పదిహేనేళ్ళ ప్రత్యేక పథకాలున్నాయి. ఈ రెండు పథకాలలో జమచేసిన డబ్బు సంపద పన్నునుండి పూర్తి మినహాయింపు పొందుతుంది. అంతేగాక P.P.Fలో పెట్టిన డబ్బుని ఎటువంటి పరిస్థితుల్లోను ముట్టుకోడానికి ఏ కోర్టుకు అధికారం లేదు. ఆ డబ్బు జమచేసిన వ్యక్తికే దక్కుతుంది. అయితే C.T.Dలో నెలకు వెయ్యిరూపాయలకంటే ఎక్కువ జమ

చేయడానికి వీలులేదు. అదే విధంగా P.P.Fలో కూడా సంవత్సరానికి 40 వేల కంటే ఎక్కువ జమచేయడానికి వీలులేదు. కానీ మరో విశేషమేమంటే, ఈ రెండు ఖాతాలలో జమచేసిన డబ్బు మీద వచ్చే వడ్డీ మొత్తం ఎంతైనా సరే ఆదాయం పన్నునుండి మినహాయింపు పొందుతుంది. నెలకు 5-6 వేల రూపాయల ఆదాయమున్నవారు సంపద పన్ను తగలకుండా ఈ ఖాతాలలో జమ చేసుకుంటే మంచిది. ముఖ్యంగా 50 ఏళ్ళు పైబడినవారు సంపదపన్ను నుండి, ఆదాయం పన్ను నుండి మంచి రాయితీలు పొందాలంటే, వారికి ఈ రెండు పథకాలకు మించినవి మరొకటిలేవు. ముఖ్యంగా ఉద్యోగస్థులు కానివారికి ఈ రెండు పథకాలు కల్పవృక్షాలు లాంటివి.




ప్ర. మరి ఉద్యోగస్థుల మాటేమిటంటారు?

జ. పైచెప్పిన పథకాలన్నింటిలోను ఉద్యోగస్థులు పాల్గొనవచ్చును. నెలకింత చొప్పున ఆదా చేసుకున్నట్లయితే, అధిక వడ్డీతో పాటు ఆదాయంపన్ను నుండి మినహాయింపు పొందడానికి అవకాశముంటుంది.' ఇందుకోసం 6-7 జాతీయ పొదుపు సర్టిఫికెట్లు కొనడం మంచిది. ఇవి ఉద్యోగస్థులకే పరిమితంకాదు. ఎవరైనా కొనుక్కోవచ్చును. ఈ సర్టిఫికెట్లే దేశంలో ఇప్పుడు అత్యధిక ఆదరణను పొందుతున్నాయి. ఎందుకంటే ఇందులో జమ చేసిన డబ్బుకు అధిక వడ్డీనివ్వడంతోపాటు,ఆదాయం పన్నునుండి మినహాయింపు పొందడమేగాక ప్రతి సంవత్సరం మనకు లభించే వడ్డీని మన తరపున ప్రభుత్వమే ఉపయోగిస్తుంది. కనుక 6 సంవత్సరాల్లో సంవత్సరానికింత చొప్పున మనకి వచ్చే వడ్డీకూడా ఆదాయంపన్ను నుండి మినహాయింపు పొందుతుంది. అంటే సంవత్సరంలో మనం 10 వేల రూపాయల సర్టిఫికెట్ కొంటే, 6 సంవత్సరాల తర్వాత మనకు దానికి రెండింతలు డబ్బు లభించడమేగాక 6 సంవత్సరాల్లో సుమారు 18 వేల రూపాయలవరకు మనం ఆదాయం పన్నులో నుండి మినహాయింపు పొందవచ్చును.



ఈ 6 సంవత్సరాల జాతీయ పొదుపు సర్టిఫికెట్లు రెండురకాలుగా లభిస్తాయి. ఒకటి మనం జమ చేసిన డబ్బుకి 12 శాతం వడ్డీ ఇస్తూ, 6 సంవత్సరాల తర్వాత మనకు రెండింతలుచెల్లిస్తుంది. అలాకాకుండా 6 సంవత్సరాల, 7వ జాతీయ పొదుపు సర్టిఫికెట్ ప్రతి ఆరు మాసాలకి రూపాయి వడ్డీ చెల్లిస్తుంది. ఈ పథకం ముఖ్యంగా రిటైరయినవారికి లాభిస్తుంది. ఈ కారణాల వల్లే 7వ జాతీయ పొదుపు సర్టిఫికెట్ ప్రజల్లో ఎక్కువ ఆదరణ పొందుతోంది. అంతేగాక ఈ సర్టిఫికెట్‌లో పొదుపుకు గరిష్ట పరిమితులంటూ ఏమీలేవు.

కానీ ఏ సంస్థలు కూడా ఈ సర్టిఫికెట్లు కొనడానికి వీలులేదు. వ్యక్తులు మాత్రమే కొనాలి. పిల్లల పేరున కొన్నా, భార్య పేరునకొన్నా పైచెప్పిన లాభాలన్నీ లభిస్తాయి. ప్రభుత్వ రంగంలో ఇంత ఎక్కువ వడ్డీఇస్తూ, తక్కువ కాలంలో ఫలితాన్నిస్తూ, ఇన్ని మినహాయింపులు ఇచ్చే పథకం మరొకటి లేదనే చెప్పాలి. అదేవిధంగా ఈ పథకాల్లో లభించే సౌకర్యాలు, నామినేషన్లు, అప్పులు ఇంకెక్కడా లభించవు. ఈ పథకాల్లో జమచేసిన డబ్బుమీద ఏ బ్యాంకులోనయినాసరే 75 శాతము వరకు అప్పు తీసుకోవచ్చు. జమచేసిన డబ్బు గడువు ముగిసిన తరువాత దేశంలోని ఏ పోస్టాఫీసునుండైనా తిరిగి తీసుకోవచ్చును. సర్టిఫికెట్ పోతే, కొత్త సర్టిఫికెట్ తీసుకోవచ్చును.

**ప్ర. మరి మీ వద్ద మహిళల కోసం పథకాలేమీ లేవాండీ?**

జ. అదేమిటండీ! పొదుపు అంటే ముఖ్యంగా మహిళలేమొగ్గుచూపుతారు. నా ఉద్దేశంలో మహిళల ప్రోత్సాహం లేకుండా, ఏ కుటుంబంలోను తగినంత పొదుపు జరగదనే చెప్పాలి. అది దృష్టిలో వుంచుకునే మహిళలకోసం తమకు తెలిసిన కుటుంబాలద్వారా నెలకింతని పొదుపుచేయించే పథకాన్ని ప్రత్యేకంగా ఏర్పాటుచేశాం. ఈ పథకాన్ని "మహిళా ప్రధాన్ క్షేత్రీయ బచత్ యోజన" అంటారు. దీనికి ఏజంటయిన మహిళలకు మామూలు ఏజంట్లకిచ్చే కమీషన్‌కంటే 1 శాతము కమీషన్ ఎక్కువిస్తారు. ఇది కూడా మా పథకాల్లో ఒక ముఖ్యమైన

పథకం. ఇది కేవలం మహిళలకోసమే ప్రత్యేకించబడిన పథకం. R.D. ఖాతాలు మరియు C. T. D. ఖాతాలు కూడా వారు ప్రచారం చెయ్యవచ్చును.

ప్ర. ఈ ఏజన్సీ ఎలా తీసుకోవాలో కొంచెంవివరంగా చెపుతారాండీ?

జ. తప్పకుండా! మహిళలుగాని, పురుషులుగాని, రిజిష్టరయిన సంస్థలుగాని మా ఏజన్సీలను సులభంగా పొందవచ్చును. ప్రతి జిల్లాలోని కలెక్టరుఆఫీసులో చిన్నతరహాపొదుపు పథకాలు అమలుచేయడం కోసం ఒక ప్రత్యేక తహసిల్దారుగారుంటారు. వారికి ఈ ఏజంట్ల నియామకానికి అధికారాలుంటాయి. వారేగాక, ప్రతి మండల అధికారి, సమితి బి.డి.ఓ కూడా ఈ ఏజంట్లను నియమించవచ్చు. వీరేగాక ప్రతి జిల్లాలో డిస్ట్రిక్ట్ సేవింగ్స్ ఆఫీసరని కేంద్రప్రభుత్వ అధికారి ఒకరుంటారు. వారుకూడా ఈ ఏజంట్ల నియామక కార్యక్రమాన్ని నిర్వహించవచ్చును.

ప్ర. పిల్లలకేదో పథకముందన్నారు. అదేదో వివరిస్తారా?

జ. పిల్లలకోసం ప్రత్యేకంగా 'సంచయిక' అని ఒక పొదుపు పథకం వుందండి. చిన్నప్పటినుండే పిల్లల్లో పొదుపును అలవాటు చేయాలనే ఉద్దేశంతో ప్రతి పాఠశాలలో ఈ పథకాన్ని ప్రారంభించే ప్రతిపాదన వుంది. ముఖ్యంగా ఇది పిల్లలు తమంతట తాము పాఠశాలల్లో నడుపుకునే పోస్టాఫీసు అని చెప్పవచ్చు.

ప్ర. మీరు చెప్తున్నదాన్ని బట్టి చూస్తే, ఈ పొదుపు పథకాల ద్వారా మనం ఎన్ని వనరులు సమీకరించుకుంటే, మనమీద పన్నుల భారం అంత తగ్గుతుందన్నమాట.

జ. మీరు చాలా చక్కగా అర్థం చేసుకున్నారండీ! అసలు జాతీయ పొదుపు సంస్థకున్న ప్రాముఖ్యతే ఇది. పన్నుల భారం తగ్గాలంటే ప్రజలంతా పొదుపు చేసి తీరాలి. అంతే కాదు! అభివృద్ధి కార్యక్రమాలు మనం ఎంత పొదుపు చేస్తామో అంత చురుకుగా సాగుతాయి.



ప్ర. చాలా బాగుందండీ! ఇదికాక మీ ఇతర పథకాల వివరాలు చెపుతారా?

జ. అలాగేనండి. మా పథకాలను మనం మొదట మూడు భాగాలుగా విభజిద్దాం. మొదటి పథకం పేదవారికి, నెలసరి ఆదాయంవున్న వారికి ఉపయోగపడేది. మామూలుగా సేవింగ్స్ బ్యాంక్ అకౌంటును ఏ పోస్టాఫీసులోనైనా తెరవవచ్చు. అందులో ఏ బ్యాంకు ఇవ్వనంత వడ్డీ (5% శాతం) ఇస్తారు. ఒక వ్యక్తి 5 రూపాయలనుండి 25 వేల రూపాయల వరకు తన అకౌంటులో వుంచుకోవచ్చు. ఇందులో గమనించదగ్గ విషయాలేమంటే, ఈ సేవింగ్స్ బ్యాంకు ఖాతాలో వచ్చిన వడ్డీ మొత్తమంతా, ఆదాయంపన్ను నుండి మినహాయించబడుతుంది. అంతేగాక దేశస్థాయిలో ఈ సేవింగ్స్ బ్యాంక్ ఖాతాలకు ప్రతి 6 నెలలకు ఒకసారి లాటరీ నిర్వహించబడుతుంది.






అందులో లక్ష రూపాయల మొదటి బహుమతి, 10 పదివేల రూపాయల బహుమతులు, 5 ఐదువేల రూపాయల బహుమతులు - ఇలా ఎన్నెన్నో బహుమతులున్నాయి. ఈ ఖాతాకు చెక్కుపుస్తకం కూడా ఇస్తారు. ఇందులో జమచేసిన డబ్బు మన రాష్ట్ర వాటాకి తోడ్పడుతుంది. కాబట్టి దీన్ని గ్రామాల్లో, పట్టణాల్లో నివసించే ప్రతి ఒక్కరు చేయదగిన కార్యక్రమమని చెప్పవచ్చు.

ఇదే కోవకి చెందింది, అన్ని తరగతులవారికి ఉపయోగపడేది మరో పథకం వుంది. దాన్ని రికరింగ్ డిపాజిట్ (R.D. Scheme) పథకం అంటారు. దాన్లో 11% శాతం వడ్డీని తీసుకుంటూ, నెలకు ఇంతని, 5 సంవత్సరాలపాటు పరిమితిలేకుండా ఎన్ని రూపాయలనైనా దాచుకుంటూ వుండొచ్చు. ఈ పథకం విశేషమేమంటే

2 సంవత్సరాలు క్రమంగా కట్టి, నెలకు 50 రూపాయలలోపు కడుతున్నవారు, అకస్మాత్తుగా మరణిస్తే, 5 సంవత్సరాల తర్వాత వారికి ఎంత డబ్బు ముడుతుందో అంత డబ్బుని వారు మరణించిన మరునాడే వారి కుటుంబానికి అంద జేస్తారు. ఇలా 5 సంవత్సరాలకు కాకుండా సంవత్సరానికి, 2 సంవత్స రాలకు, 3 సంవత్సరాలకు కూడా

పూర్వక అంగీకారము తెల్పితే, నెల నెలా అతను కోరిన మొత్తమును ఆ సంస్థే అతని పేర జమచేస్తుంది. దీనికై ప్రభుత్వం ఆ సంస్థ యజమానికి ప్రతిఫలంగా వసూళ్ళనుండి $2\frac{1}{2}$ శాతం చెల్లిస్తారు. అంతేకాక 25 వేల ఉద్యోగులను ఈ పథకములో చేర్పిన యజమానులకు 1500 రూ॥లు బహుమతులు లేదా షీల్డ్ రూపంలో వారి సంస్థలకు అందజేస్తారు.




టైమ్ డిపాజిట్ పథకాలువున్నాయి. అంతేకాదు–

ఉద్యోగస్థులకు 'పేరోల్ సేవింగ్ స్కీము' అను మరొక పథకం కూడా వుంది. ఏ ఉద్యోగి అయినా తన జీతమునుండి కొంత సొమ్మును తగ్గించి 5 సం॥ల రికరింగు లేదా 10 సం॥ల క్యుములేటివ్ టైమ్ డిపాజిట్ లో తన పేర జమచేయమని కోరుతూ తన యజమానికి లిఖిత

ప్ర. ఇన్ని పథకాలున్నాయి కదా! వీటిని అమలుచేసే పద్ధతేమిటో చెపుతారా?

జ. ఈ పథకాలన్నీ ప్రచారం చేయ డానికి అటు కేంద్రప్రభుత్వాధికారులు, ఇటు రాష్ట్రప్రభుత్వాధికారులు కొంత వరకు కృషిచేస్తున్నారు. అంతేగాక మా పథకాలన్నింటికి కూడా ఏజంట్లు వుంటారు. వారికి ఆకర్షణీయమైన కమీషన్ లభిస్తుంది. ఈ ఏజన్సీల

ద్వారా సంవత్సరానికి 75వేల రూపాయల వరకు కమీషన్ సంపాదించినవారు కూడా మన రాష్ట్రంలో వున్నారు. నిజంగా చెప్పాలంటే మన రాష్ట్రంలోని విద్యావంతులయిన యువకుల నిరుద్యోగ సమస్యను పారదోలడానికి ఇది ఒక చక్కటి పథకమనే చెప్పాలి. అంతేగాక గ్రామాల్లో, పట్టణాల్లోవున్న మహిళామండలులు, యువజన కేంద్రాలు, రిజిష్టరయిన ఇతర సంస్థలు ఈ ఏజన్సీలనుచేపట్టి, ఆ కమీషన్ద్వారా వచ్చే ఆదాయాన్ని ఆయా సంస్థల అభివృద్ధికి ఉపయోగించుకోవచ్చును.

ప్ర. ఇది ఆఖరి ప్రశ్నండి! మన రాష్ట్రంలో ఈ పొదుపు పథకాల ద్వారా ఎంత డబ్బు సేకరిస్తున్నారు? దాంట్లో మన వాటాకి ఎంత వస్తుంది? దేశస్థాయిలో మన రాష్ట్రం ఈ కార్యక్రమం నిర్వహణలో ఎటువంటి స్థాయి నందుకుందో కొంచెం చెప్తారా?

జ. ఇతర రాష్ట్రాలతో పోల్చి చూస్తే మన రాష్ట్రం ఈ పథకాలద్వారా చాలా తక్కువే సేకరిస్తోందని చెప్పాలి. గతఆర్థికసంవత్సరంలో మన రాష్ట్రం మొట్టమొదటిసారిగా 100కోట్ల రూపాయలు పరిమితిని దాటగలిగింది. గతసంవత్సరంలో మన రాష్ట్రం రు. 160కోట్లు సేకరిస్తే, దానినుండి 2/3 వంతు మన రాష్ట్రానికి లభించింది. ఇప్పుడు మన ప్రభుత్వం ఈ కార్యక్రమానికి ఎంతో ప్రాధాన్యతనిస్తూ, ఈ ఆర్థిక సంవత్సరానికి 200 కోట్ల రూపాయల పరిమితిని దాటడానికి తగిన ప్రోత్సాహమిస్తున్నది కాబట్టి మా ప్రచార కార్యక్రమాల్ని కూడా పెద్దపెట్టున పెంచి ఈ లక్ష్యాన్ని సాధించాలనుకుంటున్నాము.





కర్నాటక అసెంబ్లీ
ఫొటో: కె. విజయకుమార్

Hyderabad-500 482

ఉషా కిరణ్ మూవీస్

# మల్లెమొగ్గలు

రామోజీరావు · వి. మధుసూదనరావు

ఉరుకులెత్తే
ఆ జలపాత హోరు!
పరుగులెత్తే
ఈ పరువాల జోరు!!



సి.యస్.రావు. రమేష్‌నాయుడు. ఎస్.నవకాంత్. టి.కృష్ణ. భాస్కరరాజు. ప్రకాష్-శేషు. అట్లూరి రామారావు